శ్రీగురుకటాక్షము.

# అచలబోధయను
# శుద్ధనిర్గుణతత్వకందార్థదరువులు
# తాత్పర్యసహితము.

సాధనచతుష్టయసంపత్తిగలయధికారికి, ఆవరణవిక్షేప
రూపంబగుశక్తిద్వయనిరాసకమై, కేవలాత్మాను
భవవేద్యంబగునటుల భాగవతుల
కృష్ణదాసులవారిచే రచియింపంబడినది.

ఇది,

పోకల-శేషాచలాహ్వయునిచే సరిచూడబడి
తాత్పర్యము వ్రాయబడి
వె. నా. జూబ్లిముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపంబడియె

మొదటి కూర్పు ౧౦౦౦—కాపీలు.






Madras.
౧౮౯౦ సం॥ నవంబరు నెల



దీనివెల అణాలు - ౧౨

శ్రీగురవేనమః.

# ప్రకటన పత్రిక.

---

శ్రీమద్వేదాంతసారంబును, అచలపరిపూర్ణంబును, అతిసుందరమునైన సద్గురునాథునకు శిష్యుండగు పోకల-శేషాచలనాయఁడు భక్తి వైరాగ్య, యోగ, జ్ఞాన జ్ఞానాతీతములనెడు వేదాంతమార్గములు పుణ్యపురుషులును స్త్రీలును గ్రహించి, సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, సార్ష్టిత్వ, మోక్ష, పరమపదవులనుపొందుటకుగల ఆంధ్రంబున వచనకావ్యంబుగ రచియించి రిజిష్టరు చేయఁబడినగ్రంధములవివరము.

| | వెలలు | | పోస్టేజి. | |
|---|---|---|---|---|
| | రూ | అ | అ | పై |
| సుజ్ఞానదీపమనుగురుగీత ౨౦౮ శ్లోకం - టీకా తాత్పర్యములతోడ | ౧ | ౮ | ౧ | ,, |
| శ్రీరామకృష్ణతీయమను ౧౮-అధ్యాయములుగల అచలగ్రంధం | ౧ | ,, | ౧ | ,, |
| సున్నిసిద్ధాంతముక్తరండాయిసంహితలు తాత్పర్యసహితం .. | ౦ | ౧౨ | ౧ | ,, |
| శ్రీకృష్ణబోధామృతమను పంద్రెండురాజుల కథలు .. | ౦ | ౧౪ | ౧ | ,, |
| శ్రీకృష్ణార్జున సంవాదమను పరమపద మార్గము ... ... | ౦ | ౮ | ౦ | ౬ |
| శ్రీరామహృదయమను యింద్రజాలపుకథలు ... ... | ౦ | ౮ | ౧ | ,, |
| వశిష్టజనక సంవాదమను అతీతమార్గగ్రంధం ... ... | ౦ | ౦ | ౧ | ,, |
| శుకసంచవింశతియను చిలుకచెప్పిన ౨౪-కథలు... ... | ౦ | ౮ | ౧ | ,, |
| సుజ్ఞానరత్నావళియను ౧౦౮-వేదాంతకీర్తనలు ... | ౦ | ౬ | ౦ | [illegible] |
| భక్తవిజయమను పరువురు మహాపతివ్రతలకథలు... ... | ౦ | ౬ | ౦ | ౬ |
| ఆత్మలక్షణసారమను గ్రంథం ... ... ... | ౦ | ౨ | ౦ | ౬ |

శ్రీమచ్చెన్నపురింబున పెద్దినాయునిపేట నాటుపిళ్లారి గుడివీధి కవాటసంఖ్య (౨౦) గల మందిరంబున యీగ్రంధములు సదా విక్రయింపఁబడును. ఈరిజిష్టరు గ్రంధములను గొనువారలకు ౧౦౦-కి రూ. ౧౨-వంతునకమీషన్ అనగా తో శ్రీ యివ్వబడును. రూ. ౧౦-లకు తక్కువగా కొనెడువారలకు కమీషన్ యివ్వబడదు.

౧౮౯౦ సం
నవంబరు నెల ౨౨-తేది

ఇట్లు
గ్రంథకర్త
పోకల - శేషాచలమునాయఁడు.

## పీఠిక.

## సచ్చిదానందగురుపరంపర.



శ్రీమద్వేదాంతప్రవర్తకుండును, మహాయోగపురుషుండును, జీవేశ్వరైక్య సమాధిలక్షణలక్షితుండును, జ్ఞానసంపన్నుండును, సచ్చిదానందస్వరూపకుండును నైన పోతులూరు వీరబ్రహ్మముగారును * వీరబ్రహ్మముగారికిప్రియశిష్యుండు దూదేకులసిద్దప్పగారును * సిద్దప్పగారికి ప్రియశిష్యుడు జంగంఅమరలింగంగారును * అమరలింగ గురువులవారికి ప్రియశిష్యుడు, శేషరాజుగారును * శేషరాజుగురువులవారికి ప్రియశిష్యుడు, చెంచురాజుగారును * చెంచురాజగురువులవారికి ప్రియశిష్యులు, అమినిగడ్డ కోటప్పదేవరవారును * కాశింసాహేబులవారును పోకల-శేషాచలాహ్వయుండును * యింకనుగొందఱుగలరు.

అచలగురుపరంపరలోనొకడైన శ్రీశివరామదీక్షితులవారి, శిష్యుడు వల్లూరు-రామకృష్ణయ్యగారును * రామకృష్ణయ్యగారికి ప్రియశిష్యుడు, మహేశ్వరుండును * మహేశ్వరులవారికిప్రియశిష్యుడు పైచెప్పినకోటప్పదేవరగారును * కోటప్పదేవరవారికిప్రియశిష్యుడు పోకల-శేషాచలాహ్వయుండును * ఆట్టిశేషాచలాహ్వయునిశిష్యమండలిలో ముఖ్యశిష్యుడు వేంకట్రావును.



సిందె-వేంకట్రావు.



పోకల-శేషాచలాహ్వయుండు.



శ్రీగురవేనమః.

# శుద్ధనిర్గుణతత్వకందార్థదరువులు తాత్పర్యసహితము.

---

పద్యం ॥ జనులార జననమరణము । లనుదొలఁగి న్రోయఁ
జాలులక్షణయుతమై । వినువారికిఁగనువారికి । దినలావెటకఁగను
మదీనితప్పకవింటే * అప్పుడెవారలెప్పుడుగంటే * గనుకవిన
బుద్ధియైతే వినుడుచదివెడమీరు కే । కనుగొనుమనస్సైతే కనుడి
పుస్తకమంత తప్పకవింటే * అప్పుడెవారలెప్పుడుగంటే। ౧॥

తాత్పర్యము ॥ ఓనరులారా! జననమరణప్రవాహములనుండి దొల
గించి, నిజస్వరూపలక్షణములను దెలియజెప్పెడు యీగ్రంథ పద్ధతుల
నుదెలుసుకొనుడు. ఈగ్రంథమునునే జదివెడను మీరు వినుడు, లేక
చదువనపేక్షించినవారు కడపటకును జదువుటయు యుక్తమని భావము.

ప॥ వినవలెకనవలెననుచును । మనసందుసగోర్కె గల్గుమను
జులెవినుడీ । వినజేసెదకనజేసెద । ఘనమగుకీబోధవినగగిన
నొల్లనట్టి * వారుచనుడుత్రోచినత్రోవబట్టి * తినుమంచుపులి
వల్లదనిలోకులనవింటి । గనుకనిదివినవలెననమోరాడదువినగ
గనమెల్లనట్టి * వారు చనుడుత్రోచినత్రోవబట్టి॥ ౨॥

తా॥ ఓనరులారా! వినవలెనని కనవలెనని మనస్సున యిష్టము
గలవారే యీపద్యములనువినుడు, చదువుడు, చదువుటకునువినుటకును
యిష్టములేనివారువారికిష్టమైన మార్గమునంబోవుడు, తినుమనినను పులి
తిననొల్లదనిలోకులనెదరుగావున, వినుడనికనుడని నేనుప్రార్థించుటలేదు.
ఇష్టముగలవారు వినవచ్చును జదువవచ్చునని భావము.

ప॥ ననుమిముమనేగనిపుస్తక।మును జేసితిదీనిమీరుముదమున
వినుడా।ననుటయుమిమునను మీరలు। గనుగొనివినుపించుమను
టకలయట్టిమాట*బోధనుమేల్కగనలేదెచోట్ట*ఘనులారయు

టువంటికలలోముచ్చటలాడి। గనుగొనిమీరుమేల్కనిమేల్కొ
ల్పుదునన్ను కలయట్టిమాట * బోధనుమేల్క గనలేదెచ్చోట॥౩॥

తా ॥ ఓనరులారా! నన్ను మీరును మిమ్ము నేనును జూచి యీ గ్రంథమును జేసితిని, మీరుసంతోషముతో వినుడు, నాకు మీరును మీకు నేనును గనుపించి మాట్లాడుటలు, కలగానిజాగ్రత కాదు. జాగ్రత బోధను దెలియదు, యీకలలో మనము ముచ్చట్లాడుదము, నన్ను మీరు మేల్కొల్పుడు, యీగనుపించెడు ప్రపంచ రూపునామములుగల సర్వమును కలయేగాని జాగ్రత కాదని భావము.

ప॥ ఒరులారులు నేను నేనని। యొరులను తను నెన్న దెలియగకున్న
బయలులో। నరుదెంచితన్ను తాగని। పరులనుగని లెన్న యేనుపరు
లనియనుచు * యెఱిగెడుయెఱుక బయలుండగనుచు* నింతము
తానెందు నిలువకుండుటకునై । విరచి స్తిదీన్నె యెఱుక వినిననిల్వదు
నేనుపరులనియనుచు*యెఱిగెడుయెఱుక బయలుండగనుచు॥ ౪॥

తా ॥ తన్నును పరులను యెన్న దెలియగని పరిపూర్ణము నందు యెఱుకవచ్చి తన్నును పరులనుయెఱిగి, యీయెఱిగిన యెఱుక చేత పరిపూర్ణమునుదర్శించి, తానెందునునిలువకుండ మటుమాయముగా బోవుటకొఱకై యీగ్రంథమును జేసితినని భావము.

ప॥ శ్రీమించునచలబోధను । యేమహనీయుండుచేసి యెగ
జల్లెనునీ । భూమిని సుజనులకొఱకా । రాముండగు గురునిశివ
రామదీక్షితులన్ *తలచియప్పారావుగుణతతులన్ * ప్రేమతో
బాగడనాభూమినిర్జరపరశు। రామసీతారామస్వామికి మ్రొక్కి
శివరామదీక్షితులన్ *తలచియప్పారావుగుణతతులన్॥ ౫॥

తా ॥ ఈలోకమున సుజనులకొఱకై మహాశ్రేష్ఠమైన యచల పరిపూర్ణబోధను వెల్లడి జేసిన శివరామదీక్షితుల వారిని మనంబున సేవించి, అప్పారావులవారిని వినుతించి, పరశురామ సీతారామస్వాముల వారికి సాష్టాంగనమస్కారములు గావించితినని భావము.

ప॥ ఎఱుకనుకలలోపలనే । నరుదెంచితిమీరలట్టులరుదెం
చితిరీ । యెఱుకజననేనుమీరలు । యెఱుకతోజనువారమను
చు యెఱిగేటికొఱకు * గ్రంథము జేస్తినెఱిగియీవరకు * గురు

బోధంచునుమీరునరులారచేకొంటి । యెఱుకనకలజోలినెఱిగిన
నిల్వదంచెఱిగేటికొఱకు * గ్రంథముజేస్తినెఱిగియీవరకు ॥ ౬ ॥

తా ॥ ఓనరులారా! యెఱుకయనెడు కలలోపల, నేనునుమీరు నువచ్చితిరి, యెఱుకతోడమనము బోవువారము. యీపరిపూర్ణబోధవలన యెఱుకయనెడు కల తొలగిపోవును. అందుకై యీగ్రంథమును జేసితినని భావము.

ప॥ శ్రీమత్సీతారామ । స్వామికృపంజెప్పనయ్యెసదసద్రహి
తం । బేమిపదార్థమెుదానిని । యీమహికందార్థములుగనిది
వినరయ్యా * ప్రాజనులారయిటుగానరయ్యా * సేమారునేమి
మ్మువేడెదింతియనుమ్మి । నామీదకృపజేసినను జడువుమని మీ
రలిదివినరయ్యా * ఓజనులారయిటుగానరయ్యా ॥ ౭ ॥

తా ॥ ఓజనులారా! శ్రీసీతారామస్వాములవారికటాక్షముచేత, సదసత్తులురహితమైన యచలపరిపూర్ణబోధను కందార్థములు గారచియించినాడను, మీరునామీదదయయుంచి నన్నుజడువుమనిమీరువినుడు, లేదామీరేచదువుడని భావము.

ప ॥ శివరామదీక్షితులశిష్యవరుడప్పయ్యమంత్రియతనిశి
ష్యుండి । భువిపరశురామవంశో । ద్భవుసీతారాములతనిభక్తు
డనుమ్మీ * తద్బోధప్రయుక్తుడనుమ్మీ * స్తవసీయులగుమీరు
త్సాహముతోయీక । థవినుడునేకందార్థములచేవినుపింతుభ
క్తుడనుమ్మీ * తద్బోధప్రయుక్తుడనుమ్మీ ॥ ... ౮ ॥

తా ॥ శ్రీశివరామదీక్షితులవారి శిష్యుండుఅప్పయ్యమంత్రి, అప్పయ్యమంత్రివారిశిష్యుడు పరశురామవంశమునంబుట్టిన సీతారామస్వాములవారు, ఆసీతారామస్వాములవారికి నేనుభక్తుండను, అచలబోధపరుండను, కీర్తిపరులైనమీరుసంతోషముతో యీకథనువినుడు, నేను కందార్థములుగావినుపింతునని భావము.

ప॥ మనసిచ్చివినుడియికనొక । మనివిదినాపాలిగురునిమది
లోపలనే । నునుచుకొనిపెద్దలాజ్ఞను । పనిబూనుకచేసితిట్టిపద్య
ములిన్న * తప్పొప్పులేర్పడదిద్దుడన్న * ఘనమతిమంతులుగను

కఁబ్రార్థించితి । ననుమీకటాక్షేక్షణలపేక్షింపుచు పద్యములిన్న
* తప్పొప్పులేర్పడదిద్దుడన్న ॥ ... ... ౯॥

తా॥ పెద్దలాజ్ఞచేతనాపాలిటి సద్గురుస్వామినిమనంబున నిలుపు
కొనిరచియించిన,యీకందార్థములయందలి తప్పులనుయొప్పులనుబుద్ధి
మంతులు యేర్పరచిదిద్దుదురని యాబుద్ధిమంతులైనవారినిం బ్రార్థించె
దను,నన్ను మీరుకరుణతోజూడుడని భావము.

ప ॥ వినిమీరిదిదిద్దుండని।పనిపడిబ్రార్థింపనేలపరుసమునిను
మే । ననుస్వర్ణముజేయుమనునె। తనకై తానొనుసన్నిధానమం
దుంటే * తెల్పుడీయనుమానమిందుంటే * మనివిజేసునెపాలి
మ్మనిలేగతల్లిని । తనకై తానిచ్చునుదయచేసితాసన్నిధానమం
దుంటే * తెల్పుడీయనుమానమిందుంటే ॥ ... ౧౦॥

తా ॥ ఈకందార్థములను మీరుజక్కగావినిదిద్దుండనినేనుబ్రా
ర్థించుటెందుకు, ఇనుముతన్నుబంగారముగాజేయుమని స్పర్శవేధిస్ప్రా
ర్థింపునా, అటువలెనేనుమీపమందుండినతనకుతానేయగుచున్నది,అను
మానమువలదు, ఆవు, తనదూడ తన్నుపాలుయిమ్మని ప్రార్థించకనే స
మీపమందుండిన తానుగానే పాలుయిచ్చునని భావము.

ప॥ అప్పకవీయాంధ్రమము । లొప్పగుమాఘాదికావ్య
మొగిజదివికృతిక । దప్పనికవులకుసమముగ । దప్పులులేకుండ
జెప్పదరమానెకృతిని * యూహానుజేస్తిమరినేనీకృతిని * గొప్ప
పక్షులతోటికొదువపక్షులుసాటె । నుప్పరవీధినికూటాడెటందు
కుతరమానెకృతిని * యూహానుజేస్తిమరినేనీకృతిని॥ ౧౧॥

తా ॥ అప్పకవీయమును,మాఘాదికావ్యములను జదివినకవుల
తో నేనుసమముగా,తప్పులులేకుండాజెప్పుటకునాతరమగునా, సద్గురుబో
ధయనెడు యూహచేతనీగ్రంధమునుజేసితిని,ఆకాశమునందుతిరుగుటకు
గొప్పపక్షులతోడ చిన్నపక్షులు సాటియగునా=సాటికావని భావము.

ప ॥ ఛందముతెలుగకపద్యము । లెందుకుజేసెదవటంచుని
లజనులననే । సందేహింపకజేసితి । నిందునదప్పున్నమీరలివి
దిద్దనుచు * నేజదివితెచెవిమొగ్గివినుచు * అందముగాజే త్త

మందిట్లుతలపోసి। కందార్థములుమీాముందరబెట్టితి యివిదిద్దు
రనుచు * నేజదివితేచెవియొగ్గివినుచు॥ ... ౧౨॥

తా ॥ నీవుఛందోలక్షణములను దెలియకపద్యములెందుకు జేసె
దవని నన్నుకొందఱుయాక్షేపించిరి,నేనుసందేహింపక నీగ్రంథమునుజే
సితిని ,బుద్ధిమంతులైనవారుయివిదిద్దుదురనియును, నేజదివినచెవియొగ్గి
వినుదురనియును,నాజత్తమునందలంచియీాకందార్థదరువులనురచియిం
చి మీాముందరబెట్టితినని భావము.

ప॥ పునరుక్తిగలిగియుండిన । వినికోపముసేయవలదువేడు
కొనియెదఁ । వినువారలుదూరార్థము । గనవలెదగ్గరనటంచు
గల్పించినాను * తెలియకగాదీగ్రంథములోను * జననీజనకు
లుదాముతనయులపునరుక్తి । వినగోసుదురుతప్పెంచకనేనదితె
లిసికల్పించినాను * తెలియకగాదీగ్రంథములోను॥ ౧౩॥

తా ॥ ఈపద్యములయందు జెప్పినపదములను మఱలమఱలజె
ప్పుటచేత పునరుక్తిదోషమనియెంచి కోపముచేయవలదు,దూరార్థము
ను దగ్గరదెలుసుకొనుటకై నేనిటులరచియించితినేగాని, తెలియక
గాదు, తల్లిదండ్రులు,తమబిడ్డలుపదేపదెజెప్పిన మాటలనుసంతసింతురే
గాని వారిమనంబునగోపింపరనిభావము.

ప॥ ఇదియాంధ్రకవిత్వంబని । మదిరోయగదగదుదీనిమర్మ
మరయుడీ । పదియారువన్నెపసిడిసి । ముదమునతోల్పెట్టె
నుంచముట్టకుండుదురా * లోకులుచేతబట్టకుండుదురా*యిది
గాకకులహీనుడిచ్చినద్రవ్యము।విదితముగాసెంతవేత్తలైననుదా
నిముట్టకుండుదురా * లోకులుచేత బట్టకుండుదురా॥ ౧౪॥

తా ॥ ఇవి తెనుగుపద్యములని మనంబున యసహ్యాభావమును
బొందవలదు, ఈపద్యములయొక్క భావమును జక్కగాదెలియుడు, పది
యారువన్నెగలబంగారమును తోలుపెట్టియలోనంబెట్టినను, అదిలోకు
లుగ్రహించకుందురా, ఇదియునుగాకకులహీనుడిచ్చినద్రవ్యమునువెం
తటి కులశ్రేష్ఠులైనను గ్రహించకుందురా, గ్రహింతురని భావము.

ప ॥ ఆసాంతముయీాగ్రంథము । ప్రాసయతుల్పబ్దగణము
భావముయుక్తుల్।జూచిసరిపడనిచోటను। యీాసభలోపెద్దలెల్ల

నివిదిద్దవలెను*దిద్దినదినామదికందవలెను*మీసాటివారికివేసట
లిందుంటె । నాసాటివారిబ్రతుకేసాటిగాకుండునివిదిద్దవలెను *
దిద్దినది నామదికందవలెను॥ ౧౫॥

తా ॥ ఈపద్యములయందలి, యతి, గణ, ప్రాసములను, భావములను, యుక్తులను, జక్కగావిమర్శించి, సరిపడని తావున యీసభయందుండెడు పెద్దలు నాటిని దిద్దవలయును, దిద్దిన యంశమును నాకుందెలుపవలయును, మీవంటివారికే యిసుకుబుట్టిన యెడల నావంటివారిబ్రతుకు యేమాత్రమని భావము.

ప॥ తప్పొప్పులురెండెఱుగని । తప్పుతనందుండిదీనితప్పనికూ
సె।తప్పుడునరునకుజెప్పెద।చప్పుడుచాలించుమనుచుసభవారువి
నగా * సరేసరేయనిసభవారిట్లనగా * చెప్పినవినకుంటెతప్పు
వానిదెసుమ్మి । తప్పుగలిగినవెనుకగొప్పవాడెట్లౌను సభవారువి
నగా * సరేసరేయనిసభవారిట్లనగా॥ ... ౧౬॥

తా॥ తప్పును, ఒప్పును, యీరెంటిని యెఱుగని తప్పు తనయందుంచుకొని, యీపద్యములు తప్పనిచెప్పెడు యాతప్పుడు జనులమాటలుసరిగావు. ఒప్పునుతప్పనిజెప్పినవెనుక వాడు గొప్పవాడుకానేరడనిభా.

ప॥ ఇలుజొచ్చిగ్రామసింహము । కలదొంతులుగూల్చునిం
టిగరితలొరుగుదొం । తులుజక్కజేతురట్లనె । యిలసుకవిజ
నోక్తితప్పులెంచుదుర్జనుడు*తప్పొప్పులుగాంచుసజ్జనుడు* తుల
లేనిబుద్ధిమంతులుసర్వజ్ఞులుమీకు । తెలుసునాతలపు నేతెలిపె
దనికతప్పులెంచు దుర్జనుడు*తప్పొప్పులుగాంచుసజ్జనుడు॥ ౧౭॥

తా ॥ తమయిండ్లయందు కుక్కలుదూరి, దొంతికుండలు పడద్రోచినయెడల,కులకాంతలెటులవాటినిజక్కపఱతురో, అటువలెనేసజ్జనులు తప్పులనుసవరింతురు,దుర్జనులు తప్పులెంచుదురు, గావునమతిమంతులైన పెద్దలు నామనోభావమును జక్కగా దెలియుదురనిభావము.

ప ॥ తనగొప్పనెంచరేమో । జనులనితలపోసిసాధుజనకృత
కవితల్ । వినరితరులువినగోరిన । వినకనరాదనుచుమనసు వి
రుచుదుర్జనుడు * వినుపించునువేడ్కసజ్జనుడు * కనవచ్చుముం

జేతికంకణాలకువేరె । ఘననిల్వుటద్దముగావలె నామనసు విరుచుదుర్జనుడు * వినుపించునువేడ్కసజ్జనుడు॥ ... ౧౮॥

తా॥ సాధువులు రచియించిన కృతులను వినవలదని దుర్జనుడు చెప్పును,సజ్జనుడు వినుమనిజెప్పి వినుపించును, ముంజేతి కంకణములను జూచుటకు అద్దముకావలసినదిలేదని, దుర్జనుడు తానుజెడుటయే గాక యితరులనుగూడాజెరుచును, సజ్జనుడు యితరులనుగూడాసుగతినింబొందించునని భావము.

ప॥ ఆగామికథనుయిట్లని । బాగుగవినుపింతుచెవులపండువుగాగ । న్నాగమనిగమోపనిష । త్సాగరమథితార్థమెల్లసాంగోపాంగముగ *దయతోవినుడిసాంగోపాంగముగ * ప్రాగర్థచరమార్థయోగములకునుసం।యోగముగావించి నేగుర్తెఱిగినంత సాంగోపాంగముగ *దయతోవినుడిసాంగోపాంగముగ॥౧౯॥

తా॥ ఆగామికథయనగా=ఇకమీదుకలిగెడు జననమరణములనుగురించి నేనువేదస్మృతులనియును, ఆగమములనియును,జెప్పంబడిన మహాసముద్రమును జక్కగాతరచియెత్తిన సారాంశమైన నాయనుభవమును, శ్రోత్రములకానందముగా కడవరకువినుపించెదను మీరుదయతోవినుడు. ఆత్మశరీరములకు సంధానముచేసి యీరెండును యొక్కటే యని నేనుయెఱిగినంత మీకుజెప్పితినని భావము.

ప॥ మోదమునప్రొద్దుబోకకు।వాదిప్రతివాదులగుచువరగురుశిష్యుల్।వాదించిరనుచునొకసం।వాదముగల్పిస్తికలగ వదలకవినుడీ* మొదటినుండితుదవెళ్ల గనుడీ* వేదాంతార్థమును వేత్తలీమీరిందు । యేదేదిసవరించుడిదెనావిజ్ఞాపనవదలకవినుడీ * మొదటినుండితుదవెళ్లగనుడీ॥ ... ౨౦॥

తా॥ ప్రొద్దుబోవుటకై వాదిప్రతివాదులవలె గురుశిష్యులు వాదించినటుల సంవాదమునుగల్పించి, యీగ్రంథమునురచియించితిని,కలయునిమీరుదీనిని మొదటినుండితుదవెళ్ల తెలియుడు, వేదాంతవేత్తలైన పెద్దలువిని వీటిలోతప్పుగలిగినచోట సవరింతురనిభావము.

ప॥ కొంచెములోసరిపుచ్చక। పెంచితినీగ్రంథమనుచు బెద్దలలుకగ।మించినవేడ్కనువినుడీ। పెంచినయర్థంబునేజెప్పెద లో

కులెల్లా*అర్థము తెలిసిమదినుల్ల సిల్లా* పెంచితి పెంచితి కొంచెము
వెడలుపు । నుంచుండెనదిలోతంచెంచినామదినిజెప్పదలోకులె
ల్లా*అర్థము దెలిసిమదినుల్లసిల్లా ॥... ... ౨౧॥

తా॥ అచలపరిపూర్ణభావమును గొంచెములోసరిపుచ్చక, లోకములోని వేదాంతులు నామనోధర్మమును జక్కగాదెలుసుకొని యుత్సాహమునుబొందుటకై, కొంచెమువెడల్పుగానునిడివిగాను పెంచితిని, వీటియొక్క యర్థమునుజక్కగాబోధపడి యానందమునుబొందుటకొఱకై యీగ్రంథమును రచియించితినని భావము.

ప॥ సాధనసంపత్తియుగల।సాధకుడొకనరుడుఘోరసంసార
ములో।బాధపడలేకతనపు।ణ్యోదయమునగురునిగాంచియుచిత
రభక్తి*శరణని(మ్రొక్కి)మరిమరియుక్తి * బోధజేయుపుణ్యా
పురుషమాబోట్లకు । సాధించదగుముఖ్య సాధనమనిబల్కెయు
రుతరభక్తి * శరణని(మ్రొక్కి)మరిమరియుక్తి॥ ... ౨౨॥

తా॥ సాధనచతుష్టయమనగా=నిత్యానిత్యవస్తువివేకమును, ఇహాముత్రార్థఫలభోగవిరాగమును, శమాదిషట్కసంపత్తియును, ముముక్షుత్వమును, యీనాలుగును సంపత్తుగాగలిగిన యొకపుణ్యపురుషుడు, ఘోరమైనయింద్రియములనెడు సంసారసాగరమును యీదజాలక, తనపుణ్యావశంబునయచలగురునింగాంచి, యోమహాత్మా! పుణ్యపురుషా!నావంటిపామరునకు, జననమరణములులేని యచలబోధను గటాక్షించిరక్షించుము, నేనుసాధించవలసిన ముఖ్యసాధనమేయదియని, సాష్టాంగనమస్కారములుగావించెనని భావము.

ప॥ శరణాగతుడగుశిష్యుని।కరుణామృతదృష్టిచేతగనిమోద
ముమ।ప్పిరిగొనమృదువాక్యములను । పరమదయాళుండుగురు
డుభక్తవినుమనెను*సంశయమింకబాధింపదనెను*పరిపూర్ణమొ
కటిలేనెటుకనేదొకటుండు। పరిపూర్ణమెటుకలనెటెగిమెటుకను
మానుభక్తవినుమనెను * సంశయమింకబాధింపదనెను ॥౨౩॥

తా॥ సాష్టాంగపడి నమస్కరించినశిష్యుని యాయచలగురుడు, కరుణారసదృష్టిచేతనెత్తియాదరించి, భక్తుడావినుము, ఇంద్రియములనేడు సంసారతాపత్రయాదులు (అనగా=అధ్యాత్మికఅధిభౌతిక అధిదై

వతములు) నిన్ను బాధింపనేరవు, పరిపూర్ణమనియును, లేనియెఱుకయని యును రెండుగలవు. ఆ రెంటిలో పరిపూర్ణమును గ్రహించి, లేనియెఱుకను సమూలముగా విడిచినయెడల నిన్ను సంశయములు బాధింపనేరవని భా.

ప॥ ఏసాధన నీ కెందుకు । ఏసానికి పనికిరాదు వినుమాయయ్యా । నేసాధులచేవిన్నది । యేసాధనలేనిబోధ యెఱిగింతుబోకు * సాధనలందుమఱిగి తేరాకు * యేసాధనలజోలియేనొల్లననినీవు । బాస జేసితివేని పరిపూర్ణబోధ నే నెఱిగింతుబోకు * సాధనలందుమఱిగి తేరాకు ॥ ... ... ౨౮॥

తా॥ బిడ్డా! నీకు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనెడు అష్టాంగలక్షణములును వివిధ ముద్రల మార్గములును యోగములును బనికిరావు, నేను సాధులవలనవినినది, యేసాధనయును లేని యచలబోధ, నీవును దానిని గ్రహించుము. ఇకమీదు యేసాధనలతో నువర్తించుట లేదని నీవు ప్రమాణము చేసినయెడల, నీకు అచలపరిపూర్ణబోధను యెఱిగింతును, లేక సాధనలందువర్తించువాడవయ్యేనేని నాయొద్దకురావలదని భావము.

ప॥ గురువరపరిపూర్ణంబన । యెఱుకననవి రెండు నెట్లు యెఱుకోద్భవము । దెఱుక చను చోటుయెయ్యది । యెఱుకను నే నెట్లు విడిచే దెఱిగింపుమనెను * అంత నెగురుడు యెఱిగింతుననెను * చరణధూళిని రెండుకరములగొని తన । శిరమునధరియించి శరణనియాశిష్యు డెఱిగింపుమనెను * అంత నెగురుడు యెఱిగింతుననెను ॥ ౨౯॥

తా॥ ఓ సద్గురుస్వామీ! పరిపూర్ణమనియును, లేనియెఱుకయనియును రెండుగలవని సెలవిచ్చితిరి. అవి యెట్లు, లేనియెఱుక యుద్భవమెట్లు, యెఱుక లియ్యమయ్యేడుచోటెయ్యది, యెఱుకను నే నెటులవిడుతును, యెఱిగించుడని సద్గురుమూర్తి పాదకమలములయందలిధూళిని (అనగా=దుమ్మును) తనశిరంబున ధరియించి యాశిష్యుడు బోధించుడని ప్రార్థించిన యా సద్గురుడు యెఱిగింతును వినుమనెనని భావము.

ప॥ మొదలచలము నెఱిగించెద । విదితముగా లేనియెఱుక వివరింతుపయిన్ । తుద కెఱుకను విడిపించెద । మదిలో నామాటనమ్మిమరివింటివేని * సంశయబుద్ధిమానుంటివేని * పదుగురుని నుజూచి భ

ళిశాబాసీత్రోవ। కెదురులేదనునట్టులిదుగోనేజేసెదమరివింటివే
నిఃసంశయబుద్ధిమానుంటివేని ॥ ... ... ౨౬॥

తా॥ శిష్యా! మొదటయచలమును, బిమ్మట లేనియొఱుకను, వినుపింతును, తుదనుయొఱుకనువిడిపింపఁజేతును, నామాటలునీమనంబుననమ్మినీవుసంశయములేనివాడవైతివేని, పదుగురునిన్నుజూచి భళి శాబాసు యీమార్గమునకు పైమార్గములేదని నిన్నుశ్లాఘించునటుల జేయుదును, జక్కగావినుమనిభావము.

ప॥ మీరంతవారుగనుకనె। జేరితిమీపాదసేవసిద్ధించుటకై।
లేరింతవారుజగమున। లేరనినామదికిదోచెలెస్సగవినుడే * ఆజ్ఞ
కుమీరలేదుగనుగొనుడీ* యేరీతివినుమంటెనారీతివినియెద। మీ
రానతివ్వండితోరాముయీబోధలెస్సగవినుడీ * ఆజ్ఞకుమీరలే
దుగనుగొనుడీ॥ .. .. ... ౨౭॥

తా॥ ఓసద్గురుస్వామీ! దేవరవారు అంతటిప్రభావముగలవారుగనుకనే మీపాదసేవకుండనైతిని. లోకమున మీయంతటివారును గలరా, లేరనినామనంబునకు జక్కగా దెలియవచ్చెను, మీ యాజ్ఞకు మీరుటలేదు, యేరీతివినుమనిన యారీతిగానే వినెదను, నాకు జక్కగా బోధించుడని భావము.

ప॥ మొద్దులనైననుదోల్తురు। బద్ధులబద్ధత్వమడవిపాల్సేతురు
మీ। వద్దికివచ్చినగనిపరి। శుద్ధపుబోధోక్తమైనసూక్తులుజెప్పి*
అందుకుఁదగినయుక్తులుగుప్పి * పెద్దలచేమీప్రసిద్ధివినివస్తి।
దిస్టుడనేవట్టి బుద్ధిహీనుడనన్నుసూక్తులుజెప్పి * అందుకుదగిన
యుక్తులుగుప్పి ॥ ... ... ... ౨౮॥

తా॥ ఓస్వామీ! దేవరవారు యెంతటిమందబుద్ధిగలవారినైనను కడతేర్తురు, బద్ధులైనవారి సోమరితనమును యడవిపాలుగావింతురు పెద్దలవలన మీయొక్క ప్రసిద్ధినివిని దేవరవారియొద్దకువచ్చితిని, నాకు పరిశుద్ధమైనయచలబోధయును, అందుకుందగినసూత్రములను, (అనగా= పాటువలును) యుక్తులనుబోధించి, బుద్ధిహీనుడనైన నన్నుకడతేర్చుభారముతమదేనని భావము.

ప ॥ నూటికనుబోధనామది । నాటినదికచాలుచాలుననునీ
వైనీ । నోటనుబలికెడుదాకను । సాటువలనుజెప్పుచుందుసరే
రానామాట * రాగోరుదుమరినేనీమాట * నూటికొక్కటిజెల్లు
మాటనిదెలియుము । మాటిమాటికివట్టిపాటలేటికినింకసరేరా
నామాట * రాగోరుదుమరినేనీమాట॥ ... ... ౨౯॥

తా ॥ శిష్యాయీయచలబోధనామనంబునకుజక్కగానాటినది. ఇకచాలుచాలుచాలునని నీవు నీనోటనుజెప్పునంతవరకును నేనుసాటు వలనుజెప్పుచుందును, నీవుజాగ్రతతోవినుము నీకువట్టిమాటలెందుకు, యీమాటలునూరుమాటలకునకమాటసరియని, నీమనంబునభావించు మనిభావము॥

ప॥ తానేననకనుయుండిన । దానికిబేరేమిబయలుదానేనను
చుణ్ణ । నేననియెదనేనెవ్వరు । లేనెఱుకనినమ్మియుండిలేనేలేనను
మీ * అట్లానంటెలేనేలేవుసుమీ * లేనేలేనని నేనులేకపోయి
యినవెనుక । తానుండుగదయంటె దానెట్లెటిగెదవీవులేనేలేన
నుమీ * అటానంటెలేనేలేవుసుమీ॥ ... ... ౩౦॥

తా ॥ శిష్యాతానునేననియనకుండునదియేపరిపూర్ణము । నేను నేననిజెప్పెదవు, నేనెవ్వరు, లేనియెఱుకలేకపోయినయెడలనీవులేనేలేవు, అటులయెఱుకలేకపోయినవెనుక, తానుండుటయెట్లు, తానుయెఱుగుట యెట్లు, తానుండుటయును, యెఱుగుటయును, ఋవికల్లయని భావము.

ప॥ మీరాజ్ఞయిచ్చియుంటిరి । నేరుపుతోబయలునెఱుకనె
ఱిగించిపయిర్ణ । పేరణతుయెఱుకననియె । ట్లారీతినియెఱుకపర
చుమయ్యాగ్రమొక్కెదను * అనుమానముచెయ్యకెయ్యెడను *
సారెకుమీపాదజలజయుగ్మమునాహృ । త్సారసముననిల్పినలు
వుచుపూజనోయయ్యాగ్రమొక్కెదను * అనుమానముచెయ్య
కెయ్యెడనూ॥ ... ... ౩౧॥

తా ॥ సద్గురుస్వామీ దేవరవారుపరిపూర్ణమును,యెఱుకనుయె ఱిగించి, పిమ్మటయెఱుకనువిడిపింపజేయుదుననిసెలవిచ్చితిరి,అదేప్రకా రమునాకుబోధించుడు, నేనుసంశయములేనివాడనై. దేవరవారి పాదప

ద్ధములనునాహృదయకమలముననిలుపుకొని, సదాపూజితునని పెక్కు విధములవినుతించి, సాష్టాంగనమస్కారములు గావించెనని భావము.

ప॥ పుట్టుటగిట్టుటలేకను । పుట్టేగిట్టేటిమొలకపోడిమొలగ కదా । చట్టువలెకదలకుండును । బట్టబయల్ యిట్టిదెలిసి భావింపదగును * మొలకచేతసేవింపదగును * వట్టియాశలచేతపట్టుబడకనుయీ । గుట్టుతెలిసి కునోటపుట్టిగ దెలుసుకభావింపదగును * మొలకచేతసేవింపదగును॥ 3౨॥

తా ॥ శిష్యా, పుట్టుకయును, చావును లేనిపరిపూర్ణము చట్టువలె కదలకయొకటే విధముగానుండును, పుట్టుకయునుజావునుగలిగిన మొలకచేత నాపరిపూర్ణమును మొలకసేవింపనగును, వృథాయాశలనుబొందక, దేశికస్వాముల వారినోటయీగుట్టునుజక్కగా దెలుసుకొనిన, యీ మొలకవలననే పరిపూర్ణమును సేవింపనగునని భావము.

ప ॥ ఎటులకై నరీతి నుండును । మొలకననర్థ్యంబటంచుమొన్ని నమొలకకా । మొలుగుదునని నను మొలుకే। మొలుగుటమర్మ భమునుమ్మియీరాయుత్తబయలు * మొలుగునెమొలుక నెలుకనిబయలు* పెరుగదువిరుగదుయొరుగదుతరుగదు । అరుగదుకరుగదుతిరుగదు మొరుగదుయీరాయుత్తబయలు* మొలుగునెమొలుక నెలుకనిబయలు॥ 33॥

తా॥ శిష్యా, ఎటుకేనేనుమొలుగుదునని మొలుకనుమొలుకేమొలుగునుగాని, పరిపూర్ణముమొలుకనుమొలుగదు, పరిపూర్ణము పెరుగక హెచ్చక, తగ్గక, విరుగక, తునిసిపోక, ఒరుకక, తరుగక, అరుగక, కరుగక, తిరుగక, సదాకాలముయొక్కటేవిధముగానుండునని భావము.

ప॥ పలుకునబలుకగరాకను । తలపోసెదమనినమదికిదగులేకమొపుడు । ములుగ్రుచ్చనందులేకను । గలిగున్నదిబట్టబయలుగదరమాయన్న * యిదుగోజూడుకదలదోయన్న * పలుకన్నబలుకకతలపన్నదెలుగక । చలియెండవానలకలయకనిలుచుండుగదరమాయన్న *యిదుగోజూడుకదలదోయన్న॥ 3౪॥

తా॥ శిష్యాపరిపూర్ణముపలుకులకందదు, మనస్సునకుందగులేదు, ముల్లుగ్రుచ్చునంత సందుమైనను లేక నిండియున్నది, గురుదృష్టి

చేతంజూడుము,అదికదలదు, పలుకైననుంబలుకదు,మనతలంపులనైన ను దెలుసుకొనదు, చలికిగానిఎండకుగానివానకుగానిచలించకసర్వకాలములయొక్క యేవిధముగానున్నది జూడుమనిభావము.

ప॥ సామర్థ్యమేమిజూపదు । కామక్రోధాదికములగలయదనిశమే। బాముతెలుంగదుయితరులు। యేమనిననుమారుబల్క దీబట్టబయలు*దీనికిమ్రొక్కేరితరజేజేలు * నామరూపక్రియనటనలన్నియుమీరి । యేమనియనరాకయేకమైయున్నదియీబట్టబయలు * దీనికిమ్రొక్కేరితరజేజేలు॥ 3౫॥

తా॥ శిష్యా పరిపూర్ణము తనసామర్థ్యమునుజూపదు, యేకాలమందును కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములనెడు, అరిషడ్వర్గములనుగూడను, యేపాపముతెలుగదు, యితరులుయేమిచెప్పిననుబదులుచెప్పదు, ఆహా అట్టిపరిపూర్ణమే పరమపదమని త్రిమూర్తులుమొదలగుదేవతలందరును మ్రొక్కులు వేయుచున్నారు, నామరూపక్రియలనెడు నటనలన్నియునుమీరి(అనగావ్యాప్తిరహితమై) యేమనియనరాక,అవాఙ్మానసగోచరమై యేకమైయున్న యీపరిపూర్ణమే, యేదులోకములవారికి సేవింపఁదగినదై యున్నదనిభావము.

ప॥ దానముధర్మమునగుణ।ధ్యానముప్రతిమార్చనంబుజపతపతీర్థ।స్నానములుముక్తిదములని । మానవుడొనరించుబయలుమాటాడదేమి*యెఱుకేలేదుమాటాడదేమి*ఔనుకాదనకనీవనకనేననకనొక్క।మేనైనతాగాకమితిమీరియున్నది మాటాడదేమి*యెఱుకేలేదుమాటాడదేమి॥ ... ... 3౬॥

తా ॥ శిష్యా దానమును, ధర్మమును, సగుణధ్యానమును ప్రతిమార్చనయును, జపమును, తపమును, తీర్థస్నానములును మోక్షమునకుమార్గములని మానవులుచేయుదురు, అచలపరిపూర్ణబ్రహ్మము మాట్లాడదు, యెఱుకేలేదుగనుక నేననియును, నీవనియును, ఔననియునుకాదనియును అనదు. పరిపూర్ణమునకు స్థూలశరీరముగాని,సూక్ష్మశరీరముగాని,కారణశరీరముగాని, మహాకారణశరీరముగాని గలిగియుండలేదు, పరిపూర్ణమునకు మితిమేరలులేక నిండియున్నదనిభావము.

ప॥ఇంతంతనియనరానిది।వింతలుసేయనిదియెన్నివిధములగ
నినగా।చింతలెఱుంగనిదీబయ।లెంతనినేవిన్నవింతునిక మీాదవృ
థగా* తెలుపుటవినుటకిది పెద్దకథగా*సంతతమొకరీతిసకలదేశ
ములయం।దంతటనిండున్నదిదిగోపరిపూర్ణము యిక మీాదవృథ
గా * తెలుపుటవినుటకిది పెద్దకథగా । ... 32॥

తా॥ బిడ్డా, అచలపరిపూర్ణము యింతంతనిజెప్పరానిది, యేవింతలనుజేయనిది, యేచింతలనుయెఱుంగనిది. అట్టిపరిపూర్ణమును నేనెట్లుకథగావినుపింతును, నీవెట్లువినెదవు, సకల దేశములయందును,సర్వకాలములయందును, సదాయొక టేవిధముగానిండినిభిడీకృతముగానున్న పరిపూర్ణమిదుగోజూడుమని భావము.

ప॥ ఆకాశాదికభూతా । నీకాత్మకమగుచునెఱుకయీజగమ
య్యె।రాకడపోకడగలదై।ప్రాకటముగదీనిలోను బట్టబయలిది
రా*కాదనియంటేవట్టిపల్కిదిరా*లోకత్రయముతనలోపలదిరు
గగ।జోకతోడుతదానిజో లెఱుగదిదియేమొబట్టబయలిదిరా *
కాదనియంటేవట్టిపల్కిదిరా ॥ ... 33॥

తా॥ బిడ్డా! ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి,యీ పంచభూతములే యాత్మయాయెను. యిదియేయెఱుకని జగత్తనిజెప్పంబడును. యెఱుకేరాకపోకలుగలదిగానున్నది, యీయెఱుకయందుండు పరిపూర్ణమునుజూడుము,కాదనియంటివాయెఱుకేయుల్లక్కిమాట, యెఱుకవల్లకలిగిన స్వర్గమర్త్యపాతాళలోకములుమూడును పరిపూర్ణము నందుతిరుగుచుండినను, అచలపరిపూర్ణబ్రహ్మముయెఱుక సమాచారమేమియును దెలియకుండునుగాబట్టియెఱుకేయుల్లక్కిమాటయనిభావము.

ప॥ తండోపతండములుగా।దండిఝుషాదికములన్ని తనలో
పలను।ద్దండతనుండినపోయిన।నిండుసముద్రంబుయెఱుగకుండునె
ప్పటికి*పరిపూర్ణమిట్లుండునెప్పటికి*యొండమావులరీతినుండెడుబ్ర
హ్మాండ। ముండినపోయినరెండుగుర్తెఱుగకనుండునెప్పటికి * పరి
పూర్ణమిట్లుండునెప్పటికి ॥ ... ... 34॥

తా॥ బిడ్డాయేళ్లయొక్కప్రవాహములనగాయేళ్లకుపోటుపాటులుగలిగి, సముద్రమునందు యెంతజలమువచ్చిచేరినను, యెంతజల

ముపోయినను, ఆసముద్రమునకుయెటులదెలియదో, అటువలెనేపరిపూర్ణసముద్రమునందు, యెండమావులవంటి అండపిండబ్రహ్మాండములుండినను, పోయిననుయీరెంటినిగుఱుతుయెఱుగక, పరిపూర్ణముసదాకాలము యిదేప్రకారముగానుండుననిభావము.

ప॥ ఎఱుకతోవచ్చినవిశ్వం। బెఱుకతోజనుగానినిల్వదీబయ
లైతే। యెఱుకతోరా దెఱుకతోబో। దెఱుకతోనందేమిలేదుయి
దినిశ్చయమురా॥ ఉండుండియీయెఱుక తానేరా * యెఱుకనె
ఱిగినవస్తువెఱుకనిదెలియుము। యెఱుకయెఱుగదు బయలిట్టిదట్టి
దియననిదినిశ్చయమురా॥ ఉండుండియీయెఱుక తానేరా॥౨౦॥

తా॥ ఎఱుకవలనంగలిగినప్రపంచము, యెఱుకవల్లనేనశించునుగానినిల్వడగానిలిచియుండదు, పరిపూర్ణముయెఱుకవలనరాలేదు, యెఱుకవలనంబోలేదు, యెఱుకతోటిపొత్తులేకసదాకాలము యొకటేవిధముగానున్నది,యిదియేనిశ్చయము, తన్నుదానెఱుగునదియునుపరిపూర్ణమునెఱుగునదియును, యెఱుకగానేదెలియుము, యెఱుక పరిపూర్ణమిట్టిదట్టిదనినిర్దేశింపనేరక, యెఱుకేతాననెడు యాత్మశబ్దమునుబొందుటేనిశ్చయమనిభావము.

ప॥ రవితమసమున్నదెఱుగున। ప్రవిమలదావాగ్నిచెదలుబ
ట్టునెఱుగున। దివసమురాత్రినిరాత్రిని।దివసమెఱుగునె లేమిల
క్ష్మీదేవియెఱుగునా * అన్నమునుభూదేవియెఱుగునా * భవనా
శస్థితులరాపాడేటియెఱుకను। భవనాశస్థితిలేనిబయలెట్లెఱుగు
నులక్ష్మీదేవియెఱుగునా * అన్నమునుభూదేవియెఱుగునా॥౨౧॥

తా॥ సూర్యునకు చీకటిసిందెలియదు, మండెడునిప్పునకు చెదలుపట్టదు, పగలును రాత్రియును, రాత్రినిపగలును యెఱుగదు, అన్నమును భూదేవియెఱుగదు, దరిద్రమును లక్ష్మీదేవియెఱుగదు, అటువలెనే చావుపుట్టుకలచేత నొప్పుచుండెడు యెఱుకను, చావుపుట్టుకయునులేని యచలపరిపూర్ణము యెఱుగదని భావము.

ప॥ ఎఱుకైనభూతపంచక। మెఱుకకుచరణములుకటియుహృ
దయముగళముల్। శిరమునువ్యోమ క్రమమున। ధరణిమొ
దల్జేసియిట్లుతనయాగుర్తెఱుగు * గగనముబయలంచనరాని

దెలుగు * యెఱుగకాకాశమెపరిపూర్ణమనుచుకొంౘదఱుబల్కి
రదివినికురిదప్పియుండేవుతనయాగు రైలుగు*గగనము బయలం
చనరానిదెలుగు ॥ ౨౨॥

తా॥ బిడ్డా యెఱుక పంచభూతములవల్లనే యాయెను, యెట్లనగా =పృథివివలన కాలుసేతులును, ఉదకమువలన నడుమును, అగ్నివలన హృదయమును, వాయువువలనకంఠమును, ఆకాశమువలనతలయును, గ్రమక్రమముగా గలిగెననియును, నీవు తెలుసుకొనుము, ఆకసమునుపరిపూర్ణమని జెప్పరాదనియును దెలుసుకొనుము. కొందఱువివేకశూన్యులు, ఆకాశమే పరిపూర్ణమనిజెప్పుదురు, అట్టిమాటలను నీవు గురిదప్పి వినవలదు, ఆకాశము పరిపూర్ణముగాదని భావము.

ప॥ విత్తేచెట్టయిపుట్టును । విత్తేవిత్తనమురీతి వెలయునుధర
పై । విత్తుకుచెట్టుకువేరే । విత్తనమొకటున్నదనినవినగూడదో
యీ * తనకుదాబుట్టునువినవోయీ * విత్తుచెట్టులరెంటి విధ
మీభూమెఱుగద । ట్లుత్తబయలెఱుగదు సత్తుచిత్తులరెంటి వి
నగూడదోయీ * తనకుదాబుట్టునువినవోయీ ॥ ౨౩॥

తా॥ శిష్యా! విత్తనమువలన చెట్టు పుట్టుచున్నది. ఆచెట్టుయందావిత్తనమేకాయుచున్నది, ఆవిత్తనమునకును చెట్టునకును వేరే విత్తనమున్నదనిచెప్పెడు మాటలు వినకూడదు. విత్తనమునుజెట్టును భూమి యెటుల యెఱుంగదో, అటుల పరిపూర్ణముసత్తుచిత్తులనెఱుగదు. విత్తనమును, చెట్టును, యివిరెండును తమకుతామేపుట్టి తమకుతామే నశించిపోవునని భావము.

ప॥ చెట్టేమూలమువిత్తుకు । చెట్టుకుమూలంబువిత్తుక్షితిపై
రెండుగ । బుట్టినజచ్చినరెంటిని । ఘట్టిగతానెఱుగకుండు గద
రాయీనేల * నీవీరీతికనుగొనవేల*పుట్టుచుగిట్టుచు పొలుపొం
దుతనువెఱుక।నిట్టివిచిత్రములెన్న డెఱుగదుబయలుగదరాయీ
నేల * నీవీరీతికనుగొనవేల ॥ ౨౪॥

తా॥ పుత్రా! విత్తనమునకు మూలముచెట్టు, చెట్టునకు మూలము విత్తనము, యీరెండుయుండినను, లేకుండినను, భూమికిందెలియదు. యిదేప్రకారము పరిపూర్ణమునకు యెఱుకయును లోకములును,

లేకపోయినను వుండినను యెఱుగదని తెలుసుకొనుము, చావునుబుట్టుక యునుగల శరీరమనెడు యెఱుకను, యెఱుకేయెఱుగును, యిట్టి విచిత్రములను పరిపూర్ణము యేకాలమందును యెఱుగదని భావము.

ప ॥ కనుమూసినకనుదెఱచిన । కనుమరుగింతైనలేక కానంబడుచుండ । కనుగొనశక్యముగాకను । యనిశముమొకరీతినుండునతడేనిర్గుణుడు * వినికనివెతలనతడొందడెపుడు * వెన్నెలలోపలవెలగకాయలరీతి । నున్నవిశ్వముయెఱుకనెన్నడుయెఱుగనియతడేనిర్గుణుడు* వినికనివెతలనతడొందడెపుడు॥౨౫

తా ॥ శిష్యా నేత్రములను మూసుకొనినను, దెఱచుకొనినను గొంచెమైనను మఱుగులేక పరిపూర్ణము గనుపించుచుండును, ఇట్టిదట్టిదని నిర్దేశించుటకు, అవాఙ్మానసగోచరమై యొకటేవిధముగా నుండును అట్టిపరిపూర్ణమును, విని, చూచి, యేసంశయములు లేనివాడే నిర్గుణుడు,అతనికియేదుఃఖములును లేవు. వెన్నెలలో వెలగకాయలుగనుపించునటుల అచలపరిపూర్ణమునందు యీజగత్తుగనుపించుచుండును, యీవిశ్వమునుయెఱుకను యెన్నడును యెఱుగనివాడే నిర్గుణుండనిభావము.

ప ॥ ఎఱుకేదేహేంద్రియములు । యెఱుకేవర్ణాశ్రమములు యెఱుకేశ్రుతులు । న్నెఱుకేనీవునునేనును । యెఱుకేసతిసోదరాదులెఱుగుమువత్సా*నేదీర్చెదనిదుగోనీయిచ్ఛా * హరిహరబ్రహ్మాదిసురనరగిరిసరి । త్తరుమృగచరాచరములు యెఱుకని యెఱుగుమువత్సా * నేదీర్చెదనిదుగో నీయిచ్ఛా॥ ౨౬॥

తా ॥ బిడ్డా యెఱుకేదేహమును, యింద్రియములును, యెఱుకే బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రాదికులములు, యెఱుకేబ్రహ్మచర్యము, సన్న్యాసము వానప్రస్థము గృహస్థాశ్రమములు, యెఱుకే శ్రుతిస్మృతులు, యెఱుకే నీవునునేనును, యెఱుకే భార్యయును, అన్నలదమ్ములనిదెలియుము, బిడ్డా నీయిష్టమును దీర్చెదను, మఱియును, బ్రహ్మవిష్ణు, మహేశ్వరులును దేవతలును నరులును కొండలును సరస్సులును చెట్లును మృగములుసహా చరాచరమంతయును యెఱుకయని దెలియుము, నేను నీయిష్టమునుదీర్తునని భావము.

ప॥ ఎఱుకేవిద్యావిద్యలు । నెఱుకే ప్రణవంబునాద మెఱుకే
కళయు । న్నెఱుకేబిందువుచిత్స । త్తెఱుకేయానంద మనినీవె
ఱుగుసమబుద్ధి * నీనామాటలెఱుకేనిబద్ధి * యెఱుకే నిర్గుణస
గుణ మెఱుకేయెఱుగునుయిట్లు । యెఱుకనుయిదియంత యెఱు
గజేసితినీవి ల్లెఱుగుసమబుద్ధి * నీనామాటలెఱుకేనిబద్ధి ॥౪౭॥

తా॥ బిడ్డా! యెఱుకే విద్యావిద్యలు అనగా=జీవేశ్వరులు, యె
ఱుకే సోహము, యెఱుకేనాదము, యెఱుకేబిందువు, కళయును యెఱు
కే, యెఱుకేసత్తుచిత్తులు, యెఱుకేయానందమని నీవుసమబుద్ధిచేతం దె
లియుము,నీనామాటలునునిజముగానెఱుకే, యెఱుకేసగుణనిర్గుణములు,
యిన్నిటిని యిట్లు యెఱుకే యెఱుగుచున్నది, యివియన్నియును నీకు
యెఱుగజెప్పితిని, నీవుసమమైనబుద్ధిచేతం దెలియుమని భావము.

ప॥ ఎఱుకేయిహపరసౌఖ్యము। లెఱుకేజ్ఞానంబుజ్ఞేయమెఱుకే
మోక్షం । బెఱుకేభక్తివిరక్తులు । యెఱుకేసంకల్పమనినీవెఱు
గుసత్కీర్తి * యెక్కడికౌరయెఱుకసంపూర్తి * యెఱుకేజీవు
డీశుడెఱుకేతదేకాంత । మెఱుకేసర్వమునేగుర్తెఱిగిచెప్పితినీకీఱె
ఱుగుసత్కీర్తి * యెక్కడికౌరయెఱుకసంపూర్తి ॥ ౪౮॥

తా॥ బిడ్డా! యెఱుకేయిహపరసుఖములు, యెఱుకేజ్ఞానము,యె
ఱుకేజ్ఞేయము, యెఱుకేమోక్షము, యెఱుకే భక్తియును విరక్తియును,
యెఱుకేసంకల్పము, ఇట్లనినీవుయెఱుగుటే మంచికీర్తి, పరిపూర్ణమును
దర్శించక యెఱుకకు సంపూర్తికలుగనేరదు, యెఱుకేజీవుడు, యెఱుకే
యీశ్వరుడు యీరెండునుగూడినదియును యెఱుకే, నేను సర్వమును
గుర్తెఱిగినీకుజెప్పితిని, నీవుయీకీలుదెలుసుకొనుటసుకీర్తియనిభావము.

తా॥ చింతలతోటనదెఱుకే । వింతలవుట్టిల్లనంగ వెలసిన
దెఱుకే । తంతులపేటనదెఱుకే।పంతములకుజూడమూలబలమ
న్నదెఱుకే * జగజ్జాలస్థలమన్నదెఱుకే * భ్రాంతులకెల్లనుపట్ట
ణమనజల్లి । కాంతలపురుషులగలిగించుటకుమూల బలమన్న
దెఱుకే * జగజ్జాలస్థలమన్నదెఱుకే॥ ౪౯॥

తా॥ శిష్యాయెఱుకే సమస్తచింతలకు తోటవంటిది, యెఱుకే
సర్వవింతలకు పుట్టిల్లువంటిది, యెఱుకేవివిధతంత్రములకు పల్లెవంటిది,

మెఱుకేపంతములకన్నిటికి మూలబలముగానున్నది, యీజగజ్జాలమం తటికి నాలయమైనప్రపంచమంతయును మెఱుకే, సర్వభ్రాంతులకు మె ఱుకెపట్టణముగాజెప్పంబడియున్నది, స్త్రీలను పురుషులను బుట్టించుట కును, మెఱుకేమూలబలముగా నున్నదని భావము.

ప॥ అన్నియుతానై తనకవి । పన్నగవేరనుచు నోట బలు
కుచుమరితా । నన్నిటినెఱిగెడిమెఱుకై । యున్నాననిమెఱుక కె
ఱుకేయూహింపుచుండు*తనలోతానె మోహింపుచుండు*మె
న్నోవిచిత్రాలీమెఱుకసేతలువింతె । యున్నదిలేదులేకున్నదిక
లదనియూహింపుచుండు*తనలోతానేమోహింపుచుండు॥౫౦॥

తా॥ శిష్యా! అన్నియునుదానై తనకు యవివేరని, నోటబలు కుచు, తానుసర్వమునుయెఱిగేయెఱుకై యున్నానని యెఱుకకుయెఱుకే యూహింపుచుండును, తనలోతానే మోహభ్రాంతులను బొందుచుం డును. ఆహా యెఱుకచర్యలనువిచారించగా నెన్నోవిచిత్రములుగా ను న్నది. ఉన్నదిలేదనిలేనిదియున్నదని యోచించుచుండును, తనలోతనకు తానేమోహభ్రాంతులనుబొందుచుండునని భావము.

ప॥ వినుమూర్ధనాభితాబు । ట్టినమీదటసృజనసేయుదిన
ముహరించుర । ఘనమగుపట్టణకోట్లను । తనలోపలిదారము
ననుతానట్టెచనును * అట్లనెయెఱుకతాబుట్టికనును * పనిబూ
నిబ్రహ్మాండభాండానంతములను । క్షణములోపలద్రుంచికనరా
కవే వేగతానట్టెచనును * అట్లనెయెఱుకతాబుట్టికనును॥ ౫౧॥

తా॥ శిష్యా నేత్రములయందు సన్నరంధ్రమనెడు బ్రహ్మనాళ ముకలిగినపిమ్మట సృష్టికలిగి, అనేకకోట్లజీవులను, తనలోపలిదారమనె డుహంసచేతనాడించి తానే మటుమాయముగాబోవును. అదేప్రకార ము తానుబుట్టి సర్వసాక్షియైజూచును, యీబ్రహ్మాండభాండములనెడు ప్రపంచమును, నిమిషములోపలద్రుంచి తాను యెందును గనరాక త నకుతానే మాయమైపోవును గాబట్టియెఱుకసూత్రధారియనిభావము.

ప॥ తలిదండ్రులుజీవేశులు।యిలవ్యోమములేమిమేలుయెఱు
కమఱుపులుర।కలమేల్కలుశుక్లాస్త్రం। బులునీరన్నములుప్ర
కృతిపురుషుడాల మగడు*గానై యెఱుకకెఱుకనబడదు* తెలిసి

బయలున్న దని తెలిసియీా తెలిసిన। తెలివిచేత నేదీనిదీసి వేయుము
ప్రకృతిపురుషుడాల్ మగుడు*గా నైయెఱుక కెఱుకనబడదు॥ ౨౨॥

తా ॥ శిష్యా తల్లిదండ్రులే జీవేశ్వరులు, భూమియునాకాశము
ను, దరిద్రమును భాగ్యమును, యెఱుకమఱుపులును,కలమెలకువలును,
శుక్ల శోణితములును, నీరన్నములును, ప్రకృతిపురుషులును,భార్యా భ
ర్తలును,యిన్నివిధములుగాపరిణమించినయీాయెఱుకవలనపరిపూర్ణము
నుదెలుసుకొనుము,అట్టితెలివిచేతందెలిసినతెలివినితీసివేయుమని భావ.

ప ॥ ఒకదేహంధారితనువున । సకలావస్థలుజనించి చనినవి
ధమున । న్నకలంకమైనబయలున । ప్రకటితమై లేనియెఱుక
బయలుండజూచి * తనముచ్చటపరికించిలేచి * యొకకొంత
సేపైననుండుటకును లేక । సకలముతనవెంటజనుదేర జనుబట్ట
బయలుండజూచి * తనముచ్చటపరికించిలేచి॥ ౨౩॥

తా ॥ శిష్యా మనుజుని దేహమునందు సకలబాధలును గలిగి
పిమ్మట యవి నివర్తించినటుల, లేని యెఱుకపరిపూర్ణమునుజూచి, తనని
జమునుదెలుసుకొని, కొంతసేపుమైనను నిలుచుటకు లేక తానెందునుని
లువక,సకలేంద్రియములు తనవెంటరాగా తన ముచ్చట్లువిడిచి, తనకు
తానే మటుమాయముగా బోవునని భావము.

ప॥ మెలకువసుషుప్తిలోపల । నేలాగునతనకుదానెయే తెం
చునోగు । ర్తాలీలబయలులోపల । వాలాయముతనకుదానెవ
చ్చునోయన్నా*వచ్చిహెచ్చిచచ్చునోయన్నా * యీాలోపలనే
బట్టబయలున్నదెటిగితె । యేలోకమునవిల్వజాలదెఱుగకుం
టెవచ్చునోయన్నా * వచ్చిహెచ్చిచచ్చునోయన్నా॥ ౨౪॥

తా ॥ శిష్యా సమస్తప్రాణులకు, సుషుప్తియందుండి మెలకువ
తనకుతానే యెటులవచ్చునో, అటువలెనే పరిపూర్ణమునందు యెఱు
క సాధారణముగా వచ్చుచుండును. ఇటులవచ్చి సుఖముచేత హెచ్చి,
దుఃఖముచేతనొచ్చి, చచ్చును. ఇంతలోననగా=మరణము సంభవించ
కముందుగానే పరిపూర్ణమునుగనకుండినయెడల,యెఱుక జనన మరణ
ములనుబొందుచుండునని భావము.

ప॥ ఆటాడియాడకుండును । యాటాడినమేనిబొమ్మయాటా
డకనే । యాటాడుమెఱుక యనియెడి । యాటాడించేటివాడు
యతడేరకర్తా * అంతటికినీయచలమేకర్తా * చేటుపాటులురెం
డుచేవచ్చుఫలములు । మాటికనుభవించి మరణజననములొం
ద యతడేరకర్తా * అంతటికినీయచలమేకర్తా ॥ ౫౫॥

తా॥ పుత్రా! శరీరములనెడు బొమ్మలు కొంతసేపుయాడి కొం
తసేపుయాడకుండును, యీబొమ్మలనాడించుటకు మెఱుకే కర్త. యీ
యేడేడుపదునాలుగులోకములు పరిపూర్ణమందుపుట్టి నశించుటచేతను,
పరిపూర్ణమునాశనములేక శేషించియుండుటచేతను, అట్టిపరిపూర్ణమును,
కర్తగాజెప్పఁబడినదేగాని, అచలము కర్తృత్వ,భోక్తృత్వములులేనిదై
యున్నది, చేటుపాటులు అనగా=వృద్ధిక్షీణంబులు రెండును అప్పటప్ప
టికి ననుభవించుటకును, జననమరణములను బొందుటకునుయాత్మయ
నెడు మెఱుకేకర్తగాను,కర్మగాను, క్రియగానుయున్నదనిభావము.

ప॥ దేహమునుజూచుకన్నులు । దేహమునకుపేరులేనితీరున
మెఱుకే । కోహంకర్తవ్వంతవదా । సోహంసోహంబటంచుచూ
చుచుండుసుమీ * తనకుదానెదోచుచుండుసుమీ * దేహిదే
హములునీతెలిగునప్రసరించి । దేహముగానివిదేహిగా తనను
తాజూచుచుండుసుమీ*తనకుదానెదోచుచుండుసుమీ॥ ౫౬॥

తా॥ శిష్యా! కన్నులు దేహమునుజూచును, దేహమునకు యా
త్మ వేరువిధముగా దోచబడును, నేనేనేనని సోహంభావమునుగలిగి న
దాపలుకుచుండును, మెఱుకే దేహముగాను, దేహిగాను, ప్రఖ్యాతినొం
ది, దేహము తానుగానని, యాత్మయైనదేహియే తాననియును, తన్ను
దాగనుట విశేషమనియును యోచించుచుండుననని భావము.

ప॥ పిండబ్రహ్మాండంబులు । రెండునుయీరెంటిలోని రెండ
హములుయీ । ఖండములునాల్గుగూడియు । ఖండంబగుమెఱు
కరూపుగనరానాతంబ్రీ * యిదితెల్పినఘనుడేతలిదంబ్రీ * ఖం
డాఖండములుగ గనుపించేమెఱుకను । దండిదామేటియుద్దండు
లకలనైన గనరానాతంబ్రీ * యిదితెల్పినఘనుడేతలిదంబ్రీ॥ ౫౭॥

తా॥ బిడ్డా! పిండమనగాపంచభూతవికారమైనప్రకృతి, బ్రహ్మాం డమనగా పంచభూతస్వరూపమగు మహాప్రకృతి, యీప్రకృతులురెం డును, యీరెంటియందలి రెండహములనగా ప్రత్యగాత్మపరమాత్మలు, అనగాచిత్తును చిదాభాసుడును, యీ నాలుగు ఖండములనుగూడి య ఖండాకారమును బొందియుండిన మెఱుకయొక్కరూపమునుజూడుము. పుత్రా! ఖండాఖండములుగా గనుపించెడు మెఱుకను,తామనెడుఅహం కారముచేత విజృంభిగెడువాండ్రను, యీస్వప్నమునందు జూడుము, యి దిదెల్పినవాడే తల్లియునుతండ్రియునని భావము.

ప॥ పరిపూర్ణమొకటిదక్కని । తరమైనప్రపంచమెల్లదగదె లియుమునీ । మెఱుకేననిమదిలోపల । మెఱుకే పరిపూర్ణమెతి గెదెఱుకనెతిగేది ✱ యింకొకటిలేదీరెంటినెతిగేది ✱ మెఱుక పుట్టువుమూలమెఱుగనిదీమెఱుకే । మెఱుకేదాబుట్టిన దెఱుగ బోతెలేదంచెఱుకనెతిగేది✱యింకొకటిలేదీరెంటినెతిగేది॥ ౫౮॥

తా॥ బిడ్డా! పరిపూర్ణమొకటి తప్పతక్కిన ప్రపంచమంతయును మెఱుకని మెఱుగుము, యీమెఱుకే పరిపూర్ణమును మేఱుగుచున్నది, యీరెంటిని మెఱుగుటకు వేరొకటిలేదు, మెఱుకయొక్క పుట్టుకయు ను మూలమును మెఱుగనిదేమెఱుక, తనపుట్టుక మెఱుగబోయినమె ఱుక తానేలేకపోవుచున్నదని భావము.

ప॥ పాపములుపుణ్యములుభువి । ప్రాపించును మెఱుకచేత భ్రమసినవారికి । ప్రాపింపవెఱుకనెడసిన । తాపసులను జిత్త మందుతగదెలుసుకొనుమీ ✱ ఆగామిబోధనువెన్నవినుమీ ✱ పాపలలోశుద్ధస్ఫటికసన్నిభమైన । ఆపోజ్యోతిని ప్రత్యగాత్మనిమ దిలోనతగదెలుసుకొనుమీ✱ఆగామిబోధనువెన్నవినుమీ॥౫౯

తా॥ వత్సా! మెఱుకచేత భ్రమసిన మానవులకు పాపములును బుణ్యములును గలుగుచుండును, మెఱుకను విడిచినవారికి పుణ్యపాప ములులేవని పెద్దలచరిత్రములను దెలియుము, ఆగామిబోధయనగా= ముందు రాబోయెడు జననమునుగురించిన బోధను, పెద్దలవలన విను ము. కంటిపాపలనడుమ శుద్ధస్ఫటికరూపమైన ఆపోజ్యోతియే ప్రత్యగా

త్మయని నీమదిలో దెలుసుకొని, జననమరణములులేని యచలభావము నుబొందుమని భావము.

ప॥ ఎఱుకన్ననుమఱుపన్నను । యెఱుకకుయెఱుకన్న దేహి యనమాయన్నర । గుఱుతనగసాక్షియనినర । స్ఫురణయనం ద్రష్టయనినచూడుమొక్కటిగా * యిదిలేకుంటెచూడమొక్క టిగా * మఱిచలాచలములమర్మమెఱిగెటిదన్న । యెఱిగితాలే నని యెఱిగిపోయెడిదన్న చూడుమొక్కటిగా * యిదిలేకుంటె చూడమొక్కటిగా॥ ... ... ... ౬౦॥

తా॥బిడ్డాయెఱుకనియును,మఱుపనియును,దేహియనియును,మా యయనియును, సాక్షియనియును, శుద్ధతెలివియనియును, ద్రష్టయ నియును, స్వయంజ్యోతియనియును జెప్పంబడుచున్నది, యిన్నిపేర్లుగలది యెఱుకనేదెలియుము, యెఱుకలేకుండినదేనినింజూడవు,మఱియును చ లాచలములయొక్క మర్మములను దెలుసుకొని, తానులేననియెఱుకేయె ఱిగిపోవుచున్నదిగనుక, యెఱుకపోయినపిమ్మట దేనినింజూడజాలమనిభా.

ప॥ అనుమానముమదినుంచక । వినుమింకను యెఱుకపేరు వివరించెదబు । ధ్యనచిత్తంబనమానస । మనిన నహంకారమ నినసంతఃకరణనర * సంకల్పమంచనియిచ్ఛయనినర * తాను నితరులని తాగుర్తెఱిగెడిదన్న । తనకనినితరుల తననుదెలిసెడి దన్నసంతఃకరణనర * సంకల్పమంచనియిచ్ఛయనినర॥ ౬౧॥

తా॥ బిడ్డా! యెఱుకనువివరించెదను, నీమనంబునసంశయముం చకవినుము. బుద్ధియనియును, మనస్సనియును, చిత్తమనియును, అహం కారమనియును, అంతఃకరణయనియును, సంకల్పమనియును, యిచ్ఛ యనియును, యెఱుకకేపేర్లు. తనను యితరులనుదెలిసి తనగుఱుతుయె ఱిగిపోవునట్టిదే యెఱుకయని భావము.

ప॥ వినుమితరులుయెఱుకనుసా । క్షనిబలికిరినేనుసాక్షినహ మనినీతో । విననట్లుజెప్పియదివే।రనగూడదురెండునొక్కటని తెలుసుకోరా * మాటలభేదమనికనుక్కోరా * అనరాని విన రానికనరానిబయలందు । తనకై తానరుదెంచితనకై తా జను వాహామనితెలుసుకోరా * మాటలభేదమనికనుక్కోరా॥౬౨॥

తా॥ శిష్యా! యితరులు యెఱుకనుసాక్షియనిజెప్పిరి, నేనుసాక్షిప్రహ్మమని నీకుంజెప్పితిని, యివిరెండును వేరనగూడదు, రెండును యొక్కటేయని తెలుసుకొనుము, మాటలభేదమని కనుగొనుము, అనుటకును, వినుటకును, జూచుటకును, అలవిగానిపరిపూర్ణబ్రహ్మమందుండి, యెఱుక తనకుతానేవచ్చి, తనకుతానే మటుమాయముగాబోవుననిభా.

ప॥ వన్నియలైదొకచోటను । వన్నుగకలసినది హృదయపద్మంబనుచు । న్నెన్నెదరుజనులుయెఱుకం । దున్నదనుచుశ్రుతులుబలుకుచున్నవినుమ్మి * తెలునుటమోక్షమన్నవినుమ్మి * వన్నెలన్నియుమీరియున్న వస్తువుజాడ। నెన్న డెఱుంగక యెన్నో రీతులబలుకుచున్నవినుమ్మి* తెలునుటమోక్షమన్న వినుమ్మి॥ ౬౩॥

తా॥ శిష్యా పంచరంగులునొకటిగాగూడినదే హృదయపద్మంబని పెద్దలుజెప్పిరి, వేదములును, యెఱుకయాహృదయపద్మమందున్నదని పలుకుచున్నవి. అట్టి హృదయపద్మమనగా సహస్రారము, దీనిని దెలుసుకొనుటమోక్షమనిజెప్పిరి, సర్వవర్ణములను మీరిన యచలపరిపూర్ణమును పామరజనులెఱుంగక యెన్నోవిధముల బలుకుచుందురు, అట్టిపలుకులే వేదములని భావము.

ప॥ చులకగము క్తికినొక్కటి । తెలిపెదవినుసందియములుదీరునదీనం । బలుకునగలిగినయర్థము। పలుకునువిడనాడినిల్వబడుచోటింకేది* రెండునునొక్కపలుకెయయినాది* తెలియమీలాగున తెలివి దేహములయ్యె। తెలివేతనువునుబాసి తెలివేస్థిరముగనిల్వబడుచోటింకేది* రెండుననొక్కపలుకేమైనాది॥ ౬౪॥

తా॥ బిడ్డా సులభముగా నొక్కము క్తిమార్గమును జెప్పెదను వినుము, అట్టిమార్గమువలన నీసంశయములన్నియును విడిచి పోవును, పలుకులయందలి యర్థమున్ను పలుకులు విడిచిపోయెడు చోటును, యీరెండునుయొక్కటేయాయెను, తెలివే దేహములాయెను, అట్టి తెలివిని దేహములనువిడిచి, స్థిరముగానిల్చునట్టిచోటేయచలపరిపూర్ణమని భా.

ప॥ ఎఱుకైనభూతములనీ । వెఱుగుముయీకసముగాదప్పనింగలమునునీ । ల్గిరువైననేలయనిసే । నెఱిగినపద్ధతినినీకు నెఱిగించినాను * ముజ్జగములయ్యెనువీట్లతోను * పరిపూర్ణమం

దుగన్పడుచుతమకుదామే । మరికానరానట్టిమార్గముగలవీటినె
ఱిగించినాను * ముజ్జగములయ్యెనువీట్లతోను ॥ ౬౫॥

తా॥ బిడ్డా! యెఱుకరూపమును బొందిన భూతపంచకమును దెలియుము, ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథివి. యీపంచభూతములుగూడి యెఱుకయాయెనని నేనెఱిగినప్రకారము నీకుయెఱిగించితిని. వీటివలన మూడులోకములాయెను. పరిపూర్ణమునందు గనుపించి మఱల గనుపించని యెఱుకమార్గములను నీకువినుపించితినని భావము.

ప॥ ఎఱుకుత్పత్తిని దెలియుగ । సరసిజగర్భాదులైనజాలరనె
డిచో । నరుడెంతవాడువాడది । యెఱుగుదుననవట్టిమాటలివి
వింతగాక * తప్పదువానికికరాకపోక * అరమరలేకసద్గురుమూ
ర్తిచరణపం । కరుహద్వయార్చననెఱుగని నరుమాటలివివింత
గాక * తప్పదువానికికరాకపోక ॥ ... ౬౬॥

తా॥ బిడ్డా! యెఱుకపుట్టుకను దెలియుటకు బ్రహ్మాదులకైననలవికాదు, నరుడు నేనెఱుగుదునని చెప్పుట యదిదబ్బరమాట, ఆహా మిగుల వింతకార్యము, అట్టివానికి రాకపోకలుతప్పవు, సంశయములేక సద్గురుమూర్తి పాదపద్మములను బూజించని పామరజనుల మాటలు, మిగుల వింతలు, అట్టివారికి జననమరణములు తప్పవని భావము.

ప॥ లేనెఱుకబయలులోపల । తానెల్లజనించెననినదగవిను
వంధ్యా । సూనునిగతివియదబ్జవి । ధానంబునయక్షరాజధాని
విధమున్ * రజ్జువుసర్పమయినవిధమున్ * స్థాణువుపురుషు
నిచందానమృగ । తృష్ణలోనీరువిధముస్వప్నానందిముగ రాజధా
నివిధమున్ * రజ్జువుసర్పమయినవిధమున్ ॥ ౬౭॥

తా॥ బిడ్డా! లేనియెఱుక పరిపూర్ణమునందు యెటులజన్మించెనని, నీకుసంశయముంటినయెడల యెఱిగించెదనువినుము, గొడ్డురాలిబిడ్డని, ఆకాశపుష్పమని, యక్షరాజధానియని, రజ్జుసర్పమని, దాగుపురుషుడని యెండమావులని యెటులజెప్పంబడియున్నవో, అటువలెనేపరిపూర్ణమునందు యెఱుక భ్రాంతిచే కొయ్యపురుషునివలెను, యెండమావులయందునీళ్లవలెను, యక్షరాజధానివలెను, త్రాడుసర్పమువలెను గనుపించునేగాని నిజముగాలేనేలేదని భావము.

ప॥ లేనెఱుక యెఱుకయనియును । లేనెఱుకెట్లాయెననిన
తెన్నగవినుమా । లేనిమృగతృష్ణవంధ్యా । సూనులుగలిగుండి
వెదకిచూడలేనట్లు * యీలేనెఱుకయేడలేదిట్లు * స్థాణుప్ర
పురుషుడు శశివిషాణముగగన । సూనమునరునిస్వప్నానందమిక
వెదకిచూడలేనట్లు * యీలేనెఱుకయేడలేదిట్లు ॥... ౬౮॥

తా॥ బిడ్డా! లేనిమెఱుకయని యెటులజెప్పవచ్చుననిన, వినుము చెప్పెదను, యెండమావులయందు నీరులేనిదే, నీరనిపేరువచ్చినది, గొడ్డురాలకుబిడ్డలేనిదే, గొడ్రాలిబిడ్డయనిపేరువచ్చినది. దారువునందు పురుషుడులేనిదే, దారుపురుషుడని పేరువచ్చినది. ఆకసమునందు పుష్పములేనిదే, ఖపుష్పమనిపేరువచ్చినది. ఇవియన్నియు నెటుల యబద్ధములో, అటువలేనే, అచలపరిపూర్ణమునందు లేనిమాయయెఱుకే, యెఱుకయనిపేరువచ్చినది. ఇది కలయందుకలిగిన యానందమువంటిదేగాని చక్కగావిచారించిన యెఱుకలేకమటుమాయముగాబోవుననిభావము.

ప॥ ఎఱుకయుదయమెట్లన్నను । సరళంబగునారికేళ నలిల
ముభంగిగ । యెఱుకెట్లుపోవునన్నను । కరిమ్రింగినవెలగపండు
కరణిగనెఱుగు * తిరిగిరానికరణియునెఱుగు * పరిపూర్ణమున్న
దియెఱుకతానెఱిగితే । యెఱుకేమ్రింగునునప్పరుడు మ్రింగిన
నాటికరణిగనెఱుగు * తిరిగిరానికరణియునెఱుగు ॥ ౬౯॥

తా॥ బిడ్డా! యెఱుకపుట్టినవిధమెట్టిదనిన, టెంకాయలలోనిజలమువలెవచ్చినది,యెఱుకపోయెడువిధమెట్టిదనిన యేనుగుతిన్నిన వెలగకాయలలోని గుంజుహరించునటులంబోవును. ఇదియే మఱల జననమునకు రానివిధము,పరిపూర్ణమున్నదనియెఱిగినయెఱుకనుయెఱుకేయమస్వరూపమైమ్రింగును, యీప్రకారమెఱింగిన జననమరణములుగలుగవు, యీ పరిపూర్ణభావమే మఱల జననమునకు రానిపద్ధతియనిభావము.

ప॥ సంతోషాసంతోషము । లంతనెగనవచ్చిపిదప నరుగునె
చటికో।వింతయియున్నదిచూచితె। యింతేనుమ్మెఱుకపుట్టు విక
తెలుసుకోర * సంశయమేలయిదినమ్ముకోర * యెంతనిదెలుపు
దుయీదేవమార్గము । నంతటబహువన్నెలగుపడియగుపడదిక
తెలుసుకోర*సంశమేలయిదినమ్ముకోర ॥ ౭౦॥

తా॥ బిడ్డా! సుఖదుఃఖములుగలిగిన, వెంటనేయవిరెండును మొందుబోవుచున్నవి, ఆహా మిగులనాశ్చర్యముగానున్నది. యిదేప్రకారముగా యెఱుకపుట్టుకయనిలెన్నగావిని సంశయములేక యీయచలభావమునే నమ్ముము, యీదేవభావమును యెంతనిదెలుపుకును, అంతటంతటయీరువన్నెలును మిగులవింతలు వింతలుగా గనుపించి మఱల యవిగనుపించక మాయమైపోవుననిభావము.

ప॥ రాకడపోకడలేకను । యేకస్థితినుండునట్టియీబయలందుఁ । రాకడపోకడగలిగియు । నేకముగాదోచునెప్పుడుయెఱుకసుశీలా * ప్రతిమలోనిపెరుమాళ్ళలీలా * లేకతోచినయెఱుకలేనేలేదనుచుసీ । కీలుగురునిచేయెఱుకై తేజాలుట్లకెఱుకేనుశీలా * ప్రతిమలోనిపెరుమాళ్ళలీలా॥ ౭౦॥

తా॥ శిష్యా పరిపూర్ణమునకు రాకపోకలులేకయొకటేవిధముగానుండును, యెఱుకకురాకపోకలుగలిగి ప్రతిమలయందలిపెరుమాళ్ల వలెదోచుచుండును, యీకీలుసద్గురునిచేనెఱింగినయెడల, లేనియెఱుకె నిశ్చయముగానుళ్లక్కియనిభావము.

ప॥ వనగంగ్లుదకములోపల । తనకై తావచ్చితనకుదానేగువిధం । బునపరిపూర్ణములోపల । తనకై తావచ్చియెఱుకతనకై తాజనును * అచలంబున్నదనితానెఱిగినను * తనలేమినిజమనితనకుదోచునుదోచి । తనకల్మివృథగభావనజేసినిలువకతనకై తాజనును * అచలంబున్నదనితానెఱిగినను॥ ౭౧॥

తా॥ బిడ్డా! వడగంగ్లుదకములోనుండి తనకుతానేయేర్పడితనకుతానేయవిశిపోవును, ఇదేప్రకారము పరిపూర్ణసముద్రములోనుండి, యెఱుకతనకుతానేవచ్చి తనకుతానేబోవును, అచలమునుదర్శించిన పిమ్మటతననిజమును,తనకలిమియును వ్యర్థములనిభావించి, సిగ్గుపడి తానెందునునిలువకతనకుతానే బోవుననిభావము.

ప॥ పరిపూర్ణములోదోచుచు । యెఱుకేతనకు దానెయేర్పడవినుమీ । తోఁటలుతొమ్మిదిగలదై । తరితీపులనొందుచుందుతనువనదగుచు* అచలమునుగనితాలేననుచు * మఱియిల్లె

ఒకను దెలియయొకు కేసిల్వదుగాని । పరిపూర్ణమందు దానెతిగే
దెట్లొక గుర్తుతనువనదగుచు*అచలమునుగనితా లేననుచు॥ ౨౩॥

తా॥ బిడ్డా! యొకకతనకు తానేయేర్పడి పరిపూర్ణమునందుదో చుచు, నవరంధ్రములుగలశరీరయాత్మలై సుఖదుఃఖములనుభవించును, అచలమును దర్శించి తాను లేనని, తానే నిల్వక పోవుచున్నది పరిపూర్ణమునందు యొకకనొకగుట యొకగుర్తుయనియాగుర్తునువిడుచుటేసరియని భావము॥

ప॥ తొలుకరిమొకపులకై వడి । పొలుపగునీళ్లందుదోచుబుగ్గలరీతి । న్నలసూర్యకిరణమందున । గలనీలమువలెనెయొకక గనుపించునయ్య * అంతలోనెచటగనుపించదయ్య * కలకాలమొకరీతిగలిగు ।డదీయొకక । తిలకింపపగలురాత్రిదిరుగువిధమునగనుపించునయ్య*అంతలోనెచటగనుపించదయ్య॥ ౨౪॥

తా॥ శిష్యా! తొలుకరిమొకపుతీగలవలెను, నీటియందలిబుగ్గలవలెను, సూర్యకిరణములయందుదోచెడునీలమువలెను,మాయయొకకగనుపించును, వెంటనేగనుపించక మటుమాయముగాబోవును, అచలమువలెనెల్లకాలముయొకటేవిధముగానుండక పగలురాత్రులునడిచే క్రమమునగనుపించి గనుపించదనిభావము.

ప॥ కట్టెయలోనిప్పులేకను । కట్టెలోనొకసమయమందుగను పడిబహుగా । మిట్టిపడుతుదనుగనుపడ । దట్టిదెసువిఃయొకక పుట్టువములవిచార * తనకుదానేబుట్టినదారి * పుట్టుగిట్టుటల నున్నట్టేటనిలుచుండి । బట్టబయలునొడిగట్టినగనుపడదమలవిచార * తనకుదానేబుట్టినదారి॥ ౨౫॥

తా॥ నిర్మలవిచారణగల శిష్యా! కట్టెయందు నిప్పుగనుపించక, మఱియొకసమయమున యాకట్టెనుమధించుటచేతనిప్పుగనుపించి, యానిప్పు యాకట్టెనుగాల్చి తానును సమసిపోవును, అటువలెనే యొకక తానేవచ్చి తనకుతానేవృద్ధిపొంది తనకుతానేనశించును. చావు పుట్టు కలుగల యీ సంసారసముద్రమున నిలుచుండి, పరిపూర్ణమునుదెలుసుకొనిన యెడల యాసముద్రము యింకిపోవునని భావము.

ప॥ తనమూలముతలిదండ్రులు । తనవలెనేవారివారితలిదండ్రులకర్త । తనవలెనెగానియన్యము । గనజననస్థానమొకటిగలదనతరమా * బ్రహ్మాదులకది తెలియతరమా * వినుముయీబ్రహ్మాండజననమునీనాయం । దునునై నదిదియు గాదనియింకొకటివేరేగలదనతరమా * బ్రహ్మాదులకది తెలియతరమా॥ ౭౬॥

తా॥ బిడ్డా! తనకుమూలము తల్లిదండ్రులు, వారికి మూలము వారి తల్లిదండ్రులు, ఇట్లనేగాని, వేరేజన్మస్థానమున్నదనిచెప్పుట సరికాదు, బ్రహ్మాదులకైన నది దెలియుటకు సాధ్యపడదు. యీబ్రహ్మాండము నీవల్లను నావల్లనుయైనదేగాని, మరియెవరివల్లను గాలేదనిభావము.

వ॥ కనరానిదానిశూన్యంబనియనదగుగానిబయలుననదగదుసుమీ।కనవచ్చుచున్నదిదిగో। గనుగొనలేదయ్యె నెఱుకకనుగొనరాదా* యెఱుకనుశూన్యమనియనరాదా* కనవచ్చెనాలేదాగనుగొంటివేదాని ।యనరాదభయమేమియనుమానించకునిదుగోగనుగొనరాదా*యెఱుకనుశూన్యమనియనరాదా॥ ౭౭॥

తా॥పుత్రా! కనుబడికనుబడకుండెడుయీయెఱుకనేశూన్యమని జెప్పవచ్చువేగాని, సదాగనుపించెడు పరిపూర్ణమును శూన్యమని జెప్పగూడదు. ప్రత్యక్షముగా గనుపించెడు పరిపూర్ణమును నీవు గనుగొంటివాలేదా. అనుమానమును భయమునుబొందక దృఢముగా యెఱుకనే శూన్యమని జెప్పుము, సంశయమేలననిభావము॥

ప॥ ఎఱుకబయలందులేమిని । యెఱుకనుశూన్యంబటంచు యెఱిగించబడెర । యెఱుగుమిదేయాకసంబి । ల్లెఱిగితెయెఱుకాకసములుయేకమాగదరా*ఆకసముబయలుయేకమెల్లారా * పరిపూర్ణమిదుగోగన్పడుశూన్యమనరాదు । యెఱిగుండుమెదిలిస్త్రైయికనాచేయిజూచేవు యేకమాగదరా*ఆకసముబయలుయేకమెల్లారా ॥ ... ... ... ౭౮॥

తా॥ బిడ్డా! పరిపూర్ణమునందు యెఱుక లేనందున, యెఱుకను శూన్యమనిజెప్పంబడినది. యెఱుగుమిదేయాకసము, ఆకసమునుయెఱుకయు నొక్కటియగుచున్నది, ఆకసమును బట్టబయలును యేకమెట్ల

గును, కానేరదు ప్రత్యక్షముగా గనుపించెడు పరిపూర్ణమును శూన్యమ నరాదు, నీకు సంశయముండిన యెడలనింకను జెప్పెదనని భావము.

ప॥ కనుబడెడుబయలులోపల । కనుగొనలేదయ్యో నెఱుక గావునశూన్యం । బనవలసెదీనినాకస । మనవలసెను దీనవిశ్వ మాయనూయప్పా * యింతకువేరే మాయలేదప్పా * కనుకనె యీవిశ్వమొనరలేదనిలెస్స।వినజెప్పనాయను కనబోకుండనుచు నీమాయనోయప్పా * యింతకువేరెమాయలేదప్పా ॥ ౭౯॥

తా॥ శిష్యా! కనుబడెడుయీపరిపూర్ణమునందు యెఱుకకనుపించదాయెను, గనుకయెఱుకనుశూన్యమనియునుజెప్పంబడెను. యెఱుకవల్లనేయీవిశ్వమంతయునుగలిగెను, యెఱుకకంటెను వేరేమాయలేదనియును, దానింజూడవలదనియును నీకువృథముగాజెప్పితినని భావము.

ప॥ అహమనదుగదాయచలము।అహమున్నదో లేదోజూడు మదినిజమెగదా।అహమునుబుట్టించదుగద । అహముదయించు కొఱకై యదియున్నదిగా*అహమేవిశ్వమైనిలిచినదిగా * అహ మెయీముచ్చట్లునన్నిటెఱుగునుగద । అహమేతాలేననియెఱిగి తెసరిగాదయదియున్నదిగా*అహమేవిశ్వమైనిలిచినదిగా॥ ౮౦॥

తా॥ శిష్యా! పరిపూర్ణముఅహమనిజెప్పదు, అహమునుబుట్టించదు,అహమున్నదోలేదోజూడుము, అహము యేమియునులేని పరిపూర్ణమునందేకలుగుచున్నది. అహమేయీవిశ్వరూపమాయెను, అహమేసర్వముచ్చట్లు,అహమేపరిపూర్ణమునుయెఱిగి, అహమేతానులేననియెఱిగి తేనేసరి, అహమనగా=అహంకారము, అహమనగా=చైతన్యము,అహమనగా=పరబ్రహ్మము, అహమనగా=సర్వసాక్షియని భావము.

ప॥ ఆవరణమునాకసముని । రావరణమునచలమనుచుననిరి మహాత్ముల్ । ఆవరణముమితిగల్గినని । రావరణముయమితమ నియికతెలుసుకోరా * యీరెంటినివేరనికనుక్కోరా * ఆవర ణముననేనిరావరణమునుజూచి । యీవరణమేదినీకావలమాట లేదనితెలుసుకోరా * యీరెంటినివేరనికనుక్కోరా॥ ౮౧॥

తా॥శిష్యా! ఆవరణమునుఆకాశమనియును, నిరావరణమునుపరిపూర్ణమనియును,మహాత్ములైనపెద్దలువచించిరి,ఆవరణమునకుమితిమేర

లుండును, నిరావరణమునకుమితిమేరలులేవు, యీరెంటినివేరనితెలుసు కొనుము, ఆవరణముచేతనిరావరణమైన పరిపూర్ణమునుజూచిన పిమ్మట యేమాటయును లేదనిభావము.

ప॥ ఆకాశముశూన్యంబని । లోకులుమొరబెట్టిదానిలోపవ
నాదుల్ । ప్రాకటముగబుట్టినవని। చీకాకుగజెప్పినారుఛీవినరా
దు * వంధ్యాసంతుష్టితిలోనలేదు*కాకుంటెవినచోద్యముగను
కుందేటికొమ్ము। లీకాలమునమేమేగంటిమనుమాటఛీవినరాదు*
వంధ్యాసంతుష్టితిలోనలేదు॥ ౮ ౨॥

తా॥ శిష్యా కొందఱు, ఆకాశము శూన్యమనియును. అట్టిశూన్యమైన యాకాశమువలన వాయువు, అగ్ని, జలము, పృథ్వి, యీ నాలుగు భూతములు పుట్టినవనియును చీకాకుగాజెప్పిరి. ఛీఛీ అట్టిమాటలను వినరాదు, గొడ్డురాలకు బిడ్డ యేకాలమందును బుట్టనే లేదు. కుందేటికొమ్ములను మేముజూచితిమని వేడుకగాజెప్పినమాటయేగాని నిజముగాకుందేటికికొమ్ములులేవు,ఆకాశముశూన్యముకాదు,శబ్దమేయాకాశమునకుగుణము, పరిపూర్ణము శబ్దరహితమని భావము.

ప ॥ లేనెఱుకనుబయలందున । లేనేలేదనక యితరులేలబలి
కిరో । లేనిదికలదనిపిదపను । లేనేలేదనుచుసిగ్గులేకయీలీలా *
ఛీవినకుచీకాకునీకేలా * మేనందశుద్ధముతానందుకొనిమళ్లి ।
వూనికడిగినరీతినాను సిగ్గొకయింతలేక యీలీలా * ఛీవినకు
చీకాకు నీకేలా॥ ౮ ౩॥

తా॥ శిష్యా! కొందఱు లేనిమెఱుకను లేనేలేదనక, కొంతమట్టుకు కలదని, లేదని, సిగ్గులేక నానావిధములుగా జెప్పిరి. ఛీఛీ నీవు అట్టి కలతమాటలను వినవలదు.శరీరమునందు యమేధ్యమును బూసుకొని మఱల యాయమేధ్యమునుగడిగికొనునటుల, పామరజనులు, సిగ్గు లేక కొంతసేపు మెఱుకయున్నదని, కొంతసేపు లేదని, నానావిధములుగా జెప్పిరని భావము.

ప॥ అన్నపుసూత్మాంశముమన। సెన్నగనీరంబుప్రాణ మెఱుగు
ముయీరెం। డెన్నడుగలయవోనాడే। సున్నసుమీయెఱుకమాట
సుగుణసంపన్నా * కలసుటెయెఱుక సుమియింతకన్నా * ఉన్న

దెలుకమూలమన్న దెవిన లేదు।యెన్న డునీ భ్రాంతినిన్నంటనియ్య
కనుగుణసంపన్నా * కలనుజెయెులుకనుమియుంతకన్నా॥ ౮౪॥

తా॥ శిష్యా! అన్నముయొక్క సూక్ష్మాంశమే మనస్సు, నీళ్లయొక్క సూక్ష్మాంశమే ప్రాణము,యీ రెండునుయొకటిగాగూడనిదినమేయెలుకమాటయుల్లక్క, అనగా=యెలుకనాశనము, యీ రెండును గూడుచేయెలుక,,యెలుకకుమూలము లేదు,యెన్నటికినీ భ్రాంతినింబొందకుము; యెలుకనునమ్మక మాయయనిభావించి గుణవంతుడవుగమ్మని భావము.

ప॥ పిల్లలు తాటాకులతో । పిల్లలగావించిపెండ్లి పేరంటం
బుల్ । కొల్లలుగజేయువారల । తల్లులుగనిసత్యమనుచుతలచే
రమదినీ * నినునీవిట్లుతలచునీమదినీ * కల్లసంసారముగనిమా
నవులుసంత । సిల్లగగురుమంత్రసిద్ధులునిజమని తలచేరమదినీ*
నినునీవిట్లుదలచునిమదినీ ॥ ... ... ౮౫॥

తా॥ శిష్యా! పిల్లకాయలు తాటియాకులతో మొగబొమ్మలుగాను, ఆడుబొమ్మలుగానుజేసి, వాటికి పెండ్లిపేరంటములను జేయుదురు, వారితల్లులు చూచి నిజమనిభావింతురా, అటువలెనే మానవులు కల్ల సంసారమును సత్యముగానెంచి, గురుమంత్రసిద్ధులను నిత్యములుగానెంచరుగాబట్టి, నిన్ను నీవు యిటుల నీమనంబున దెలియుమని భావము.

ప॥ మేనెలుకలనగ రెంటిలో । దానినియిదిదీనినదియుతగస్రు
జియించుర్ । మేనెలుకలివియుమూలము । లేనిదె సృజనమ్యో
దనుచు లేనే లేదంటి * అంటేతప్పు లేనే లేదంటి * మేనెలుకలిప్పు
డు దేనందున్నవో జూచి । లేనిమేనెలుకల లేనివనుచునమ్ము లేనే
లేవంటి * అంటేతప్పు లేనేలేదంటి ॥ ... ౮౬॥

తా॥ శిష్యా! యెలుకయును, శరీరమును, యీరెండును యొకదానినొకటిబుట్టించును. యీరెండును సృష్టికిమూలము, వీటికంటెను వేరొండు మూలములేదు, అందువల్లనే యివిలేనివనియంటిని,అంటే తప్పుమాటకాదు, శరీరయాత్మలు రెండును, దేనియందున్నవో జూచి నైనిశరీరమును యెలుకయును, యీరెండును లేవని నమ్ముమనిభావము.

ప॥ ఎలుకపనిసేయదనకుము । యెలుగుట మఱచుటలురెం
డునెవ్వరిపనులో । యెఱిగింపుమునామోలను । వెలువకుతప్పి

తివిదెబ్బ వేసెదజూడూ * అట్లనకుండ జేసెదజూడూ * వెలపిం
చుటే దెబ్బ వేస్సెననాతండ్రి । యెఱిగించు పైమర్త మొలుకనునే
దీసివేసెదజూడూ * అట్లనకుండ జేసెదజూడూ ॥ ౮౭॥

తా॥ శిష్యా! మొలుకపనిచేయదని జెప్పకుము, మొలుగుట మఱ
చుటలు రెండును మెప్వరిపనులో నాకుంజెప్పుము, భయపడకుము, చె
ప్పకుండిన దెబ్బగొట్టెదనని పలికిన, యాశిష్యుడు స్వామీ! దేవరనారు
కొట్టుదురని భయపెట్టుచున్నారేగాని, యొకదెబ్బయయినను గొట్టలేదు,
లెస్సగాగొట్టి పైభావమును మెఱిగించుడని వేడిన, యాగురుడు మొలు
కనునేదీసివేయుచున్నాను, నిన్నట్లనకుండ జేసెదను, జూడుమనిభావము.

ప॥ లేనికలగలిగినప్పుడు । దానికిదశదిశలయందుతగమొద
లుకొనగ । తానంటకున్నమేల్కను । లేనికలేజూచెనేని లేక
పోవుగదా * కలలోమేల్క లేకపోదుగదా * లేనొలుకబయలు
య్యాలాగుననీకెపుడు । గానవచ్చితెబోధగావలెననవపుడు లేక
పోవుగదా * కలలోమేల్క లేకపోదుగదా ॥ ౮౮॥

తా॥ శిష్యా! లేనికలగలిగినప్పుడు నీకు గనుపించిన సర్వమును
మేల్కనినప్పిస్సుటనిలువకపోయెనుగదా, కలయందు మెలకువలేకపోదు
గదా, లేనిమొలుకను పరిపూర్ణమును నీవు దర్శించినపిమ్మట, కలవంటి
మొలుకనిలువక పారిపోవునని భావము.

ప॥ ఒంటుకుదాపలిబిందొక । టంటించినకొలదిలెక్కయధి
కంబగునా । యొంటుకువలపలబిందొక । టంటించినలెక్క వు
ల్లక్కయగదోయీ * ఒంటుండిలేదాగాదనవోయీ * దంట
దీరుచూడుదానివలెనేమొలుక।కంటుబయలును తానుగలిగుండు
తనకుల్లక్కమెగదోయీ*ఒంటుండిలేదాగాదనవోయీ॥ ౮౯

తా॥ శిష్యా! వొకటియనులెక్క వెంబడిసున్న పెట్టిన పదియగు
ను, ఆసున్నయాయొకటికి ముందుగానుంచిన, లెక్క కొటులరాదో, అ
టువలెనే మాయమొలుకయుల్లక్కయని జెప్పంబడుచున్నది. పరిపూర్ణ
ముయేకరీతిగానే నిండియుండునని భావము.

ప॥ ఎటుకొక్కటుండెనేనియు । మొలుకేయావిశ్వరూప మే
ర్పడదాల్చగ । మొలుకొక్కటిలేకుండిన । మొలుకైనప్రపంచ

మన్న దెవరెఱిగేరికనూ * లేదననైన నెవరున్నారికనూ * పరి
పూర్ణమైనట్టిబయలుండకనిపట్టి । గురునివాక్యముపట్టి గుఱుతు
పోగొట్టితెమెవరెఱిగేరికనూ*లేదననైననెవరున్నారికనూ॥ ౯౦॥

తా॥ శిష్యా! యెఱుకయొకటుండినయెడలయెఱుకేయీప్రపంచ రూపమంతయునుదాల్చును,యెఱుక లేకుండిన యీప్రపంచరూపమైనసర్వమునుయెఱుగువారుయెవరు, పరిపూర్ణమున్నదనిసద్గురుకటాక్షంబున గ్రహించి, యీసర్వమును యీగుఱుతుయెఱిగే యెఱుకను బోగొట్టిన వెనుక, యెఱిగేవారులేరని భావము.

ప॥ తెలుపుమృదుత్వముమధురము । గలవస్తువుచక్కెరనుచు
గనుగొన్నట్లా । తెలివివిశదముగజగముల । గలవస్తువుబిందు
వనుచుగనుగొనరాదా * నేదెలిపితేవినినమ్మరాదా * తెలివిచే
బయలుండదెలిసియీతెలివిని । తెలివిచేతనుబట్టితీసివేయకపో
నికనుగొనరాదా * నేదెలిపితెవినినమ్మరాదా ॥ ౯౧॥

తా॥ శిష్యా! తెలుపును, మృదువును, తీపునుగలిగినవస్తువు చక్కెరయని నీవు తెలుసుకొనినవిధముగానే యీజగత్తంతయును వెలిగింపఁజేసెడు తెలివియే యెఱుకని నీవుతెలుసుకొనుము, ఆ తెలివిచేతనే పరిపూర్ణమునుదెలుసుకొని,యీతెలుసుకొనిన తెలివినివిడువుమనిభావము.

ప॥ లేనెఱుకబయలులోపల । తానై తనకేరుపడినతనమూల
మునే । తానెఱుగదలచినప్పుడు । తానేలేకుండుదృష్టాంతము
వినుమిచటా * కలదోచదే తనకై తానెచటా * తానై తోచి
నకలతనమేల్కనగనబోతె। తానేతనకులేదుతగియున్నదిదృష్టాం
తమువినుమిచటా * కలదోచదేతనకయితానెచటా॥ ౯౨॥

తా ॥ శిష్యా! లేనియెఱుకతనకుతానేపుట్టి,తనకుమూలముతానెఱుగగోరితానే మాయముగాబోవును, యెట్లనగామెలకువగలిగినప్పుడు, తనకలలోవచ్చినవి సర్వమునుయెటులలేకుండునో, అటువలెనే, తనమూలము తెలుసుకొనబోయిన, తానేలేకపోవుననిభావము.

ప॥ చచ్చుటపుట్టుటమెలకువ। వచ్చుటగాఢవునుషుప్తివచ్చు
టనివినా । లచ్చముగసహజమెఱుకకు । పొచ్చెముయీయెఱు
కనిల్వబోదుమాయప్పా * అచలమునకిట్లులేదుగదప్పా * మ

చ్చికతోరెంటిమర్మమునీకిప్పు। డెచ్చుగదెలిపితినెఱుగు మెఱుక
నిల్వబోదుమాయప్పా * అచలమునకిట్లులేదుగదప్పా॥ 53॥

తా॥ శిష్యా! చచ్చుటయును, పుట్టుటయును, మెలకువవచ్చుటయును, నిద్రజెందుటయును, కలగనుటయును, యివిసహజముగా, మెఱుకకుకలిగియున్నవిగనుక, మెఱుకనిత్యముగానిలువదు, అచలమునకేమియును లేవు, యీరెంటియొక్కమర్మములను నీకుజెప్పితిని మెఱుకనిల్వదని నీవు తెలుసుకొనుమని భావము.

ప॥ఎఱుకనుకలలోపురుషుని। కెఱుకేయీవిశ్వమగుచునేర్పడు
కలగా। మెఱుకబయలుకనితానెం। దెఱిగినవెఱుకదిమేల్కయి
దినమ్ములెన్నా*మెఱుకతోపొందువదిలేదేబిన్నా* మెఱుకనేకల
నీకుమెప్పుడుదోచితే। మెఱుకలేదనుమేల్కనెఱుగుమెప్పుడుచా
లుయిదినమ్ములెన్నా*మెఱుకతోపొందువదిలేదేబిన్నా॥ 54॥

తా॥ శిష్యా మెఱుకయనుకలలోవచ్చిన పురుషుడునురెండును మెఱుకే, మెఱుకేయీవిశ్వరూపమంతయునుధరియించును, మేలుకొనినకలలోనిపురుషుడు యెటులలేకపోవునో, అటువలెనేయెఱుకలేకపోవును మెలకువయనునదే పరిపూర్ణము, మెఱుకపొందువదలుటేసరియని నీవు లెస్సగా నమ్ముమని భావము.

ప॥ చిత్తరుపురంగునోడల। నెత్తెరంగున దెలసినావోనీవిప్పు
డునీ।చిత్తమునజగమునెఱుకను। నుత్తముబయలట్లదెలియుమూ
హాతోడుతనూ* తెలిసివిడుపుమూహజగములనూ*అత్తెరంగున
జేసియూనలిమాటను। యిత్తెరంగునదెలియనెవరుండేరటుమీాద
నూహితోడుతనూ*తెలిసివిడుపుమూహజగములనూ॥ 55॥

తా॥ శిష్యా చిత్రములైనరంగులుగల గోడలనునీవుయే తెలివిచేతందెలుసుకొంటివో, అటువలెనే, నీచిత్తమునయెఱుకను, జగత్తును, పరిపూర్ణమును దెలుసుకొనుము, అటులతెలుసుకొనియీా యెఱుక జగత్తులనువిడిచిన పిమ్మట, యీావలిమాటచెప్పుటకు నెవరున్ను లేరని నీవు జక్కగా నూహించుమని భావము,

ప॥ పరిపూర్ణములోలేనిదె। యెఱుకొక్కటితోచితననుమె
ఱిగినమ్ముపగా। యెఱుకవిడుచునదెట్లన। కరమ్ములుతమపనులు

తా వెంగడుపునట్లుగనూ॥యిదిగాకుంటొకలదొకటివినుమూ॥మ
రికానిదీమాటమంచిదిమాటని । పరిపరివిధములబల్కపలుకుల
పనిగడుపునట్లుగనూ॥యిదిగాకుంటొకలదొకటివినుమూ॥౯౬॥

తా॥ శిష్యా పరిపూర్ణమునందు లేనిదే యొఒక్కొక్కటిగనుపించి, యెఱిగినపిమ్మట యదినీచత్వమునుబొందును, యీయెఱుకెట్లువిడిచిపోవు ననిన వినుము, చేతులుతమపనులు తాముగానేజరిపించి యెటులజాలించుకొనునో అటువలెనేనీవు దెలియుము, ఇదిగాకుండిన వేరొకటికలదు వినుము, నోరుమంచిమాటలుగాని, కానిమాటలుగానిపరిపరివిధములుగాభాషించియు భాషించక యూరకున్నటుల దెలియుమని భావము.

ప॥ తలమెత్తిచూడజాలునె । యలచీకటియెదుటనిలిచియ
జ్ఞానప్రకళం । గలవచ్చిమెళుకువందున । కలచేష్టలుబ్రమోలనిల
చికనుగొనగలదా॥ అట్లనెయెఱుకగనుగొనవలదా ॥ యిలలో
నగురుబోధనెఱిగిననరునిచే । ష్టలుగంటెనుళ్లక్కిసద్గురుబోధా
టకనుగొనవలదా ॥ అట్లనెయెఱుకగనుగొనవలదా॥ ౯౭॥

తా॥ శిష్యా! సూర్యకళలను జీకటితలయెత్తియెటుల జూడనేరదో. అదేప్రకారము మెళకువందున కలలోదోచిన వివిధ చిత్రములునుగనుగొనుటకు శక్యముకాదు, అటువలెనే సద్గురుబోధయెఱిగిన నరునికొక్క చేష్టలన్నియునుళ్లక్కియగునని భావము.

ప॥అంటదుకలమెళుకువమే । ల్కంటనుకలనెన్నటికినినదిని
శ్చయమిా। రెంటిక్రియగుఱుతుబయలుః। రెంటినిరెండంటకుం
దురెండింటిలోనూ॥కలయెఱుకలీరెండుమిథ్యానూ॥దంటమెళు
కువబయలుంటయెప్పటికెఱిగి । గెంటుముపైరెంటిరెంటికలయె
ఱుకలరెండింటిలోనూ॥కలయెఱుకలీరెండుమిథ్యానూ॥ ౯౮॥ .

తా॥ శిష్యా! యేకాలమందును నిశ్చయముగా,కలమెలుకువను మెలుకువకలను యీరెండునునొకదాని నొకటి యంటకుండును, యీరెంటివలెను గుఱుతుయనెడు యెఱుకయును పరిపూర్ణమును, యీరెండును యొకదానినొకటి యంటకుండను, కలయెఱుకలురెండును మిథ్యయగును,జంటయైనపరిపూర్ణమెళుకువలను నీవుయెఱిగి కలయెఱుకలను రెంటిని విడువుమని భావము.

ప॥ ఎఱుగమనుము ప్రజ్ఞాగ్రత।నిరూపందంగలను ప్రినెఱుగ
దుమెళకువ।ల్లరయునెఱుక మఱుపులజయ। లెఱుగదుయెఱుక రెం
టినెఱుగుచునుండు*గురుముఖమున నెఱిగియీరెండు * తిరము
గ యెఱుకనుతీసి వేసితెచాలు।పరులు నేననియెడిపలుకులేకుండుని
శ్లెఱుగుమీరెండూ*గురుముఖమున నెఱిగియీరెండూ॥ ౯౯॥

తా ॥ శిష్యా! నిద్రమెళకువను యెఱుగదు, మెళకువ నిద్రను
యెఱుగదు, విచారించగా యెఱుకమఱుపులను పరిపూర్ణ మెఱుగదు,
ఎఱుక, పరిపూర్ణమును, మఱుపును, యీరెంటినియెఱుగును, సద్గురుని
కటాక్షమున, నీరెంటినియెఱిగి, పరులని నేననిపలువిధములుగాబల్కెడు
యెఱుకను దీసివేసితేచాలునని భావము.

ప॥ సంకల్పములో లేనిదిని। స్సంకల్పములోదోచకనుదోచిచ
నుగా । సంకల్పమెతప్పనిని। శ్చంకగామదిదెలిసినేనిచనుతాలేన
నుచూ * నిస్సంకల్పమునిచెదననుచూ*సంకల్పించుటకింకనంక
ల్పమేదిని. స్సంకల్పమందుటల్ సంకల్పమెఱిగితెచనుతాలేనను
చూ*నిస్సంకల్పమునిచేదననుచూ॥ ౧౦౦॥

తా ॥ శిష్యా! సంకల్పమునందు లేనిదియునునిస్సంకల్పమునందు
కనుబడి కనుబడకపోవునదియును, సంకల్పమునుతప్పగా భావించినయె
డల, తానేలేకపోవును, నిస్సంకల్పమును నిలుపుకొనినయెడల, సంకల్ప
నచేయుటకు వేరేసంకల్పములేదు కాబట్టి, సంకల్ప నిస్సంకల్పములు
రెంటును దోషస్వరూపములని భావము.

ప॥ ఎఱుకతనకుదావిడిచిపో । దెఱుకనువిడిపింపలేరుయెవ్వ
రుధాత్రిగా । గురుడొకడుతప్పగురునకు । పరిచర్యయొనర్చిబోధ
పద్ధతివినినగా * తిరిగిరానిపద్ధతిగనినగా * పరిపూర్ణమెఱుక నే
ర్పఱచునెఱుకయులేక । హరినికలలోగన్నకరిద్రమ్మగ్గినట్లయీపద్ధ
తివినినగా * తిరిగిరానిపద్ధతిగనినగా ॥ ౧౦౧॥

తా॥ శిష్యా! యెఱుకతనకుతానేవిడిచిపోదు, యీప్రపంచమున
సద్గురుడుతప్ప మరియెవ్వరును మాయయెఱుకను విడిపింపనేరరు, సద్గు
రుమూర్తికి పరిచర్యలుచేసి, యీయచలబోధయొక్క పద్ధతిని జక్కగా
తెలుసుకొనినయెడల, మఱల జననమునకు రాకుండుట సత్యము. అది

ఎట్లనగా, సింహమును కలలోగనుగొనినయెడల యేనుగుయెటులహ
ఱించిపోవునోఅటువలెనేపరిపూర్ణమునుగనినయెుకహరించిపోవునని భా

ప॥ అపరోక్షమానెమనుజుల । కుపరోక్షంబైనబయలుగురు
కృపలేకగా । అపరోక్షమానుమనుజుల । కుపరోక్షంబైనబయ
లుగురుకృపగలుగా * కీల్దెలిసినయెుకతాతొలుగా * విపరీత
బుద్ధినివిడిచినీవెప్పుడు । నుపచారములుచేయుచుండుము గురు
నకుగురుకృపగలుగా * కీల్దెలిసినయెుకతాతొలుగా ॥౧౦౨॥

తా॥ శిష్యా! సద్గురునికృపలేక పరోక్షమైనపరిపూర్ణము అపరోక్షముగా నెట్లునిలుచును, సద్గురుకృపగలిగినయెడల పరోక్షమైన బయలు అపరోక్షముగాగనుపించును నీవువిపరీతబుద్ధినివిడిచి,సద్గురుమూర్తికి పరిచర్యలుచేయుము, నీకీలుయెఱిగితివేనియామెఱిగినయెుక తక్షణమే తొలగిపోవునని భావము.

ప॥ నేనెవ్వడనునుజీవుడు। నేనేనేననునుశివుడునీరెండనకగా।దా
నుండునచలమన్నిట । నేనరిగినతానుపైదినేనెట్లనీసీ * నేననకు
న్నతానెట్లనీసీ * నేనన్నదాన నేనానీప్రసంగము । తానన్నదా
ననేతలపోయువలెనట్లునేనెట్లనీసీ * నేననకున్నతానెట్లనీసీ॥౧౦౩॥

తా॥ శిష్యా! జీవుడునేనెవ్వడు, నేను అంతరింద్రియములా, జ్ఞానేంద్రియములాలేకకర్మేంద్రియములాయని పలుతెఱంగుల పలుకుచుండును,శివుడు నేనేనేననిపలుకుచుండును,అనగా=సోహంభావముతో దివారాత్రులయందును దిరుగుచుండును, యీ రెండును అనక అచలమంతటను నిండియుండును, నేననెడుజీవుడుపోయినవెనుక, శివుడు పరిపూర్ణమైయుండును, జీవుడు నేననియనకుండినశివుడుతానెట్లనును,తానన్నదానిని యోచించగా జీవశివులుయిరువురు నొక్కటేయనిభావము.

ప॥ తొట్టెలుతొమ్మిదిగలమేన్ । మట్టికియెుకరెంటిలోన మ
ల్కలునాల్గుం । డెట్టదితెల్లదినల్లది । కట్టెదిదానగ్రమందుగల
దొక్కతూటు * అదియెుకనేపులుగుండుచోటు * శుద్ధగురు
బోధనుగొడ్డలిచేబూని । మట్టిపులుగులరెంటి మలచికాకపోని
గలదొక్కతూటు * అదియెుకనేపులుగుండుచోటు॥ ౧౦౪॥

తా ॥ శిష్యా! మఱ్ఱిచెట్టువంటి యీశరీరమునకు తొమ్మిదిరంధ్ర ములుగలవు వాటిలో రెండురంధ్రములయందు, అనగా=యిడాపింగళ లు,యెఱ్ఱదిఅనగా=సూర్యనాడి, తెల్లది అనగా=చంద్రనాడి, నల్లది అ నగా=సుషుమ్నానాడి, కఱ్ఱదిఅనగా=ప్రత్యగాత్మనివాసమైన యూర్ధ్వ కుండలి, యీనాలుగింటికి నగ్రభాగమున యెఱుకయనెడుపక్షియుండు ను, సద్గురుని కటాక్షమనెడు గొడ్డలిచేత జీవాత్మ పరమాత్మలనెడు ప క్షులరెంటిని ఖండించి, పరిపూర్ణమునుబొందుమనిభావము.

ప॥ తనువునగలిగినయెఱుకే। తనువుతనువనుచుతనను తా ననియెఱుగుం। దనువునుబాసినమీదట। తననాదేహమునురెం డుతానెఱుగనిపుడు* అదిగనుక తాలేనేలేదపుడు*అనుమానర హితమిందచలమున్నదిగంటె। తనమాటతలపోయతనకుసిగ్గయి తననుతానెఱుగదపుడు * అదిగనుక తాలేనేలేదపుడు ॥౧౦౪॥

తా॥ శిష్యా శరీరమువల్లకలిగిన యెఱుకేశరీరమును తననుతా నెఱుగుచుండును, శరీరమునువిడిచినపిమ్మట పై రెంటినియెఱుగక,తాను లేనేలేకపోవును, గాబట్టితానులేనేలేను,అచలపరిపూర్ణమునునిశ్శంకము గానెఱిగి తనమాట యోచించుటకు తానే సిగ్గుపడి, శరీరయాత్మలు తానినిజెప్పక యెఱుక పారిపోవునని భావము.

ప॥ ఉప్పినిజెఱుగదతనువు। కఱ్ఱపండువిత్తనముజచ్చునారెం టికియా। తిప్పలుతప్పవుధరయే। తిప్పలుతానెఱుగనట్లుతెలుసు కోవోయీ * తనువెఱుకలబయలెల్లెఱుగోయీ*గొప్పయిన గురుబోధచొప్పననెఱిగిపయి।తిప్పలుగలదాని దప్పతీసితెచాలు తెలుసుకోవోయీ*తనువెఱుకలబయలెల్లెఱుగోయీ॥౧౦౫॥

తా॥ శిష్యా! గాలివానకుచెట్టుయొకప్పుడునశించును, మఱియొక ప్పుడు విత్తనమునశించును యీరెంటికినిట్టిచావుపుట్టుకలుతప్పవు,యీ రెంటియొక్కతిప్పలు భూమికిం దెలియదు, అటువలెనే, ఇట్టికడగండ్లు తానెఱుగని మార్గమునునుష్ఠించవలయును, శరీరయాత్మలుండినను పో యినను, పరిపూర్ణమెట్లుయెఱుగును(యెఱుగదు)మహా శ్రేష్టమైన సద్గు రుబోధనుగ్రహించి చావుపుట్టుకలుగలయెఱుకను తీసివేయుమనిభావ.

ప॥ మతములవారలుతమన । సమ్మతమయినటువంటిశాస్త్ర
మర్యాదలచే । మితమేరుపఱచుకొనిబహు । గతులనుకలహిం
తురట్టిగతినీకేమిటికీ*చపలతజెందేస్థితినీకేమిటికీ* ప్రతిలేనియీా
బట్టబయలుండజూచినం । తతములేనెఱుకలేదనినమ్ముమికవారి
గతినీకేమిటికీ * చపలతజెందేస్థితినీకేమిటికీ॥ ౧౦౭॥

తా॥ శిష్యా! మతములవారు, తమమతములకు సంబంధించిన ఆచారనిష్ఠలనెడు మర్యాదలనుగ్రహించి, మితివేరలుగలవారై యొకరితోనొకరు పక్కువిధములవాదములాడుచు కలహములుచేయుదురు, అట్టిసంకల్పములైన విరుద్ధపువాదములు నీకేందుకు, సమానరహితమైనయచలమును దర్శించినదాలేని యెఱుకను విడువుమనిభావము.

ప॥ ద్వైతాద్వైతవిశిష్టులు । సైతునువినసై పరెవుడుసై
పకపిదపణ । సైతురుక్రమమునవేరని । నాతతమదిజీవశివుల
నవివినబోకు*నేబోధించిన నవివిడువబోకూ * పూతమాబయ
లునుబొడజూచిగురునిచే । ద్వైతాద్వైతవిశిష్టాద్వైతముల
నుమానుమవివినబోకూ* నేబోధించిన నవివిడువబోకూ॥౧౦౮॥

తా॥ శిష్యా! ద్వైతులును అద్వైతులును విశిష్టాద్వైతులును జీవేశ్వరులువేరనికొంతమట్టుకు వాదింతురు, వేరుకాదనికొంతమట్టుకు వాదించి యొప్పుకొందురు, అట్టిచీకాకుమాటలునివ్వువినవలదు, జీవుని శివునినమ్మవలదు, నేనుబోధించినబోధను విడువవలదు. ప్రత్యక్షముగా గనుపించెడు పరిపూర్ణమునుదర్శించి, ద్వైతాద్వైత విశిష్టాద్వైతులను మతవాదులనువిడువుమని భావము.

ప॥ కొందఱుదశవిధనాదము । లంమననభపంచకంబునందు
నజ్ఞత్రా । లందునలక్ష్యధ్యానము । లందునహంసందు బుద్ధినా
టింతురోయీా*యోగములందునటియింతురోయీా* అందుసి
ద్ధులచేతనానందింతురుగొంద। అెందరేమనిననీబోధం దేయుండు
మునాటింతురోయీా*యోగములందునటియింతురోయీా॥౧౦౯॥

తా॥ శిష్యా! లోకమునంగొందఱు, దశవిధములైన నాదములయందును. ఐదు ఆకాశములనగా=చిదాకాశ,ధారాకాశ, ఘటాకాశ, మఠాకాశ,హృదయాకాశములయందును,షడాధారములనగా=ఆధార

స్వాధిష్ఠ, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయములయందును వివిధలక్ష్యములయందును, సాకారధ్యానమనగా=శివకేశవనామములను ధ్యానించుటయందును, పరమహంసభావమైనప్రణవమందును, తమబుద్ధినిచొప్పింతురు, మంత్ర లయహఠరాజయోగములయందునువర్తింతురు, అణిమాదిసిద్ధులచేత నానందింతురు, యెవరెన్నిపాట్లుబడినను, యెన్నిజెప్పినను, నీవుయీబోధను విడువవలదనిభావము.

ప॥ కొందఱుముద్రలుగనవలెనందురుమఱికొందఱధికమందురుద్రష్టక । కొందఱుభజనేలెస్సని యందురుయివియన్నియెఱుకేననితెలుసుకొనుమీ ✽ నీకివియేలపనిలేదువినుమీ✽ ముందుగపరిపూర్ణమున్నదిగనిగుర్తు । నెందుండకుండదానెగరగొట్టినజాలుననితెలుసుకొనుమీ✽నీకివియేలపనిలేదువినుమీ॥౧౧౦॥

తా॥ శిష్యా! కొందఱుపంచముద్రలనభ్యాసము చేయవలెనందురు, కొందఱుద్రష్టయైన సర్వసాక్షినిదర్శించవలెనందురు, కొందఱుఆత్మధ్యానమేబాగనియందురు, యివియన్నియునుయెఱుకేయని తెలుసుకొనుము. నీకుఅట్టియుక్తిమార్గములుపనిలేదు,పరిపూర్ణమునుప్రత్యక్షముగాజూచి, యీగుఱుతునువిడుచుటదోషరహితంబనిభావము.

ప॥ దేవునినీవుయెఱుంగవు।నీవిప్పుడుయెట్టివాడవోనేదెలిపెదనీ। కావెట్టిబోధలెందుకు।కావుననదేవునిదుగోగనుగొనవోయీ ✽నామరూపకర్మలేవోయీ✽నీవాదేవునిలోననినులెస్సవెదికిన। నావలముచ్చటనడుగోయి దెల్పెదికనుగొనవోయీ ✽ నామరూపకర్మలేవోయీ॥ ౧౧౧॥

తా॥ శిష్యా! దేవునినీవుయెఱుంగవు, నీవిప్పుడుయెట్టివాడవోనీకుందెలియునువినుపించెదనువినుము, నీకుఅట్టివెట్టిమార్గములెందుకు, ఆదేవునినీవిప్పుడిదుగోజూడుము, నామరూపకర్మములులేవు,ఆదేవునియందునిన్ను నీవుబాగావెదికినపిమ్మట యడుగుమునేను దెల్పెదననిభావము.

ప॥ మానవుడుసేయబూనిన । దానినిలోతెలిగిచేయదగుననిమదిలో । నేనెఱిగినీకుజెప్పితి । పూనుమురుచిబుట్టగేనిపోనీ మనసూ ✽ రుచిపుట్టితేపూనునీమనసూ ✽ నేనేమియనబోతినీ

కేమితోచునో, లేనినిష్ఠురములులేకుండుటెలెస్సపోనీమనసూ*
రుచిపుట్టదేపూనునీమనసూ॥ ౧౧౨॥

తా॥ శిష్యా! మనుష్యులు చేయదలచినకార్యములను జక్కగా విచారించి చేయవలయును, నేనుజక్కగావిచారించి తెలుసుకొనినీకుం జెప్పితిని, నామాటలు నీకురుచిపుట్టకుండిన, నీమనస్సునకుంబట్టదు, రుచిగలిగినయెడల నీమనస్సునకుంబట్టును, నేనేమిచెప్పిననీకేమితోచునో లేనినిష్ఠూరములులేకుండుటేబాగు గాబట్టి, నీవు చక్కగావిచారించవలయునని భావము.

ప॥ పంచాక్షరములతోటిప్ర। పంచముతానుద్భవించెప్రణ
వాక్షరము। దంచుశ్రుతులెన్నెదాన్నేటు। కంచననీవెఱిగియె
టుగుమచలముదీనరా * నిల్పకుమెటుకనచలములోనరా * చం
చలమతిచేతచతురాక్షరెక్కవం। చెంచెదవెందుకుయిదినమ్మియె
టుగుమిట్లచలముదీనరా*నిల్పకుమెటుకనచలములోనరా॥ ౧౧౩॥

తా॥ శిష్యా! నమఃశివాయయనెడు పంచాక్షరములవలన నీప్రపంచముకలిగెను. ఓంకారమైన ప్రణవాక్షరమున్నదని శ్రుతులు పలుకుచున్నవి, దానినేయెఱుకనిజెప్పంబడుచున్నది, అట్టియెఱుకచేత అచలపరిపూర్ణమునుదెలుసుకొని యీయెఱుకనుఅచలమునందునిలుపవలదు. చంచలమనంబుతో, కొందఱు చతురాక్షరియెక్కువనిజెప్పుదురు, అట్టిమాటలనునీవువినక, పరిపూర్ణమునునమ్మి వర్తించుటేసరియనిభావము.

ప॥ ఎఱుకేచిజ్జడమీజగ। మరయగపరిపూర్ణమేమియనరా
దదియీ। యెఱుకజగములస్థిరములు। పరిపూర్ణముశాశ్వతమ
దిపాటించికనరా * కావారెండీపాటివివినరా * గురుముఖమ
నవీటినరుడుగుతెలిసిన। తిరిగిపుట్టడువాడిద్ధరపై మునుపటివ
లెపాటించికనరా * కావారెండీపాటివివినరా॥ ౧౧౪॥

తా॥ శిష్యా! ఎఱుకచిత్స్వరూపముగాను, జడస్వరూపముగానుయున్నది, విచారించగానిదియేజగత్తుగానున్నది. పరిపూర్ణమిట్టిదట్టిదనియనరాకయున్నది, యెఱుకజగములురెండును అస్థిరములు, పరిపూర్ణముశాశ్వతము, నీవువీటియొక్కతారతమ్యములను జక్కగాగురుముఖం

బునం దెలుసుకొనియూపగిపూర్ణమునం దెవర్తించినయెడల నీకు మఱల బుట్టుక లేదనిభావము.

ప॥ కొందఱుభూతములయిదిటి । యందునజొత్తంబునుంతు రధికములనుచునా । గొందఱుయేమియు లేదని । యందును గురుతెఱుగుమిన్ని యపశబ్దములురా * యివియన్ని యునిలువవని తెలియవలెరా * యెంద రేమనిననీ కెందుకుబయలును । ముందుగ గనిగుఱుతెంచుండనీకిన్ని యపశబ్దములురా * యివియన్ని యునిలువవని తెలియవలెరా ॥ ౧౧౫॥

తా॥ శిష్యా! కొందఱు పంచభూతములే విశేషములనివాటియందుమనస్సుంతురు, కొందఱుయేమియునులేదందురు, ఇవి యన్నియును అపశబ్దములు, ఇవియన్నియునుమాయ యెవరెన్ని చెప్పినను నీవామాటలునమ్మక, గురుకటాక్షమునుబొంది పరిపూర్ణమును దర్శించి, గుఱుతు యెఱిగెడియెఱుకను విడుచుటచేత జన్మశూన్యమగునని భావము.

ప॥ కొందఱుకర్మము నేరా । గెంగుగుమఱికొంద ఱెక్కువం బురుతనువునా । కొందఱుప్రాణములధికం । బందురునీకట్టి వట్టియాశ లేమిటికీ * వారితోపొందు జేసేవేమిటికీ * యెందరిమాటలుయెన్నియినయీబోధ। క్రిందివేగానిపై కెగిదేవిగావిట్టియాశ లేమిటికీ * వారితోపొందు జేసేవేమిటికీ ॥ ౧౧౬॥

తా॥ శిష్యా! కొందఱు యజ్ఞయాగాదికర్మములనుజేయు టేమంచిదనిజెప్పుదురు, కొందఱుశరీరమును నిలుపుకొనుటే యెక్కువని జెప్పుదురు. మఱికొందఱుత్రివిధప్రాణాయామలక్షణము లేయధికములనిజెప్పుదురు. నీకుయిటువంటి మార్గములయొక్క యాశలువలదు. అట్టి వారితోటిస్నేహము చేయుటే జన్మహేతువు, యెవరెన్ని జెప్పినను యీబోధనువిడువకుము, యేమార్గములును యీయచలమార్గమునకుక్రిందివేగాని అధికములైనవి గావనిభావము.

ప ॥ తనువెఱుకలు రెండొక్కటి । యనియనరాదనుమగొంవరందుగుభువిలో । తనువెఱుకలుతుదినొక్కటి। గనుగనుపడకుండు రెండుగనరావోయన్నా * రెండొక్కటివినరావాయన్నా * అనుమానమికయేలనందరిమాటలు। వినబోక నేబోధించినరీతి

నిప్పుడుగనరావోయన్నా॰ రెండొక్కటివినరామాయన్నా॥౧౧౭॥

తా ॥ శిష్యా! యీలోకమునగొందఱు శరీరయాత్మలు రెండు నొక్కటియనిజెప్పరాదని చాలావాదింతురు, తుదను రెండును యొక్కటిగానేకనుపించి, మఱలగనుపించవు, రెండునొక్కటియని తెలియుము అనుమానమెందుకు నీవుయెవ్వరిమాటలను వినక, నేను బోధించినచొప్పున నమ్ముమనిభావము.

ప ॥ కన్నులప్రక్కలవ్రేల్లిడి । తిన్నగభ్రూమధ్యమందుదృష్టి నిలిపియుం । డున్నదివెన్నెలలోబయ । లన్నాకనుమందు రెఱుకయదినిల్వదోయీ * తనువుతోబాయ్యేదని తెలియవోయీ * యెన్నితనువులువచ్చి యేగినరఘుణకక। యున్నబయ లునుజూచియుల్లక్కెఱుకనువీడుమదినిల్వదోయీ * తనువుతోబాయ్యేదని తెలియవోయీ॥ ౧౧౮॥

తా ॥ శిష్యా! కొందఱుకన్నుల ప్రక్కలయందువ్రేళ్లుంచి భ్రూమధ్యమునదృష్టినిలిపి. యందుండిన పున్నమవెన్నెలలోని బయలును జూడుమందురు. అదియేయెఱుక, అదినిలువదు, శరీరముతోడం బోవునది.అట్టి యుల్లక్కయెఱుకనువిడువుము, యీయెఱుక యెన్నిశరీరములెత్తివచ్చిపోయినను, అచల పరిపూర్ణము చలించకయున్నదనిభావము.

ప॥ జనులాత్మానుభవంబై । నను ముక్తియని బలికిరిట్లునమ్మకుమెఱుకే।కనరాదెచ్చటగురుకృప। ననుభవమెవ్వరికినై ననామాటనిజమా * అనుభవముల్లకాక్కమాటనిజమా * వినజెప్పుమీరెండువివరించిపై మాట । వినినేముందరిబోధవినుపింతువేవేగ నామాటనిజమా * అనుభవముల్లకాక్కమాటనిజమా॥౧౧౯॥

తా ॥ శిష్యా! జనులు ఆత్మానుభవముము క్తియనిజెప్పిరి, ఆమాటలునమ్మవలదు, అదియేయెఱుక, అనుభవముకల్ల, ఆమాటలు నిజముకాదు, అదిగురుకృపకాదు, అచలపరిపూర్ణమే గురుకృప, అట్టి బోధనే వినుము, అనుభవమార్గములు కల్లలనిభావము.

ప ॥ తనుదాగనినను మోక్షం । బనిపలికిరిగానిజనములదిన మ్మకుమీ । తనుదానుబట్టబయలుటను । గనబోయి తెతనకుతానె కానరాదోయీ * విశ్వముతనకుకానరాదోయీ*తననుండయి

నదిగనుక తానువిశ్వము రెండు । గనుపించుటుల్లక్కీగావున త
నకుదా కానరాదోయీ* విశ్వముతనకు కానరాదోయీ॥ ౧౨౦॥

తా॥ శిష్యా! కొందఱు తన్నుదాగనిన మోక్షంబని పలికిరి. ఆ
మాటలనునమ్మవలదు, అచలపరిపూర్ణమునందు తన్ను దాజూడబోయిన
తానెంమనుగానరాదు, యీవిశ్వమునుతనకు కానరాదు. తనవల్లనైన
విశ్వముగనుక, తానును విశ్వమునుయీ రెండును గనుపించుటలు యుల్ల
క్కీయని భావము.

ప॥ మాయగదా లేనియహం। బాయగదాతనకుదానెయచల
మునొప్పిం। దాయగదామాయనలే। దాయగదామాయచిత్రమా
యగదోయీ* సంశయమంతబోయెగదోయీ* మాయసమూల
ముమాయజూచుచుండ । మాయమైపోయెను మాయకేయిది
చిత్రమాయగదోయీ* సంశయమంతబోయెగదోయీ ॥౧౨౧॥

తా॥ శిష్యా లేనిమాయేగదాఅహంకారము, అచలముసదాయు
న్నదిగదా, పరిపూర్ణమునందుమాయలేదుగదా, యీమాయనుచిత్రమై
నమాయయని తెలుసుకొంటివానీసంశయమువిడిచెనా లేదా, మాయయొ
క్కసమూలమునుమాయెజూచుచుండును, తుదకామాయేమటుమాయ
ముగాబోవును, మాయయొక్క చిత్రమేయీవిశ్వమంతయునని భావము.

ప॥ లేనియహమున్నబయలును । లేనిప్రపంచమునుతననులె
స్సగదనలో । దానువిమర్శించినయా । లేనిదిలేకుండునవలలే
దుయేమాటా * యిట్లననయిన లేదుయేమాటా* లేనియహమిా
బయిటలేనేలేదనిజూచి । లేనిదికలదని లేనిమాటాడేవు లేదుయే
మాటా * యిట్లననయిన లేదుయేమాటా॥ ౧౨౨॥

తా॥ శిష్యా పరిపూర్ణమునందు లేనియహమును, లేనిప్రపంచము
ను, తనలో తానుజక్కగావిచారించినయెడల, లేనియహమునుప్రపంచ
మును యీరెండును లేకుండుటసత్యము, అందుపైనయేమాటయును
లేదు, లేనియహముపరిపూర్ణమునందు లేదనిజూచినపిమ్మట లేనిదికలద
ని, లేనిమాటలునీవుమాట్లాడవనిభావము.

ప॥ పరిపూర్ణమొఱుకలెట్టివో । గురుముఖమునరెంటిలెస్సగు
ఱుతెటిగెఱుకకా । సరిపుచ్ఛకున్నమ్మవయని। పరిశుద్ధప్రబోధయి

దియెపాటించికనరా * శివరాములపద్ధతియిదిరా * నరులుకొం
దఱుబల్కెదెఱుకనుగ్రమింగియు । పరిపూర్ణమయ్యేనంచెఱుగక చె
డుటకై పాటించికనరా * శివరాములపద్ధతియిదిరా॥ ౧౨౩॥

తా॥ శిష్యా పరిపూర్ణమునుయెఱుకను గురుకటాక్షంబునసెఱిగి, యాయెఱుకను నాశనముచేయకుండుటవ్యర్థము, అదియేపరిపూర్ణము, యిదియేశివరామదీక్షితులవారిమార్గము, కొందఱునరులుతాముచెడుటకై యెఱుకను పరిపూర్ణమేమ్రింగి పరిపూర్ణమేయున్నదని పెక్కువిధములుగాబల్కుదురు,ఆమాటలవలనంబ్రయోజనములేదనిభావము.

ప॥ బిందువుతనువునబుట్టును।బిందువుతనువింద్రియములబ్బెం
దంబసువుల్ । అందముగాగలుగును దే। నందునబుట్టినవి తెలియ
నజునికితరమా*మూలములేనిదని తెలుసుకొనుమా *అందు కెబ
యలున్నదరసిమూలములేని ।బిందాదికంబులపేరుదెల్పగ తెలి
యనజునికితరమా*మూలములేనిదని తెలుసుకొనుమా॥ ౧౨౪॥

తా॥ శిష్యా! బిందువనెడుయాత్మశరీరమందుపుట్టుచున్నది, అట్టిబిందువువలనశరీరమును యింద్రియములునుగలుగుచున్నవి, యివితప్ప వేరేవిధమునబుట్టినవనిజెప్పుటకు బ్రహ్మకైననుయలవికాదు, మూలములేనిదని తెలుసుకొనుము, అందు కేబయలున్నదనియెఱిగి, మూలములేనిబిందువును శరీరయింద్రియములయొక్క పేర్లనుదెలుపగా,వాటినిదెలియుటకు బ్రహ్మదేవునికైనను యలవిగాదనిభావము.

జనులనిరిదేవుడెవరికి ।కనరాడనినామరూపకర్మజననముల్।
గననతనికిలేవనియా । జనవాక్యముబయలుకెపుడుసహజమా
వినరా * అనుమానముచాలించికనరా * కనినామరూపాదిక
ములున్నయెఱుకను । వినబోకకనబోకవిడిచిపెట్టినపోను సహజ
మావినరా * అనుమానముచాలించికనరా॥ ౧౨౫॥

తా॥ శిష్యా! దేవుడెవ్వరికిని గనరాడనియును, నామముగాని, రూపముగాని, కర్మముగాని, జననమరణములుగానియతనికిలేవనియును బలికెడు జనవాక్యములుసహజముగా పరిపూర్ణముకేనని జెప్పంబడుచున్నవి. అనుమానములేనివాడవై నామరూపకర్మజననములు గలయెఱుకను వినక, చూడక యదివిడిచిపెట్టినం బోవుననిభావము.

ప॥ అంతటగలదీయెఱుకని । యెంతో వాదింపుచుందురెఱు
గనివారల్ । యింతటనంతటగనుపడు । నంతటిదేకానియెఱు
కయంతటగలదా * అదినిజమై తేయగుపడవలదా * అంతటగ
లదొక్క యచలమెగానెఱుక। యంతటగలదని యనరాదువినరా
దు యంతటగలదా * అదినిజమై తేయగుపడవలదా॥౧౨౬॥

తా॥ శిష్యా! యెఱుగనిమానవులు యెఱుకయంతటను గలదని
యెన్నోవిధములవాదింతురు, యెఱుక, అంతటంతటగనుపించినట్టిమా
యముగా బోవునట్టిదేగాని. అంతటనునిండి నిలిచినదికాదు, యెఱుక
అచలపరిపూర్ణబ్రహ్మమువలేనిజముగా నిండియుండినయెడల కనుపించ
వలదా, యెఱుక అంతటనుగలదన్న వాక్యమువినరాదు, అనరాదనిభావ.

ప॥బయలాకసమనికొందఱు।భయపెట్టెదరందువలనభయప
డకుమిదె।బయలందుశబ్దమున్నను। బయలాకసమని నమ్మబడు
నునీచేతా*శబ్దములేదీ భ్రమయెందుచేతా* బయలాకసముగా
దు పరిపూర్ణమనినమ్మి।నయముగయెఱుకను నమ్మకవిడిచి పోబ
డును నీచేతా*శబ్దములేదీభ్రమయెందుచేతా॥ ౧౨౭॥

తా॥ శిష్యా! కొందరుమాయకులు పరిపూర్ణమును. ఆకాశమని
జెప్పిలోకులను భయపరుచుచున్నారు. అందువలననీవు భయపడకుము
పరిపూర్ణమునందు శబ్దముండినయెడల. ఆకాశమనిజెప్పవచ్చును.పరిపూ
ర్ణమునందుశబ్దమించుకైనను లేదు,గనుక యదియాకాశముకాదు. అచల
మని నమ్మి యెఱుకను నమ్మకుండిన యదేవిడిచిపోననిభావము.

ప ॥ కలమేల్క లెఱుకబయలులు। కిలసామ్యము చేసిచూడు
నీభ్రమతొలగున్।ఫలమేమి పెక్కుచదువుల।వలనను జపయాగ
యోగవ్రతములవలనన్*శమదమమఖశతములవలనన్*తలక్రిం
దుగా బద్ధతనువునేగానన్న, కలమేల్కనిన తానెక్కడనిల్వాద
ట్లనే వ్రతములవలనన్*శమదమమఖశతములవలనన్ ॥౧౨౮॥

తా॥ శిష్యా,కలయును,మెలకువయును,యీరెంటిని యెఱుకపరి
పూర్ణములకుసాటిగాజెప్పితిని,యిందువలన నీభ్రమతొలగిపోవును, పె
క్కుచదువులు చదువుటవల్లను, వివిధజపములు చేయుటవల్లను, యా
గయజ్ఞాదిక్రతువులుచేయుటవల్లను, వివిధయోగములవల్లను, అనేకవ్ర

తములవల్లను, శాంతశమదమాదులుగలుగుటవల్లను, నూరు అశ్వమే
ధయాగములుచేయుటవల్లను, ఫలితార్థముగలుగనేరదు,తలక్రిందుగా
నిలిచితపస్సుచేసినను యీతనువునేనుగాను, కలగనిమేలుకొనిన,కలలో
దోచిన వస్తువులులేనటుల, గురువాక్యముచేత మేలుకొనినవారికి,మెఱు
కనెడు తాను యెందును నిలువకపోవుననిభావము.

ప॥ నీకలలోనినునన్నును।లోకులలోకములజూచిలోపలిభ్ర
మచే । నాకరుణవడసి మెలకువ । చేకొనికలకల్లజేసిజేరేదవెట
కో * సర్వమునీతోజేరునువెటకో * ప్రాకటముగబట్టబయలెఱు
కలీరీతి।నీకుదెలిసినవెనుక నిలువక వేవేగచేరేవెచ్చటికో* సర్వ
మునీతోజేరునువెటకో॥ ౧౨౯॥

తా॥ శిష్యా, నీకలలోపలనిన్నును,నన్నును,లోకులను,లోకము
లనుజూచి,లోపలిభ్రమచేత భ్రమసియున్నావు, నాకరుణవలనమెలకువ
నుబొంది. కలనుకల్లగాజేసి యీమెఱుకయెందుబోవునో దానివెంటనే
సర్వమునుబోవును, బట్టబయలైన పరిపూర్ణమును. మెఱుకనెడు మా
యను నీకుమెఱిగించితిని. నీవుఘట్టిగాపూనినయెడల. మెఱుక నిలువ
క, సర్వముతనవెంటరాగా పారిపోవునని భావము.

ప॥ హరికరనఖముఖవిదళిత।కరిమస్తకగళితమైనఘనమౌక్తి
కముల్ । దొఱికినమెఱుకలుగుఱిబలె । ధరియింతురువెంటివె
లలుతమరెఱుగలేకా * అట్లనెబోధక్రమమెఱుగలేకా * పరి
పూర్ణబోధనుమెఱిగింపుచుండియా।మెఱుకకేకొందరుమఱిగేది
మర్మముతమరెరుగలేకా*అట్లనెబోధక్రమమెఱుగలేకా॥ ౧౩౦॥

తా॥శిష్యా. సింహముయొక్క గోళ్లచేతను,దంతములచేతను,జం
పబడినయేనుగుయొక్క కుంభస్థలములోనిముత్యములను, మెరుకలవాం
డ్రుధరియింతురు,ముత్యపుచిప్పలలోనిముత్యములయొక్కయు,యేనుగు
కుంభస్థలములోని ముత్యములయొక్కయు, యీరెంటియొక్క వెలలు
ఆ మెరుకలవాండ్రెట్లు తెలియనేరరో, అటువలెనే. వివేకశూన్యులు
పరిపూర్ణబోధయొక్కనిజమైన భావమును, మెఱుక మార్గము యొక్క
యుళక్కి భావమును, యీరెంటియొక్క తారతమ్యతలను జక్కగా గ్ర
హించి పరిపూర్ణభావమును మెఱుగనేరరని భావము.

ప॥ తనువో బహిరింద్రియములో । మనసో ప్రాణములో విష
యనుమతో నేనం । చనిసీవనియదియిదియని । యనుమానిం,
చెనవదేలనదిత్రోవగాదూ* నీవెన్నదునిదివినలేదూ*వినుమీ
పరిపూర్ణముగనిలేనియీమీది । తనువధికములేదని గురునిచే
తెలియుము యిదిత్రోవగాదూ*నీవెన్నడునిదివినలేదూ॥౧౩౧॥

తా॥ శిష్యా! నేనని నీవని అదియని యిదియని జెప్పునది శరీ
రమా, జ్ఞానేంద్రియములా,కర్మేంద్రియములా, లేకవిషయములా,మన
స్సా,ప్రాణములా, జెప్పుము. అనుమానమెందుకు అది మార్గముకాదు
నీవెన్నడునిట్టిబోధనువినలేదు, తనువుకంటెను అధికము లేదు, యింద్రి
యబృందమేతనువు, యిదిమార్గముకాదు,అచలగురుకటాక్షమును బొం
ది యచలపరిపూర్ణమును దర్శించు టేసరియైనమార్గమనిభావము.

ప ॥ నినునను ప్రపంచమునునిజ । మనియెఱిగేయెఱుకచేత
నచలమునుగనుం।గొనిననుజగమనియెఱిగెడి।యెఱుకను తక్షణ
మెమానుమమలవివేకా * చాలునీక్రమమెఱుగుదాకా*నినున
న్నుపై రెండింటినివిశ్వమునుబై । లనరాదున్నదనిగుర్తు లేకుం
డుమమలవివేకా * చాలునీక్రమమెఱుగుదాకా॥ ౧౩౨॥

తా ॥ శిష్యా! నిన్నును నన్నును ప్రపంచమును నిజమని యెఱి
గెడుయెఱుకచేత. అచలమునుజూచి యిన్నిటినియెఱిగిన యెఱుకను త
క్షణమేవిడువుము, బుద్ధిమంతా యిదియేవివేకము, వీటినన్నిటిని యెఱి
గినయెఱుకను బయలనిచెప్పరాదు. అదియున్నదని గుఱుతులేదుగాబ
ట్టి అచలబోధనుబొంది గుఱుతుగల యెఱుకనువిడువుమని భావము.

ప॥ ప్రొద్దుననిద్దురమేల్కొని । వద్దికియేతెంచిగురుని వక్త్రో
జనితమా । సుద్దులుప్రమొక్కి వినుముయే । ప్రొద్దవిబలుముద్దు
సుమ్మిపుట్టినందులకూ* గురుచరణముపట్టినందులకూ*నిద్ధభా
భక్తిచేసీవిట్లుజేసితె। దిద్దితీర్చినబోధ తెఱగుజూపును నీవుపుట్టి
నందులకూ * గురుచరణముపట్టినందులకూ॥ ౧౩౩॥

తా॥ శిష్యా! తెల్లవారినవెంటనే నిద్రమేల్కొంచి,సద్గురునియొ
ద్దకుంబోయి, యీమహాత్మునివాచా వచ్చెడు యమృత వాక్యములను,
అత్యంతయాసక్తితో వినుము నీవు పుట్టినందుకు సార్థకమేమి, గురుపాద

ములనుబట్టుట సార్థకము, యిటుల జేసితివేని, నీకు బోధచక్కగాపట్టును జననమరణములులేకుండ జేసుకొనుట సార్థకమనిభావము.

ప॥ గురుడుపరిపూర్ణమునుజూ । పెఱుకే లేదనుచు తెలిపి యి
కదలపకుమం । చెఱిగించకవిడిపోవునె । యెఱుకనరుల్ సాధన
ములుయెన్ని జేసిననూ * లక్ష్యముముద్రలెన్ని జూచిననూ*హరి
హరబ్రహ్మసురాసురముఖులైన।ధరణీసురాద్యష్టాదశజాత్యుద్భ
వులైనయెన్ని జేసిననూ *లక్ష్యముముద్రలెన్ని జూచిననూ॥౧౩౪॥

తా॥ శిష్యా! సద్గురుడు పరిపూర్ణమునుజూపించి యెఱుకను లేదనిజెప్పి యెఱుకను మఱలదలచవద్దని యెఱిగించకుండిన యీయెఱుకవిడిచిపోనేరదు, యెఱుకేనరులకు ముఖ్యమైన సాధకముగా నున్నది, లక్ష్యములునుముద్రలును యెన్నిజూచినప్పటికిని, విష్ణువును, శివుడును, బ్రహ్మయును ఇంద్రాదిదేవతలును, బ్రాహ్మణులు చండాలురు, మొదలగు పదునెనిమిది జాతులయందును బుట్టినవారిలో నెవ్వరైనను, గురుడువిడిపించకుండినయెడల యెఱుకనువిడువ నేరరనియును, ముద్రలులక్ష్యములయొక్క సాధకములు వలదనియును భావము.

ప॥ బలధనవిద్యాధైర్యం।బులుచక్కదనంబుసత్త్వ బుద్ధ్యా
దులిలం । గలలోనివిలేనిమను । ష్యులజగమునుతనను తాను
జూచిమానవుడూ * మేల్కనెనేని చూడలేడొకడూ*కలమేల్క
నెఱుకబయలులకట్లజతగూర్చి । కలయెఱుకల దేశికుల చేవిడితే
చాలుచూచిమానవుడూ* మేల్కనెనేనిచూడలేడొకడూ॥౧౩౫॥

తా॥ శిష్యా! బలమును, ధనమును, విద్యయును, ధైర్యమును. చక్కదనమును, శాంతమును, బుద్ధియును, యీమొదలైన సర్వమున్నుకలవంటివి, నిజస్వరూపమైనపరిపూర్ణమునుదర్శించిమేల్కనినపురుషుడు, కలలోనివాటిని జూడనేరడు, గనుక కలమెలకువలను యెఱుకబయలులకు జతగూర్చి కలయెఱుకలు రెండును దేశికస్వాములవారివలన విడిచిపోతేచాలును, యేమానవుండైనను మేల్కనినవెనుక కలయందు గనుపించినవాటిని మఱలజూడలేడనిభావము.

ప॥ ఈవట్టిబట్టబయలును।నీవిప్పుడునుండజూచినిజముగయెఱు
కగ । నీవనినేననిజగమని । భావింపుముపిదపదీనిబాయుమనిశ

ముః * యేమంకుమీనీవహర్నిశముః * శ్రీవనితశారదజీవ సంభవభవ । దేవేంద్రాదులనింకసేవించుతలపేల బాయుమని శముః * యేమరకుమీనీవహర్నిశముః ॥ ౧౩౬॥

తా॥ శిష్యా! యీవుత్తబట్టబయలైన పరిపూర్ణమును నీవిప్పు డుండజూచితివిగదా, యెఱుకను నీవనియును, నేననియును, జగత్తని యును, భావించి పిదప యామెఱుకనుపడువ్రుము, లక్ష్మీదేవిని, సరస్వ తిని పార్వతీదేవులను యింద్రాదిదేవతలను దర్శించవలెననెడు తలంపు నీకువలదు, సదాపరిపూర్ణుండవై యుండుమనిభావము.

ప॥ లేదనకుమున్నదిదిగో । నేదెలిసితిననకుదీనినీవెఱిగేవా। కాదదినీచేదెలియను । యేదిరసన్మాత్రిసమితియీబట్టబైటా * దీనికిసాటి యేదియెచ్చోటా * వాదేలనికయెఱుకతోదీని కని పెట్టి । పోదోలుమెఱుకనీకేదిబట్టముచాలుయీబట్టబైట * దీ నికిసాటియేదియెచ్చోటా ॥ ౧౩౭॥

తా॥ శిష్యా! అచల పరిపూర్ణమును లేదనకుము, ఉన్నదిదిగో జూడుము, నేదెలిసితినని చెప్పకుము, నీవుయెఱుగుటకునదిసాధ్యమగునా అదినీకుసాధ్యపడదు, దానియందు శబ్దముగాని, స్పర్శముగాని, రూప ముగాని, రసముగాని, గంధముగాని, యింకనుసత్వాదిగుణములుగాని మితిమేరలుగాని లేనిదిగాబట్టి దానికిసాటియెక్కడిది, యెఱుకచేతనట్టి పరిపూర్ణమునుదర్శించి, యీమాయయెఱుకను యెందునుయుండనివ్వ క, పారదోలుము. నిన్నుయేవృత్తియును బొందనేరదనిభావము.

ప॥ కనవచ్చెదిట్టిదట్టిది.। యనరాకుండునదిబయలు నరెక నుగోనుమీ । కనరాకపోతెశూన్యంబనుమిట్టిది యట్టిదనుచ పలుకవచ్చిననూ*యెఱుకయాలోపలికిజొచ్చిననూ*వినుమాబ యిటనునీవేమనిననెప్పెదగానొప్పనునీమాటనునేజెప్పినరీతి గన వస్తెపలుకవచ్చిననూ*యెఱుకయాలోపలికిజొచ్చిననూ॥౧౩౮॥

తా॥ శిష్యా! కనవచ్చుచున్న యీపరిపూర్ణమునుయిట్టిదట్టిదని జెప్పుటకు నెట్టివారికిని యలవికాదు, దానినేజూడుము, అది ప్రత్యక్ష ముగాకనుపించుచున్నది, కనరాకుండినయెడలశూన్యమని తెలియుము. పరిపూర్ణమిట్టిదట్టిదని తెలియుబడదు. యెఱుక యీపరిపూర్ణమునందు

జూరదు. నేజెప్పినప్రకారమువిని, నాయాజ్ఞప్రకారముయెఱుకనువిడిచి యీపరిపూర్ణమునందే వర్తించుమని భావము.

ప॥ కనవచ్చుబయలులేదని । యనవచ్చునెయిట్టిదిట్టిదనవచ్చునెఛీ । యనరాదుయెఱుకనెన్నడు । గనుకనెయీబయలునెల్లకాలముంచుందీ * దీనందెఱుకేకాలములేందీ* వినుములేనెఱుకనువివరింపశూన్యమయి । యనుమానమేయెఱుకగనువిశ్వమిట్టిదేకాలముంచుందీ * దీనందెఱుకేకాలములేందీ॥ ౧౩౯॥

తా॥ శిష్యా! పరిపూర్ణముప్రత్యక్షముగాగనుపించుచుండగా, లేదనియెట్లుచెప్పవచ్చును,యిట్టిదిట్టిదనినిర్దేశించి చెప్పుటకుసాధ్యపడదు, ఛీఛీయెఱుకయున్నదనిజెప్పరాదు, యీపరిపూర్ణముసదాయేకరీతిగానుంటున్నది, యెఱుకయేకాలమందునులేనిది, విచారించగా యెఱుకేయెందునులేకశూన్యమైపోవును, యీవిశ్వమునుఅట్టిదేనని భావము.

ప॥ పరిపూర్ణమనినయెట్టిదో । యెఱుకెఱిగినయెఱుకవైటికేగినయెఱుకే । యెఱుకకుశూన్యంబయ్యెను । యెఱుకనుజన్మించినట్టియీవిశ్వమంతా * యెఱుకావలనేమిలేదంతా * యెఱుకయుండగానెయెఱుకవిశ్వములే। నెఱుకేయివిజూడయెంతోవింతైతోచునీవిశ్వమంతా * యెఱుకావలనేమిలేదంతా॥ ౧౪౦॥

తా॥ శిష్యా! పరిపూర్ణమనినయెట్టిదోనని హృదయముననెఱింగినయీయెఱుకేవైటికేగిపోవును, అట్టియెఱుకకు యెఱుకేశూన్యంబాయెను, యెఱుకవలనజన్మించిన యీవిశ్వమంతయునుశూన్యమె, యెఱుకపోయినవెనుక యీవిశ్వమేమియునులేదు, యెఱుకయుండగానే యెఱుకయును, యీవిశ్వమునులేనియెఱుకకుయవి యెంతోవింతగా, కనుపించుచుండుననిభావము!

గురుమూర్తిజూపకున్నను । పరిపూర్ణంబెల్లతనకుప్రత్యక్షమగునా।గురుమూర్తిజూపెనేనియు। పరిపూర్ణముతనకులెస్సప్రత్యక్షమారా* చూచితెయెఱుకపారిపోవునురా *యెఱుకపోయినవెనుకయేదిరాప్రత్యక్షము । యెఱిగిట్టిదిట్టిదంచెఱిగేవారటుమీదప్రత్యక్షమారా*చూచితెయెఱుకపారిపోవునురా॥ ౧౪౧॥

తా॥ శిష్యా! సద్గురుమూర్తిజూపకుండిన పరిపూర్ణముతనకు మెల్లప్రత్యక్షమగును, గురుమూర్తిజూపినయెడల పరిపూర్ణముతనకు లెస్సగా ప్రత్యక్షమగును, జూచినయెడల పారిపోవును, యెఱుకపోయిన వెనుక, పరిపూర్ణమిట్టిదట్టిదని నిర్ణయించుటకును, జెప్పుటకును యెవరున్ను లేరని భావము.

ప॥ పరమపదమనగ బయలని। గురుగుహ్యమనంతమనిన గోప్యంబనినను।పరిపూర్ణమచలమనినను। తిరమనిగా బట్టబయలు తెలియుమాయప్పా॥ తెలిసినయా తెలివి మానవప్పా॥ యెఱుక పెఱిగిన దానియెఱుకి మీరినదాని। యెఱుకి మఱుపు లులేని పరవస్తువనబయ లె తెలియుమాయప్పా॥ తెలిసినయా తెలివిమానవప్పా॥౧౪౨॥

తా॥ శిష్యా! పరమపదమనినను, బయలనినను, గురుగుహ్యమనినను,అనంతమనినను,గోప్యమనినను,పరిపూర్ణమనినను అచలమనినను, యీపేళ్లన్నియుస్థిరముగా బట్టబయలుకని తెలియుము, ఇట్లు తెలిసినయా తెలివినివిడువుము, యెఱుకి యెఱిగినదియును యెఱుకినమీరినదియును యెఱుకి మఱుపులులేని పరిపూర్ణమని భావము.

ప॥ బట్టబయలనుమదీనికి। మొట్ట మొదల్ పేరు లేదుముదమునయెఱుకే। పుట్టిపేరు పెట్టెదీనికి। బట్టుకలవ్వాడ లేక పారిపోవునురా॥ కనరాదిందుదూర నేరదురా॥ పుట్టిచచ్చుచుమళ్లి పుట్టిగిట్టుచునుండు। యిట్టితిప్పలు నొందదెఱుకే బయలునుజూడ పారిపోవునురా॥ కనరాదిందుదూర నేరదురా॥ ౧౪౩॥

తా॥ శిష్యా! బట్టబయలని పరిపూర్ణమునకు మొదటపేరులేదు యెఱుకి పుట్టి పేరు పెట్టెను, దానింబట్టుకొనివర్తించుటకు లేక పారిపోవుచున్నది,యెఱుక కానరాక పరిపూర్ణమునందుదూర నేరక, పుట్టుచుగిట్టుచుండును, పరిపూర్ణమునుదర్శించినయెడల యెఱుకమరల పుట్టనే పుట్టదు, యేతిప్పలును లేక యెఱుక హరించిపోవునని భావము.

ప॥వినుమా నేననియెఱిగెడి।తనువందున లేకబయలు తానిండినదో।గనుగొనుమదిగనుగొనియీ।తనువునువిడనాడుమింతతడవేలనోయీ॥యీపనికింకగడువేలనోయీ॥అనుమానముంచకుమాయనఘుతా శివరాములనుడీక్షితులు జేసినయచలగ్రంధము

నంచుసరిచూడవ్వోయీ*యీపనికింకగడువేలనోయీ॥ ౧౮౮॥

తా॥ శిష్యా! అచలపరిపూర్ణమునందు నేను నేనని యెఱిగెడు శరీరము లేక, నిండియున్న దిక నుగొనుము, నీమదిలోగనుగొని యీశరీరమునువిడువుము, ఆలస్యమెందుకు, యీపనికింకగడువెందుకు, అనుమానముండినయెడల, నూపెద్దలైన శివరామదీక్షితులవారుజేసిన, అచల గ్రంథమునందు సరిచూడుమని భావము.

ప॥ దేహాకారముగానిది।యీహంభావంబులేనియఖిలజనులు దా।సోహంసోహంబనినను।మోహాముజెందనిదిబయలుమొదలె ఱుగవలెరా*యెఱిగినయెఱుకతుదకరుగవలెరా*కోహంకస్త్వం బనికూతలుగూసెడి।దేహిదేహములనిదెలియనిదీబయలుమొ దలెఱుగవలెరా*యెఱిగినయెఱుకతుదకరుగవలెరా॥ ౧౮౫॥

తా॥ శిష్యా! పరిపూర్ణము దేహాకారము కాలేదు,అహంభావములేని సర్వజనులు సోహంసోహంబనిబలుకుచుండినను పరిపూర్ణము సంతోషమునుబొందదు, మోదఖేదములులేని పరిపూర్ణమును దర్శించినయెఱుకపారిపోవుటకు సందియములేదు, శరీరియాత్మలను దెలియని పరిపూర్ణమును మొదట దెలిసిన, యెఱుకతుదకువిడిచిపోనని భావము.

ప॥ ఏవస్తువుచేతనుదా।నావిర్భవమొందుదేహామనుతరువరయుగ।ఆవస్తువెదానికివి।త్తైవెలయునుదాన్నెసాక్షిద్రష్టని కనుమీ*యెఱుకైతెస్పష్టమువినుమీ*భావించిచూడమీబట్ట బయలునుభూమి। యీవిత్తుచెట్టున్నదరయగవి త్తినేద్రష్టని కనుమీ * యెఱుకై తెస్పష్టమువినుమీ॥ ౧౮౬॥

తా॥ శిష్యా! యేవస్తువుచేత దేహమనెడుచెట్టుపుట్టుచున్నదో ఆవస్తువేదానికి వి త్తనముగానున్నది ఆవి త్తనమునే సాక్షియనియును ద్రష్టయనియును దెలుసుకొనుము, యెఱుకమాత్రము స్పష్టముగాగనుపించును,చక్కగావిచారించిన యెడలపరిపూర్ణము యెఱుకను యెఱుగనట్టుల, భూమి ఆవి త్తనమును ఆచెట్టును యెఱుగదని భావము.

ప॥ ఏపరిపూర్ణముమేనికి।లోపలవెలినిండియుండులోపము లేకగ।ఆపరిపూర్ణమెజగతికి।లోపలవెలినిండిదానిలోనేయు

న్నదిరా * పయిరెండెవ్వేలేనివెన్నకురా * యీపూర్ణబోధచే
పై ప్రపంచశరీర । రూపములెడబాపుమీపట్లనేదానిలోనెయు
న్నదిరా * పయిరెండెవ్వేలేనివెన్నకురా॥ ౧౪౭॥

తా॥ శిష్యా! యేపరిపూర్ణము శరీరమునకు లోపలవెలుపల నం
నులేకనిండియున్నదో, ఆపరిపూర్ణమే జగత్తునకు లోపలవెలుపలనిండి
దానియందేయున్నది. శరీరప్రపంచములు రెండునులేనివి వాటిని తల
చవలదు, యీపరిపూర్ణబోధచేత పైజప్పిన ప్రపంచశరీర రూపములు
విడిచి పోవుననిభావము॥

ప॥ ఎఱుకనగాయెఱిగేటిది। మఱుపనగాయెఱుకతననుమఱ
చుటయీరెం। డెఱుగనిదేబయలననీ। వెఱిగెఱుకనుమరువుమిప్పు
డెఱుక చేవిడరా* విడిచితెపైమాటలెఱిగే దెవ్వడురా *యెఱుకే ప
రిపూర్ణమనియెదిరించినదిరేవు। పరిపూర్ణమైతెచూపరబయలం
దలిదానినెఱుక చేవిడరా*విడిచితెపైమాటలెఱిగే దెవ్వడురా॥ ౧౪౮॥

తా॥ శిష్యా! యెఱుకనగా తన్నునుప్రపంచమును యెఱుగునది,
మఱుపనగా=తనను ప్రపంచమును మఱచినది, యీరెంటినియెఱుగని
దేపరిపూర్ణము, యెఱుకమఱుపులను యెఱుకచేతనేవిడువుము. విడిచిన
వెనుక పైమాట యెఱిగేవారెవ్వరు, యెఱుకేపరిపూర్ణమనియెదిరించి
వదరవలదు. పరిపూర్ణమైనయెడల, యీబట్టబయలునందు యెఱుకను
జూపించుమని భావము.

ప॥ లేదన్ననుగనుపడుగద। నేదెలసెదనన్నబయుట నేనిలదు
గదా । నేదీనివెనుకగదనా । కేదోమూలంబుయిదగానికలేదె
చ్చోటా * గనుకవుల్లక్కేనసుమాట * సకలవస్తువిషయసాక్షి
త్వములకుదా। నొకరూపమైయుంటనూహింపుమనుభ్రాంతియిక
లేదెచ్చోట * గనుకవుల్లక్కేనసుమాట॥ ౧౪౯॥

తా॥ శిష్యా! పరిపూర్ణములేదని జెప్పినను ప్రత్యక్షముగా గను
పించుచున్నది, నేనుదెలుసుకొందుననిన నేవస్తునది లేకపోవుచున్నది,నే
ననేదు అహంకారముపరిపూర్ణమునకు వెనుకవచ్చినదిగా నున్నది. నా
కుమూలము యిదేగాని వేరొకటిలేదనుట యుల్లక్కి మాట, సమస్త
వస్తువిషయాదులకు సాక్షిరూపమైయుండుటను .యూహించగా సర్వ

ముభ్రాంతి యెచ్చోటను యెఱుకకుమూలము లేదు, వున్నదనుటయుల్లి క్కిమాటయని భావము.

ప ॥ సత్యమగుబట్టబయలున । సత్యంబగుయెఱుకనెఱిగిస
ద్గురుకృపచే । సత్యముగాదనియెఱుకన । సత్యముగానమ్మియుం
టెచాలుచాలన్నా*వానితోటిసాటెవ్వరన్నా * నిత్యానిత్యము
లయొక్క నిర్ణయమెఱిగి । నిత్యుడై యుండేటి నిజబోధగలిగితే
చాలుచాలన్నా * వానితోటిసాటెవ్వరన్నా॥ ౧౫౦॥

తా ॥ శిష్యా! సత్యమైనపరిపూర్ణమును, అసత్యమైనయెఱుకను యీరెంటినిసద్గురుకటాక్షంబున నెఱింగి, యెఱుకసత్యముకాదు, అసత్యమని నమ్మితేచాలును. అట్టి పుణ్యపురుషునకు సాటియెవ్వరునుగాదు నిత్యానిత్యములయొక్క నిర్ణయములను దెలుసుకొని నిత్యుడై యుండునట్టి నిజబోధనుబొందినవారికి, సమానులు యెవ్వరును లేరనిభావము.

ప॥పరిపూర్ణములోదోచిన । యెఱుకేకల లేసియెఱుక నెఱిగినప్పు
డయా। మఱుగెఱుక నెఱుక దెల్పిన। యెఱుగుట మేల్క నదునమ్మి
యిది యేమరకుమీ*సద్గురునాజ్ఞకెదిరిమీరకుమీ*యెఱుకనా
రీతిగయెఱిగిపోయినవెనుక । పరిపూర్ణమొకటుండు పలుకరాద
ట్లుండునిది యేమరకుమీ*సద్గురునాజ్ఞ కెదిరిమీరకుమీ॥౧౫౧॥

తా॥ శిష్యా! పరిపూర్ణమునందు గనుపించినయెఱుక, కలవంటిది, అనగా=లేనిది, దానినెఱుగబోయిన యదియే నటుమాయముగాబోవును. యెఱుకయొక్క మర్మమును. యెఱుకే దెల్పినయెడల, తన్నెఱుగునట్టి యపేక్షనుబొందను, యిది యేమరియుండవలదు, సద్గురునియాజ్ఞనుమీరవలదు, యెఱుకయీరీతిగ యెఱిగిపోయినపిమ్మట, పరిపూర్ణమొకటియుండును, అది అవాఙ్మానసగోచరంబనిభావము.

ప ॥ నేటగుకాటుకపక్షుల। కూటమిదైనదుమనల్లగ్రుడ్డున్న
దియా । మేలైనగ్రుడ్డునడుమను। నాటుకయొక తేజముండినటు
గానవన్నా*బట్టబయిటనలవందునన్నా* పటుతరశోణశుభ్రమ
నీలపీతాది । పటలములోమించిపరమైతా వెలుగొందు నటుగా
నవన్నా*బట్టబయిటనలవందునన్నా॥ ౧౫౨॥

తా ॥ శిష్యా! కాటుకపిట్టలనగా=కంటిపాపలు, అవికూడియుం డుటకొఱకై నీలతోయదమనెడు నల్లగ్రుడ్డుయున్నది, అట్టి శ్రేష్ఠమైన గ్రుడ్డునడుమ యద్భుతమైన తేజమున్నది, అదియేకళాస్వరూపము, అదియేశ్వేతలింగము, అదియేఆపోజ్యోతి, దానినేజూడుము, అదిపరిపూర్ణమునం దేవ్యాపించియున్నది, అదియేమెఱుక,అదిమెఱుపు, తెలుపు నలుపు, పసుపు, ధూమ్రము, ఆకుపచ్చ, యీయారువర్ణములనుమీరిపరిపూర్ణమునందువ్యాపించియున్నదని భావము.

ప॥ వినుమెఱుకేయదిగనుగొను । వినుతింపగబయలటన్నవి
ను తెరువనినట।గనుగొనపాత్రలుగనుపడ। తనువననవయవముల
న్నితగదొంతియనినా ✽ కుండలిభూతతతిజాగ్రతనినా✽ వినుమ
ట్లమెఱుకన్నవివరింతుతత్వాలు । మనసందుఘట్టిగామరువకు
యీమాటతగదొంతియనినా✽కుండలిభూతతలిజాగ్రతనినా॥౧౫౩॥

తా॥ శిష్యా! వినుము అట్టిపరిపూర్ణమునుమెఱుకేకనుగొనుచున్నది, ప్రఖ్యాతిగాబయలునురహదారిబాటనిజెప్పంబడుచున్నది, శరీరమును,యింద్రియములతత్వసమూహమును, జాగ్రతయనెడు యూర్ధ్వకుండలియును,మెఱుకనిజెప్పంబడుచున్నది,యిదినీవుమరువక,నీమనస్సునమెఱుకకు. శరీరయింద్రియముతే, దొంతులని తెలియుమనిభావము.

ప॥ సారలఱిదుంపయనినను। తరువులుధనమనినరవలుధా
రుణియనినట।గిరియనినరాళ్లుగుట్టలు। ధరణిటముళ్లనినత త్వత
తిమెఱుకంచనినా✽మెఱుకసుస్థితిలెస్సకనినా ✽ మెఱుకజేసినవి
శ్వమెఱుకవంటిదెబయలు । నెఱుకగు ర్తెఱిగితానెఱిగితేసరిత
త్వతతిమెఱుకంచనినా ✽ మెఱుకసుస్థితిలెస్సకనినా॥ ౧౫౪॥

తా॥ శిష్యాసారతీగలనినను,అరటిదుంపలనినను చెట్లవిశేషము, ధనమనినదురవ్వలనినమృత్యుకవిశేషము,గిరియనినను, గుట్టలనినను, రాళ్లవిశేషము, తత్త్వసమూహమునుముళ్లకంపని,మెఱుకని జెప్పంబడుచున్నదిగనుక, మెఱుక యీవిశ్వమువంటిదని లెస్సగావిచారించిన యీతెలివిచేత నేపరిపూర్ణమునుదర్శించుటే సరియనిభావము.

ప॥ పెనుమాయనుజూడుముయిదె । జనకునిజఠరంబువలన
జననీగర్భం।బునజొచ్చిమారురూపున।జనియించునునవయవము

లుజనితమైభువిని* వినుకనుతినుమూర్గా నవచ్చునసీ* దినదినమ
భివృద్ధాదిని చేబయలును । గనియామాయలమళ్లకథమాయిం
చుముపోనిజనితమైభువిని* వినుకనుతినుమూర్గా నవచ్చునసీ॥ ౧౫౫॥

తా॥ శిష్యా! పెద్దమాయయనగా = యీశరీరము, శరీరమునకంటెను వేరొండుమాయలేదు, తండ్రియొక్క జఠరాగ్ని యందుండి, తల్లిగర్భము న్ప్రవేశించి, పిండరూపమును బొంది, అవయవములు యేర్పడి, భూమిమీ దజన్మించును, క్రమేణ వినును, జూచును, తినును, ముద్దుజూపును, ఇటుల దిన దినమభివృద్ధిని బొందును, యీశరీరము చేత నేయచలపరిపూర్ణమును గురు కటాక్షంబునం దెలుసుకొని, అట్టి మాయను తిరస్కరించి, మఱల శరీరము లేకుండ జేసుకొనుమని భావము.

వ॥ పెట్టియలోపలిగారడి। చెట్టుపయిగానవచ్చి చెట్టనిచూ
డగా। గట్టుపయిదోచునిదికను। కట్టును మీదనివలెనే గనుపించునె
ఱుగా* అంతలోనెచటగనుపించదెఱుకా * దిట్టమాబోధ చేపట్టి
యెఱుకనుతిరిగి । పుట్టకుండగ దానిపుట్టిముంచుము లేం దెగనుపిం
చ నెఱుకా * అంతలోనెచటగనుపించదెఱుకా॥ ౧౫౬

తా॥ శిష్యా గారడివిద్యలాడువాడు, పెట్టెలో గనుపించి, పిమ్మట యీపెట్టెలోనం గనుపించక, చెట్టుమీదం గనుపించును, పిమ్మట యీ చెట్టుమీదను గనుపించక బావిగట్టుమీదం గనుపించును. పిమ్మట బావిగట్టు మీదను గనుపించక మొదట గనుపించిన పెట్టెలోనుండే లేచి వచ్చును. ఇ దికనుకట్టువిద్య, ఇదే ప్రకారము యెఱుక కనుపించి కనుపించక మటు మాయముగా బోవుచుండును, దీని చేపరిపూర్ణమును దర్శించి యెఱుక మఱ లపుట్టకుండ పూర్ణబోధ చేత, దాని వేరుతో డద్రుంచుమని భావము.

వ॥ నేననని బ్రహ్మాలోపల । లేని దెసంభవము నొందిలీలతనకు
దా । మేనుజగములై వెలసెను । నేనదిమృగజలముగీతి నిజము
గాదనుచూ * లోకుల నేటిగజిబిజివినుచూ* మానసమునవారి
మాటకామోదించి । దానికిబోధనుతగునంచు వినశేస్తి నిజము
గాదనుచూ * లోకుల నేటిగజిబిజివినుచూ॥ ౧౫౭॥

తా॥ శిష్యా! నేను నేనని జెప్పని శబ్దరహితమైన అచలపరిపూర్ణ బ్రహ్మమునందు లేక నే, తనకు తానుగానే బుట్టి, తనమాయచేత శరీరజగత్తు

లుగాపరిణమించెను,నేననుఅహంకారముయెండమావులవంటిదేగాని నిజముకాదు,లోకులుపలువిధములుగా జెప్పెడుగజిబిజి వాక్యములనువిని, నీమనస్సునకొప్పియుండును, అట్టి మనస్సును ద్రిప్పి, నీనిజస్థితిని దెలుసుకొనుటకొఱకై యీపరిపూర్ణబోధతెగియుండునని భావము.

ప॥ కలనెడబాసినమనుజులు।కలలోపలిపనులుసేయగలవార
లేయా।కలవారుగాకువారల।వలెయెటుకనుగురునిచేతవదలెటు
కలోనా * కలదనిసేయవలదెటుకలోనా * కలవారంచని నో
టబలుకుటయరయక । పలికినవారికితొలుగదుపాపము వదలె
టుకలోనా * కలదనిచేయువలదెటుకలోనా ॥ ౧౫౮॥

తా॥శిష్యా!కలనువిడిచి జాగ్రతనుబొందిన మనుష్యులుకలయందలి కార్యములను జేయనేర్తురా(జేయనేరరు)పరిపూర్ణులుకలలోనివారుగారు. సద్గురుకటాక్షముచేత కలయనెడుమెటుకను విడిచినపుణ్యులను గాంచి, వారిమర్మమును దెలియనేరక, లోకులు వారినికలలోనివారని జెప్పినయెడల, అట్టిలోకులకు పాపమువిడువదని భావము.

ప॥ గుడమేమధురముమధురమె । గుడమీగుడమధుర ము
లనుగొనకొనిదొలుతగ । బొడమినదేతెనసరిగా । బొడమినదొ
కటెగనురెండుపోనట్టిగదరా * తనువెటుకలిగ్గినట్టిగదరా*పొ
డజూచిబయలునిప్పుడెమెనెటుకలజోలి। విడరాలేనివెరెండుపెడ
చెవులిడకవినుపోనట్టిగదరా*తనువెటుకలిగ్గినట్టి గదరా॥౧౫౯॥

తా ॥ శిష్యా! బెల్లమే చక్కెర, శర్కరయే బెల్లము, తొలుతగలిగినబెల్లమే శర్కరరూపమునుబొందినది. రెండువిధములుగాపరిణమించిరెండునుబోవుచున్నవి, శరీరయాత్రలురెండునుమెటుకగాపరిణమించి పరిపూర్ణమును దర్శించినవెంటనే యామెటుక పారిపోవును. గాబట్టిగురువాక్యమును జాగ్రతేగావినుమనిభావము.

ప॥ ఇదియున్నదియిదియున్నది । యిదియున్నదియను మెఱ
యలునెఱిగియెటుకచే । యిదిలేనిదియిదిలేనిది । యిదిలేనిదను
నుచునెటుకయెఱిగి తేసరిరా * ఆపైనుండేదెట్లుండువినరా *షక

యా_స్తమానములుడఁగాక యిదినీనె|మ్మదిలోన నమ్మునామాటని
శ్చయమిట్లుమెఱిగి తేనరిరా*ఆపైనుండేదెట్లందువినరా ||౧౯౦||

తా|| శిష్యా! యిదియున్నదియిదియున్నదని నేతినేతివాక్యము
లచేత పరిపూర్ణమునుమెఱిగి, యిదిలేనిదియిదిలేనిదని మెఱుక మెఱిగి
తేనేసరి, ఆపైనుండెడుయచలమును నేనేమనిజెప్పుదును, నామాట నీ
మనస్సుననుంచుకొని యిట్లెరిగితేనేసరి,యిట్టివారికిసమానులులేరనిభా.

ప | ఎఱుగననిమెడిదిమెఱుకే | మెఱుగుదుననితననుపరు
లనెఱిగెడిదెఱుకే | మెఱుక నెఱుంగుదుననిదా| నెఱుగుచునుం
డునదిమెఱుకేనిరుపమబుద్ధి * నీవెఱిగేదినిగమప్రసిద్ధి * గురు
మంత్రమనియేటిగుద్దలితోటియీ | మెఱుకకుండు వేరునెఱిగి
త్రవ్వితెచాలునిరుపమబుద్ధి*నీవెఱగేదినిగమప్రసిద్ధి|| ౧౯౧||

తా || శిష్యా! మెఱుగననిజెప్పునదియును మెఱుకే,మెఱుగుదు
ననితనను యితరులనుమెఱుగునదియును మెఱుకే, మెఱుక నెఱుంగు
దునని శ్రేష్ఠమైనబుద్ధిచేత తానెఱుగుచునుండును, నీవెఱుగునట్టి మెఱు
కేవేదములయందు ప్రసిద్ధిగాజెప్పఁబడినది,. సద్గురు మంత్రమనెడు పా
రచిప్పతోటి యీమెఱుకకుం గలిగియుండిన వేగునుత్రవ్వితే నీయొ
క్క బుద్ధి విశేషమని భావము.

ప|| ఎఱుకేచదువులజేసును | మెఱుకేవినుచమవు నెఱుక మె
ఱుకేతిరమం | చెఱిగించునఃశంకించును| మెఱుకేకొనకేమిలేక
యేగునోయన్నా * బయలేచదువు మెఱుగదోయన్నా *మెఱు
కేమెన్నటికైనపరిపూర్ణమున్నదం| చెఱిగితేలేనవిమెఱిగి తేసలు
వక యేగునోయన్నా*బయలేచదువుమెఱుగదోయన్నా||౧౯౨||

తా|| శిష్యా! వేదశాస్త్రపురాణాది యేబదియారు భాషలును
మెఱుకవల్లనేగలిగెను, మెఱుకేచదువును, మెఱుకేవినును, మెఱుకేస్థి
రమని మెఱిగించును, మెఱుకేసంశయమునుబొందును, తుదకుమెఱుకే
యేమిలేకపోవును, పరిపూర్ణముయేచదువులనుమెఱుగదు, మెఱుకేమె
న్నటికైనను పరిపూర్ణమున్నదనుచు మెఱిగితే, తానులేనని, మెఱు
కనిలువకపారిపోవును. అనగా జన్మమునకురాకపోవునని భావము.

ప॥ చూపులలోఁగలవస్తువు। చూపులగనువస్తువులును జూ
పులుచూడఁగ। దేపటుమెఱుకనితెలియుము। చూపులులేనట్టి
బయలుచూచేదింకేమి*యెఱుకేలేదుతోఁచేదింకేమి* దీపమువ
లెకనుపాపలలోఁగలవస్తు। వేపరమాత్మనిజూపునీవెఱుకసజూ
చేదింకేమి*యెఱుకేలేదుతోఁచేదింకేమి॥ ౧౬౩॥

తా॥ శిష్యా! చూపులలోనుండేవస్తువును. చూపులుగల వస్తువులును. అనగా=నామరూపములుగల సర్వమున్ను యెఱుకనితెలియుము, చూపులులేని పరిపూర్ణము దేనినింజూచుటయెట్లు, పరిపూర్ణమునందుయెఱుకేలేదుగనుక తోఁచుటయెట్లు, రెండును అబద్ధము, కంటిపాపలయందు దీపమువలెగనుపించెదువస్తువే పరమాత్మయనియీచూపునుయెఱుకనితెలియుము, పరిపూర్ణమునకు జూచుటయును దోఁచుటయునులేదనిభావము.

ప॥ శతపత్రాప్తునిబొడగని। యతిరయమునతిమిరమణగి
యగుపడదెట్ల। ట్లతులితగురుకృపగలిగిన। మతిమంతుఁ జూ
చియెఱుకమఱినిల్వబోదూ * సంశయమునీమదినిలుపరాదూ*
శ్రుతులందుస్మృతులందుయితిహాసములయందు। సతతము
శ్రమపడివెదకినయీయెఱుకమఱినిల్వబోదూ * సంశయమునీ
మదినిలుపరాదు॥ ౧౬౪

తా॥ పుత్రా సూర్యునిం జూచి చీకటి యెంత త్వరలో మటుమాయముగాబోవునో, అటువలెనే సద్గురు కటాక్షమును బొందిన బుద్ధిమంతులనుగాంచి యెఱుకయెందును నిలువక పారిపోవును, నీమనో సంశయములను విడువుము, శ్రమపడినదాకాలము శ్రుతులయందును స్మృతులయందును యితిహాసములయందును విచారణజేసినను, యీ యెఱుకనిల్వదని భావము,

ప॥ఎఱుకేకోశములైదును। యెఱుకేభూతములనెఱుగునెఱు
గునుసర్వం। బెఱుకేయెఱుకనెఱుంగును। యెఱుకనుగుర్తెఱు
గవేరేయెఱుకయున్నాదా * ఉన్నదంటేనరకమేకాదా* నిరత
ముగురుసేవపరతంత్రుడగుచున। త్యాగుణపాత్రులై యెఱుక
మాలినవారికెఱుకయున్నాదా*ఉన్నదంటేనరకమేకాదా॥౧౬౫॥

తా॥ శిష్యా! మెఱుకే,అన్నమయ,ప్రాణమయ,మనోమయ,విజ్ఞానమయ, ఆనందమయములనెడుపంచకోశములు, మెఱుకే, ఆకాశము, వాయువు,అగ్ని,జలము, పృధివియీయైదుభూతములను మెఱుగుచున్నది. మెఱుకేసర్వసాక్షియైసర్వమును మెఱుగుచున్నది, అట్టిమెఱుకనుగుర్తెఱుగుటకు వేరేమెఱుకలేను, ఉన్నదనిజెప్పినవారికి నరకమువిడువదు, సదాగురుసేవయెందువర్తించుచు, సద్గురుకరుణకుపాత్రులై మెఱుకనూ విడిచి నఘన్యాత్ములకుమెఱుకలేనేలేదు, ఉన్నదనిజెప్పెడు దురాత్ములకు నరకము విడువదని భావము.

ప॥ గురుమంత్రముచేనిలువని। మెఱుకనుపరిపూర్ణమునుమెఱిగినిరతముగా। మెఱుకయియుండినవారల। తెరువికనీకేలవట్టిదీ జోలిమానూ * మెఱుకలేనియాజోలిపూనూ * గురునిచేపరిపూర్ణమురసియీ తెలిసిన। మెఱుకనెన్నటికిసీమెఱుగకుమిదివట్టిదీ జోలిమానూ * మెఱుకలేనియాజోలిపూనూ॥ ౧౬౬॥

తా॥ శిష్యా,సద్గురుమంత్రముచేతనిలువనిమెఱుకను, పరిపూర్ణమునుమెఱిగియును,సదామెఱుకయియుండినపాపాత్ములమార్గమునీకేల, అదియుశక్యమార్గము, అజోలిమానుము, మెఱుకలేనియామార్గమును బట్టుము, సద్గురునికరుణచేపరిపూర్ణమునుదెలుసుకొని, యాతెలిసినమెఱుకనెన్నటికినితలచవలదు, మెఱుకగలవారితోస్నేహమువలదనిభావ.

ప॥ లేనికలదోచినప్పుడు। లేనివిచిత్రంబులన్నిలేకనెతోచుగా। లేనికలమెలుకొన్నను। లేనివిచిత్రములుతానులేకపోవునురా * అనుమానములేదిందువినరా * లేనెఱుకయీరీతిగానెబయలు నుజూడ। తానుతనుత్రయముపూనెందునిలుచుండ లేకపోవును రా * అనుమానములేదిందువినరా॥ ౧౬౭॥

తా॥ శిష్యా! లేనికలయనగానిల్కడలేనికలకలిగినప్పుడు, నిల్కడలేని విచిత్రములన్నియును లేకనేగనుపించుచుండును, లేని కలయుండుండిమేల్కనినవెనుక లేనివిచిత్రములును తానునులేకనేబోవును, గాబట్టి సంశయములేదువినుము. లేనిమెఱుకయీరీతిగా బయలునుజూచి తానును, స్థూలసూక్ష్మకారణదేహములుమూడును, యెందునునిల్కడ

గాకొంతకాలమైననునిలుచుటకు లేక యెఱుక పాఱిపోవును గనుక, సంశ
యమువలదని భావము॥

ప॥ మరణసుషుప్తులజెందిన । పురుషుకుమేల్కనిన వాడు
భువిలెదితరుడౌ । పురుషుడు కలగనువాడని । యెఱిగుండుము
మొదటియతడె యెఱుగడీరెంటిని * రెండవపురుషు డెఱుగునీ
రెంటిని * యిరువురొక్కటెనుమ్మితిరిగిపుడుదురువీరె । గురుని
చేమేల్కనినతిరిగిపుట్టనేపుట్టడెఱుగడీరెంటిని * రెండవపురుషు
డెఱుగునీరెంటిని ॥ ౧౬౮॥

తా॥ శిష్యా! మరణమును నిద్రయునుజెందినవారికి, మేల్కనిన
పురుషుడు వేరుగానేయుండును. పురుషుడేకలగనువాడని తెలుసుకొను
ము, మొదటివాడైన మరణించినవాడు మేల్కనినపురుషుని కలగనిన
పురుషుని యీయిరువురను యెఱుగడు, రెండవపురుషుడైన నిద్రించు
వాడు మెలకువను, కలనుయీరెంటిని యెఱుగుచున్నాడు, యీయిరు
వురకును పుట్టుగిట్టుటలుతప్పవు, గురుకటాక్షము చేత మేల్కనినపుణ్యా
త్ములు మఱల పుట్టనేపుట్టరని భావము.

ప॥ ఎఱుకేయెఱుకకుకొడుకులు। యెఱుకేతలిదండ్రులెఱుకకె
ఱుకేయితరుల్ । యెఱుకేయెఱుకకుమూలము । యెఱుకకుమూ
లంబుబయలంచెట్లందునోయీ* యెఱుకలేక యేమిలేదోయీ*
యెఱుకలేనియుత్తపరిపూర్ణమునుజూచి। యెఱుకేతానేననీ యెఱిగి
పోయినపైమాటెట్లందునోయీ*యెఱుకలేకయేమిలేదోయీ॥

తా॥ శిష్యా! యెఱుకే యెఱుకకుపుత్రులు. యెఱుకేతల్లిదండ్రు
లు, యెఱుకకు యెఱుకేయితరులు, యెఱుకే యెఱుకకుమూలము, యె
ఱుకకుమూలము పరిపూర్ణమని నేనెట్లుజెప్పుదును, చెప్పనేజెప్పను, యె
ఱుకలేక యీవిశ్వమేమియునులేదు. యెఱుకలేని యీయుత్తపరిపూ
ర్ణమునుజూచి యెఱుకతానులేనని యెఱిగిపోయినపిమ్మట, ఆమాటనే నె
ట్లందును, పరిపూర్ణము శబ్దరహితమైయున్నదని భావము.

ప॥ గుఱుతుగకలలోపలస్త్రీనరులూరికెవచ్చిపొంది నయ్యము
గనుత్తులక్ । పరకన్నియలనుగాంచియు। గురువరుచేమేలుకొ
నినగుఱుతుండదన్నా * అపై ఘ్నాటనెఱిగే దేవజ్ఞా* యెఱుకొ

కట్టుంటనే యేర్పాటులుండును । యెఱుకొక్కటగితే యేర్పా
టు కేసెడిగుఱుతుండదన్నా * ఆపై మాటనెఱిగేదేదన్నా ॥౧౭౦॥

తా॥ శిష్యా, యీకలయందుగుఱుతుగా స్త్రీలును పురుషులును వచ్చి, కామోద్రేకము చేత నొకరితో నొకరు భోగించి, కొమాళ్ళను, కొమార్తెలను గని, వారితో సుఖదుఃఖములననుభవించుచుందురు, సద్గురుని కరుణ చేత మేల్కొనిన యీగుఱుతుండదు, ఆపై మాటను యెఱిగే దెవరు ఇక, యెఱుకొక్కటుండినయెడల యేర్పాటులన్నియునుండును, యెఱుక యేగిపోయిన వెనుక యేర్పాటున్ను, గుఱుతునుయుండదనిభావము.

ప॥ నినునను నీవునుగాంతువు। నినునను గలలోన గాంతునే నొక
వేళ। నినునను నీవును నేనును। నినుగనుగొనగలమె మేలుకొనిన
మీాదటనూ * గురుబోధిట్లువినిన మీాదటనూ* మునుపుగలిగిన
యెఱుక మొదటికేనిలువదు। నినునన్ను నేనిన్ను నినునీవెఱుగుట
యెట్లుకనిన మీాదటనూ * గురుబోధిట్లువినిన మీాదటనూ॥ ౧౭౧॥

తా॥ శిష్యా' నీవునిన్నునునన్నునుజూచెదవు, కలలో నొకసమయమున నేను నిన్నుజూచెదను, మేలుకొనిన పిమ్మట నిన్నునునన్నును నీవును, నేనునిన్నును నన్నును జూడనేరము, యిదే ప్రకారము గురుబోధమైన పిమ్మట యెఱుక మొదట నేనిలువదు, నిను నేనును, నను నీవును జూచుటలేదు, రూపునామములుగల సర్వమును జూచుటకలయనియును, అచల పరిపూర్ణమును దర్శించినదియే, మెలకువయనియునుభావము॥

ప॥ నినునీవునన్ను నేనును । నను నీవును నేను నిన్నునను యెఱిగి
నదే । తనునెఱుగనిదానినిగని । తనకలిమిప్రపంచు దెలసితా
నేగనేని * అది మెలగవలదా నెవ్వడెఱిగీనీ* నను నీవు నేనిన్ను విను
పించమని । యనుటకిద్దరికి పుడుమును పున్న యెఱుకేది తానేగ
నేని * అది మెలగవలదా నెవ్వడెఱిగీనీ॥ ౧౭౨॥

తా ॥ శిష్యా! నీవునన్నును నేనునిన్నును తన్నును యెఱిగినదే యెఱుక, నిన్నును నన్నును తన్ను యెఱుగని పరిపూర్ణమును దర్శించితన బ్రతుకు భాగ్యములు వ్యర్థములనితాను యెఱిగిపోయిన వెనుక, యెవ్వరుండి యెఱుగుదున్నారు. యెఱిగేవారు లేరు, మనకిరువురకును ముందుండిన యెఱుక విడిచిపోయెనని భావము.

ప॥ తిమిరారియందులేనిది। తిమిరముతనుదానెవచ్చితేజో
నిధియై। తిమిరారియునికిగనుగొని । తిమిరముతానిలువనట్లుతె
లుసుకోరాదా ✱ బయలెఱుకలదెలిసియామీదా ✱ భ్రమరూప
మైనట్టిబ్రహ్మాండమెఱుకల । భ్రమతీసివేసితేభ్రాంతిపుట్టునుమళ్లీ
తెలుసుకోరాదా ✱ బయలెఱుకలదెలిసియామీదా॥ ౧౭౩॥

తా॥ శిష్యా! సూర్యునియందులేనిదేచీకటితనకుతానేవచ్చితనకు తానేవ్యాపకమై సూర్యుడురాగానే చీకటితానెందును నిలువక మటుమాయముగాబోవునో, అటువలెనే పరిపూర్ణమునుగనిన భ్రమ స్వరూపకమైన యెఱుకలనకుతానే మటుమాయముగాబోవును, యీబ్రహ్మాండమెఱుకలయొక్క భ్రమనువిడిచినమఱలభ్రాంతిపుట్టనేరదనిభావము.

ప॥ లేదులేదనుచునెందరు । వాదించినలేకపోదుపరిపూర్ణ
ముతా । పోదుపోదనుచునిలిపిన । పోదనియనుకోకుమెఱుకపో
నేపోతుంది ✱ ఘట్టిగలేచిపోనేపోతుంది ✱ వాదభేదములేనివారి
చేయెఱుకను । పాదుకదలించేటిపద్ధతినెఱిగితేపోనేపోతుంది ✱
ఘట్టిగలేచిపోనేపోతుంది॥ ౧౭౪॥

తా॥ శిష్యా పరిపూర్ణములేదులేదని యెందరువాదించినను లేకపోదు, యెఱుకపోదుపోదనియెందరువాదించినపోనేపోతుంది, నిజముగాలేచిపోనేపోతుంది, గనుకవాదభేదములేని యచలభావజ్ఞులవలనయెఱుకయొక్క పాదుకదలించెడువిధమును దెలుసుకొనిన యెడలయెఱుక (ఘట్టిగా=అనగా నిశ్చయముగా) విడిచిపోవునని భావము.

ప॥ మేనెఱుకలరెంట్లోనొక। దానినియెడబాసిజేయతరమా
పనులక। మేనికియెఱుకకుగావున। మేననయెఱుకెఱుకయనినమే
ననియెఱుగూ ✱ రెంటినినీవునేననియెఱుగూ ✱ నెఱిగివీటితో
బయలునెఱిగిమేనెఱుకల । తిరిగిచూడకుచూస్తిగురునిపాదము
లానమేననియెఱుగూ ✱ రెంటినినీవునేననియెఱుగూ॥ ౧౭౫॥

తా॥ శిష్యా! శరీరయాత్మలురెండునొకదానినొకటి బాసియుండుటయును, కార్యములనుజరిపించుటయునులేదు, శరీరమనినయాత్మయనిన రెండునునొక్కటేయని తెలుసుకొనుము, యీరెంటితోనుపరి

పూర్ణమునుగనిపట్టి, శరీరయాత్ర లనుమఱలవిచారించకుము, వాటినిమ ఱలతలంచినయెడలనీకు సద్గురునిపాదమానయని భావము.

ప॥ మఱపునుషుప్తియుమూర్ఛయు। మరణంబుసమాధియును
చుమానవులెఱుకగ। దొఱగిననరునిశరీరము। నెఱిగదరానరుడు
మేను నెఱుగపోయన్నా॥ తననైన తానెఱుగడోయన్నా॥ యెఱుగ
కుండిననాడుతిరిగిపుట్టుచునుండు। తిరిగిపుట్టడువాడీగురుబోధగ
లిగితేయెఱుగపోయన్నా॥ తననైన తానెఱుగపోయన్నా॥ ౧౨౬॥

తా॥ శిష్యా! మఱపును, నిద్రయును, మూర్ఛయును, చావును, యీనాలుగిటిని మానవులు సమాధియనియందురు, యెఱుక విడిచినశరీరములనుమానవులెఱుగ నేరరు, యీనాలుగు అవస్థలలోనున్న మనుజుడు శరీరమునుయెఱుగడు, తన్ను తానైననుయెఱుగడు, యెఱుగనివాడుమరలజన్మమునకువచ్చుచుండును, యీయదెఱుగు గురుబోధనుపొందినవారు మఱల పుట్టనేపుట్టరని భావము.

ప॥ పరిపూర్ణమెఱుకలిపియని। యెఱుగనిజయలందులేని యె
ఱుకతనకుదా। నగురించుటగురుశిష్యుల। నెఱగు సమాట్లాడి
రెంటితెలిసితాజనుమా॥ ఆపై మాటపలికేదేదికనూ॥ ఆగిమరలే
కనేనెఱింగించినట్టిగురు। గురుబోధపాత్రులనెఱిగికతెలుపకు తెలి
సితాజనుమా॥ ఆపై మాటపలికేదేదికను॥ ౧౨౭॥

తా॥ శిష్యా! యిదిపరిపూర్ణము, యిదియెఱుకని, యెఱుగనిబట్టబయలందు, లేనియెఱుక లోనుగానేవచ్చిగురుశిష్యుల పగిదివర్తించి, పయిరెంటిని తెలుసుకొని, యెఱుకేపారిపోవును, యెఱుకపోయినవెనుకమాట్లాడేవారు లేరు, సందియములనుబొందక, నేనెఱిగించిననాగురుబోధను నీవు అపాత్రులకునివ్వవలదని భావము.

ప॥ మఱపునుషుప్తియుమరణము। పరిపూర్ణంబునకునావ
ఱచియెఱుకకుగ। మఱియూది మేల్కపుట్టువు। లిరువఱగులయె
ఱిగియెఱుకనెగరజమ్మోయీ॥ ఆపై నుండేదెఱిగెదెట్లోయీ॥ గు
రుమంత్రమిదెనమ్మిమఱువకయేప్రొద్దు। స్మరణజేసితివేనితిరిగిపు
ట్టవునీపన్లైగరజమ్మోయీ॥ ఆపై నుండేదెఱిగేదెట్లోయీ॥ ౧౨౮॥

తా॥ శిష్యా! మఱుపును,నిద్రయును,మరణమును, పరిపూర్ణము నకుపాటిగాను, మఱియును,జ్ఞానమును, మెలకువయును, పుట్టుకయును యొఱుకకుపాటిగాను భావించి,యీరెండువిధముల నెఱింగి, యెఱుకనుయెగరగొట్టుము,యిదేగుహ్యమంత్రము, దీనినిమఱువక సదాకాలముజపియించితివేని మఱలనీకు పుట్టుకలేదనిభావము.

ప॥ క్షితిలోననరుడుపక్వా। న్నతతిని వెలికక్కి మఱలనాకునె యతిసం।స్తృతివిడిచితిఱిగిపూనునే। వితరణశాలిచ్చినట్టివి త్తమడిగీనా*సత్యశాలిసత్యముడిగీనా*ప్రతిలేనిగురుబోధస్థితిజెందియెఱుకనీ। గతిసంగ్రహించదుకృతకృత్యుడిచ్చినవి త్తమడిగీనా* సత్యశాలిసత్యముడిగీనా॥ ౧౭౯॥

తా॥ శిష్యా! నరులుమిగులరుచిగలక్షీరాన్నమును బుచ్చుకొని, మఱలయది వెలికక్కినయెడల,యానరులుమఱల దానినిగ్రహింతురా గ్రహించరు,బుద్ధిమంతులు తాముదానమిచ్చినధనమును మఱలగ్రహించరు, సత్యవంతులుతమసత్యమునువిడువరు, అటునతెనేపరిపూర్ణమును గ్రహించినమానవులు, యెఱుకనుమఱలగ్రహించరనిభావము.

ప॥ మఱుపనతొలిమేనులుమూ।డెఱుకననాలవశరీరమీరెంటాకటే। పరిపూర్ణమవలిదీయని। యెఱుకనుగురువాక్యముచేత నెగరజిమ్మినను*పోవునులేనియెఱుకయెఱిగినను*యెఱిగేదేలేకుండుయేమోనావలిజాడ। నెఱిగేవారెవరింకయింతేచాలెఱుకనునెగరజిమ్మినను*పోవునులేనియెఱుకయెఱిగినను॥ ౧౮౦॥

తా॥ శిష్యా! మఱుపనగా=తొలిశరీరములుమూడును, అవియెవ్వియనిన=యిరువదియైదుతత్వములుగలిగినస్థూలశరీరమును వహించినవిశ్వుండును, పదియారుతత్వములుగలిగినసూక్ష్మశరీరమునువహించినతైజసుండును, రెండుతత్వములుగలిగినకారణశరీరమునువహించినప్రాజ్ఞుండును. యెఱుకనగా=నాలవశరీరమైనమహాకారణమనెడు హిరణ్యగర్భుండును, యీయెఱుకమఱుపులు రెండునుయొకటే, పరిపూర్ణమువీటినన్నిటినిదాటినదనియెఱిగి, యెఱుకనుగురువాక్యముచేత నెగరగొట్టినవెనుక, ఆవలయెఱిగేవారులేరు, లేనియెఱుకయెఱిగిపారిపోవునసిభావము

ప॥ నానావిధావయవములు । నానావిధనామరూపనటనలు మాయల్ ।నానావిధములయూహాలు। నేననుమెుటుకందుయిన్ని నిబిడమైయుండూ*బయలునుగని తానిలువలేకుండూ* నేనుమేనులురెండులేనేలేకుండిన। మేనులేదదిలేక నేనిలిచేటెట్లన్న నిబిడమైయుండూ * బయలునుగని తానిలువలేకుండూ॥ ౧౮౧॥

తా॥శిష్యా! నానావిధములైన అవయవములుఅనగా = యింద్రియములును,నానావిధనామములుఅనగాపేర్లను,నానావిధరూపములనగా=చిత్రవిచిత్రములైనరూపములును, నానావిధనటనలనగా = చేయునట్టికృత్యములును, నానావిధములైనమాయలును, నానావిధములయినయుక్తులును,తలంపులును, నేనునేననెడుమెుటుకయందునిండియుండును, పరిపూర్ణమునుదర్శించినయెడల తానునిలువకపారిపోవును, నేనుమేనులురెండుఅనగా=ఆత్మశరీరములురెండును, లేనేలేకుండినయెడలదేహములేదు,దేహములేకయాత్మయుండుటెట్లనిభావము.

ప॥ జగమువలనసంకల్పము।జగమాసంకల్పమునజనియించును వే।రగుపడదుజన్మమందిర।మగుపడదెడబాసినిల్వారెండెన్నటికీ*బయలునుగనిననివిరెండెన్నటికీ*యికదల్పబోకుముయివిబుట్టుటుళ్లక్కి।మృగజాలమగుపడమిథ్యంచెఱిగినమాట్కి యీరెండెన్నటికీ*బయలునుగనిననివిరెండెన్నటికీ॥ ౧౮౨॥

తా॥ శిష్యా!జగత్తువలనసంకల్పమును, సంకల్పమువలనజగత్తును గలుగుచుండునుగాని యీరెంటికి జన్మమందిరమువేరేయున్నటులగనుపించలేదు,యివిరెండునుయెుకదానినొకటియెడబాసియుండవు,యివిరెండునుపరిపూర్ణమునుదర్శించినయెడల, యెన్నియుగములకైనను, బ్రహ్మకల్పములకైనను, మఱలబుట్టుటయుళ్లక్కి,యెండమావులయందునీళ్లుండుటమిథ్యయని యెఱిగినవిధమున, యివిరెండునుమిథ్యాస్వరూపములు, వాటినియికమీదుతలంచవలదనిభావము

ప॥ పరిపూర్ణమనెడుపలుకే। మెుటుకనుయల్పాతురములమెచ్చటగనిన్ని।తిరమైయున్నదిగనుగొన । మెుటుకనుయల్పాతురములనికగట్టిపెట్టూ*యెవరికితెలియదిదిమూలగుట్టూ * గురు

మూర్తికరుణచేనటిగి తెలిసితివేని । పరిపూర్ణబోధనుపరులుదెలి
పినబోధనికగట్టిపెట్టూ * మెవరికితెలియదిదిమూలగుట్టూ॥౧౪౩॥

తా॥ శిష్యా!పరిపూర్ణమనినయదియొక వాక్యముగానేచెప్పంబడు

చున్నదిగాని, అదివాక్యములకుఅతీతము, శబ్దములేనిది, యిదియేమహా
మంత్రము, యీమూలరహస్యమెవ్వరికిని దెలియదు, రొంటుకయు
ను, అల్పాక్షరములనెడునన్యభావములున్న, స్థిరముగానేలోకులకుగనుపిం
చుచుండును, నీవువాటినివిడిచిపెట్టుము, సద్గురుమూర్తికరణచేతను ప
రిపూర్ణబోధనుదెలుసుకొని, పరులు జెప్పిన నానావిధబోధలనువిడిచిపె
ట్టుము, యిదియేపరమరహస్యమనిభావము.

ప॥ చూపించిచూపరానిది। చూపించితిదానినండజూచితివి
గదా । చూపించగజూచెనిదిదీ। న్నెప్రొద్దికదలచబోకుమిదెగురు
బోధా * నిన్నంటమయితర్కపబోధా* నాపాపనాకూననాచిన్ని
నాయన్న।నా పెన్నిధానమనారత్నములకొండయిదెగురుబోధా*
నిన్నంటదయితరప్రబోధా॥                ౧౪౪॥

తా॥ శిష్యా! చూపించిచూపరానిదియైనపరిపూర్ణమునుజూపిం
చితిని, నీవ్రుదానినిజూచితివిగదా, చూపించినపిమ్మటజూచినరొంటుకేయి
ది, దీనినికదలచవలదు, యదియేగురుబోధ,యితరబోధలనగా,సాధకవి
ద్యలయందువర్తించువారి బోధలునిన్నంటవు,నీవేనాబిడ్డవు,నీవేనానిక్షే
పము, నీవేనారత్నములకొండయనిప్రేమతోగురుడుపలికెననిభావము.

ప॥ నామమురూపమునటన। స్తోమముబయలందులేదుచూ
డుమీనీవా.నామమురూపమునటన। స్తోమమురొంటుకిందుగలవు
చూడుమీనిజమూ*బయలెఱుకలజూచిచూడకుమూ *వేమా
రునేనెంతవినజెప్పినాగాని । యీమార్గమెతప్పయిక లేదురెండవ
దిచూడుమీనిజమూ*బయలెఱుకలజూచిచూడకుమూ॥ ౧౪౫॥

తా॥ శిష్యా! నామమున్ను, రూపమున్ను, క్రియమొదలగువృ
త్తులున్న,పరిపూర్ణమునందులేవు,నీవునిజముగాజూచి తెలియుము, నామ
మున్ను, రూపమున్ను,క్రియమొదలగుసర్వవృత్తుల్నునురొంటుకయందు
గలవు, నిజముగాజూడుము, బయలెఱుకలనుజూచిచూడకుమనగా=గు

ఱుతుపెట్టవలదనుట, పలుమారునీకు నేనెంత జెప్పినను, యీమార్గమేతప్ప వేరొండుమార్గము లేదని భావము॥

ప॥ గురుడుగురుబోధ శిష్యుని। కెఱిగించెడు వేళ శిష్యుడెఱిగెడు వేళ॥ యిరువురునై శ్వానరక। ర్పురములవలె వెలిగియ వలపొడచూపరోయీ* అట్లనెనీవిక్కడ దెలియుమోయీ* పరిపూర్ణమెఱుకలయెఱిగియా మీఁదట। యెఱుకనువిడుచు టేగురుబోధం చెఱుగుము పొడచూపరోయీ* అట్లనెనీవిక్కడ దెలియుమోయీ॥౧౮౬॥

తా॥ శిష్యా! సద్గురుమతిన గురునిబోధను శిష్యునకు యెఱిగించెడు వేళయందును, ఆశిష్యుడు యెఱిగెడు కాలమందును, యీయిరువురు అగ్నికర్పూరములవలె వెలిగి మఱలగనుపించరు. అటువలెనే పరిపూర్ణమును యెఱిగిన వారు, మఱల యెఱుక భావమును బొందరుగాబట్టి పరిపూర్ణమెఱుకలను యెఱిగియా యెఱిగిన యెఱుకనువిడిచి పెట్టు టేగురుబోధ యని భావము.

ప। సతికౌగిట తత్పతి త। త్పతి కౌగిట సతియు జేరి పవళించి కడ॥। మృతి జెంది మేలుకనిను। స్థితులయి యొకరొకరు బడిన చేష్ట దెల్పుదురా * సిగ్గడలియా చేష్ట దెల్పుదురా * ప్రతిలేని గురుబోధస్థితి జెందట్లనెనం। తతితిరిగి లేనెఱుకగతి యిట్టిదన రాని చేష్ట దెల్పుదురా * సిగ్గడలియా చేష్ట దెలుపుదురా ॥ ౧౮౭॥

తా॥ శిష్యా! పురుషుని కౌగిట భార్యయును, భార్య కౌగిట పురుషుడును జేరి, రతియుపరతుల చేత నలసి నిద్రించి లేచిన పిమ్మట, యీ యిరువురు తాము యొకరొకరు బడిన పాట్లు సిగ్గువిడిచి చెప్పుకొందురా! చెప్పుకొనరు, అటువలెనే, సమానరహితమైన నీగురుబోధను బొందిన తరువాత యెఱుకగతియును యిట్టిదేనని భావము.

ప॥ రానిది పోనిది బయలని । లేనిది యెఱుకనుచు నీకు తెల్పగ దృఢమా। దాకను నీవీ మంత్రము । మానక జపియించుచుండుమా బుద్ధిశాలీ* లేనిదె లేదు మరువకీ జోలీ* లేనిదే లేదని పూనినిశ్చయమైతె। తానెక్కటుండును గాని యట్లను వినుమా బుద్ధిశాలీ* లేనిదె లేదు మరువకీజోలీ ॥ ౧౮౮॥

తా॥ ఓయి బుద్ధిమంతా, అచల పరిపూర్ణమునకు రాకపోకలు లేవు, మాయయెఱుక లేనే లేదని నీకు దృఢపడునంతవరకు నీవు యీ

మంత్రమును విడువక జపించుచుండుము, లేనిదియైన యొజ్జుక లేనే లేదు దీనిని మఱువవలదు, పరిపూర్ణముమాత్రమే సదానిండియుండును, దాని నిటుల వినుమని భావము.

ప॥ ఉన్నది పరిపూర్ణము లే। దెన్నటికిని యొఱుక యనుచునిది దృఢమూ దా। కెన్నము నేబోధించిన। తిన్ననియీబోధ శిష్య తిలకమ ఱువకుమీ ✱ సుజనుల ముందాలపలుక వెఱువకుమీ ✱ నిన్నుకుమతులు వచ్చినీలోతడిగితే వారి। కెన్నివిధములనీ వెఱిగింపకిది శిష్య తిలకమఱువకుమీ ✱ సుజనుల ముందాలపలుక వెఱువకుమీ॥ ౧౮౯॥

తా॥ శిష్యా! ఉన్నదే పరిపూర్ణము యెన్నటికిని లేనిదే. యొఱుక యని నీకు దృఢముగ లుగునంతవరకు, నేను బోధించిన పరిపూర్ణబోధను మఱువకుండితి వేని, నీవు నా శిష్యవర్గమునకు తిలకమువలె ప్రకాశించువు పెద్దల యెదుట భాషించుటకు వెనుకదీయకుము, కుచ్ఛిత పురుషులు వచ్చి నీగురు రహస్యము నడిగిన యెడల, వారికి నీవు యెఱిగింపవలదని భావము.

ప॥ పరిపూర్ణము యొఱుకను నే। నెఱిగించితి నీవు రెంటి నెఱిగితి విగదా। యొఱుకను గురుదక్షిణగా। మరి నేనిరమిమ్ము వట్టిమాట లేమిటికి ✱ యొఱుకతో నింక కూటమేమిటికి ✱ పరులు నేననియే యీభావ మభావమై। నిరతమునొకరీతి నిలచియుండుము వట్టి మాట లేమిటికి ✱ యొఱుకతో నింక కూటమేమిటికి। ౧౯౦॥

తా॥ శిష్యా! పరిపూర్ణమును యొఱుకను నీకు యెఱిగించితిని, నీవు యెఱిగితివిగదా, యెఱిగిన యీ యొఱుకను గురుదక్షిణగా త్వరితముగా నిమ్ము, యొఱుకతో నిక మీద సహవాసము చేయకుము, పరులని నేనని యెంచెడు భావమును గలిగియుండకుము, సదాకాలము నీవు యొక్కటే విధముగా నుండుము, ఇతర మాటలతో బని లేదని భావము.

ప॥ పరిపూర్ణమొఱుకలివియని। గురువను డెఱిగించి యొఱుక కూటమిమాన్పె। గురువు గురువే సరియా। మఱి శిష్యునకిం కేనోటమాట వెళ్లినా ✱ పోయిన యొఱుక మళ్లిమళ్లినా ✱ గురుశిష్యులని యేటిగుఱుతున్న దెఱుగక। నిరతము నొకరీతి నిలుచున్న బయలందు మాట వెళ్లినా ✱ పోయిన యొఱుక మళ్లిమళ్లినా॥ ౧౯౧॥

తా॥ శిష్యా! సద్గురుడు యిదిపరిపూర్ణమనియును, యిదిమొలు కయనియును మెఱిగించి, మొలుకయొక్క సంబంధమునువిడిపింపజేయుటకు,గురుడేసరిగాని, యింకయెవరివల్లనుకానేరదు,ఆశిష్యునినోటమరల మాటరాదు, విడిచిపోయినమొలుకమఱలరానేరదు,దివారాత్రులయందునొకటేవిధముగానుండిన పరిపూర్ణమునందు, శబ్దాదితన్మాత్రలేమియును లేనందునసీకు, మఱలభ్రాంతిపుట్టిదని భావము.

ప॥ స్థిరమగుపరిపూర్ణమున । స్థిరమగుయీమొలుక మొలుక తెలియుజగములం । దెఱిగినతెలుకేగదస।ద్గురుకృపచేమొలుక బోతెగురుశిష్యులేరీ*నోరెత్తక మఱివినరోరీ*గురునిపాదములానగుఱుతులేనటువంటి। పరిపూర్ణమొకటుండుపలుకరాదట్లుండు గురుశిష్యులేరీ*నోరెత్తకమఱివినరోరీ ॥ ౯౬-౨॥

తా॥ శిష్యా! పరిపూర్ణము స్థిరముగానుండును, యీమొలుక అస్థిరము, యీజగత్తును సర్వసాక్షిగా మొలుకేమొలుగుచున్నది, ఇటుల మెఱిగినమొలుక సద్గురుకటాక్షముచేత నామొలుకవిడిచిపోయినపిమ్మట గురుశిష్యులులేరు, నీవునోరుదెరువక వినుము నీకుసద్గురుపాదములాన,గుఱుతులేనటువంటి పరిపూర్ణమొకటియున్నది, అది అవాఙ్మానసగోచరము, గురుశిష్యరహితమైనపరిపూర్ణమునుశంకలేకతెలియుమని భావము.

ప॥ గురుడచలముమొలుకలతన। కెఱిగించినశిష్యుడెఱిగి మొలుకై యుండగ । మొలుకనునిలుపకుమనినను । మొలుకను విడనాడిశిష్యుండెట్లుండునంటే *అట్లనెనేనిమొట్లుండునంటే*పురుషుడులేనట్టిపొలతిసౌంధర్యము । మఱిమఱిగలిగుండి మఱిలేకట్లనెయుంటెనెట్లుండునంటే * అట్లనెనేనిమొట్లుండునంటే॥ ౯౬-౩॥

తా॥ శిష్యా! గురుడు అచలపరిపూర్ణమును, మొలుకనుమెఱిగించియును, ఆశిష్యుడుమొలుకై యుండుటనుజూచిమొలుకనునిలుపకుమని యాజ్ఞాపించిరి, మొలుకనువిడిచిన శిష్యుడు మొట్లుండుననగా, పురుషుడు లేనిస్త్రీ మిగులసుందరమును గలిగియుండియును మొటుల హీనముగానుండునో, అటువలెనే మొలుక నువిడిచినమహాత్ముడుకార్యాకార్యములయం దానక్తుడుగాక హీనుడై యుండునని భావము.

ప॥ ఎటుకనువిడనాడినయా । పురుషునిస్థితియెట్టిదనిన పొం
దుగవినుమిా । సరిపడుసరిపడదనకను । సరిగావర్తించుచుండు
సమరసబుద్ధిరా *కార్యములందు సహజప్రబుద్ధిరా *పరిపరివిధము
లపుపువ్వులుపెట్టకు । మఱివైరాగ్యముచేత మానుకొనియుండ
మసమరసబుద్ధిరా *కార్యములందుసహజప్రబుద్ధిరా॥ ౧౯౪॥

తా॥ శిష్యా! యెఱుకనువిడిచినపురుషునిస్థితియెట్లుండు ననగావినుము, తనకిదిసరిపడును, అదిసరిపడదనిచెప్పడు, సమముగానేనటించును, అన్నికార్యములయందునుసహజమైనబుద్ధితోవర్తించును, అత్యాశచేత పలువిధముల వర్తించడు, కూడదన్నవైరాగ్యముతో నట్టి కార్యములనువిడిచియుండడు, అనగా = బద్ధముష్టిభావమును, ప్రకటముష్టిభావమునుబొందడు. బద్ధముష్టియనగా = పిడికిలిఘట్టిగాబట్టుకొనుట, ప్రకటముష్టియనగా = పిడికిలినివిడుచుట, యీరెంటినుగలిగియుండడనిభావము.

ప॥ కలమేలుకొన్నపురుషుడు । కలలోపలిబొమ్మలెటుగగ
లిగుండకనే । తలపోయదేసగురుకృప । తెలివొందినవారికింకతి
ప్పలున్నావా * తెలుపరకొద్దిగొప్పలున్నావా * తల్లిదండ్రిదా
రతాతకులదైవమాప్తులు । కలబాంధవులుదేశికులనినమ్మితె
యింకతిప్పలున్నావా * తెలుపరకొద్దిగొప్పలున్నావా॥ ౧౯౫॥

తా॥ శిష్యా! కలగని మేల్కొనినమానవులు, ఆకలయందలి విషయములను గలిగియుండరు, వాటినిబొందుటకును నేరరు, సద్గురుమూర్తి కరుణచేత తెలివిపొందిన వారికి యికమీాదు యేసంకటములును లేవు, కొద్దిగొప్పలును లేవు, ఉండినయెడల జెప్పుము, తల్లియును, దండ్రియును, దారయును, తాతయును, కులదైవమును, మిత్రులును, బంధువర్గములును, సర్వమును సద్గురుమూర్తియేయని నమ్మినవారికియేసంకటములులేవనియును, హెచ్చుతక్కువలులేవనియును భావము.

ప॥ ఈరీతిస్థితిగలిగిన। నేరుపుశాలితరజనులనిందాస్తుతులరా।
తారేగిజేయుదెన్నడు । వారలుమఱిచేసిరేనివలదనియనదూ *
చెవియొగ్గికావలెననివినదూ * వారుమిావారుమావారువీరను
కొంచు । సారెకువీరితోపోరాడెవారినివలదనియనదూ * చెవి
యొగ్గికావలెననివినదూ॥ ౧౯౬॥

తా॥ శిష్యా! సర్వముగురుడేయనినమ్మిన, బుద్ధిమంతుడును విత రణశాలియునునైనశిష్యుడు, యితరులనునిందించడు స్తుతించడు, తాను యెన్నడైననుగోపముగలిగియటులజేయడు, ఇతరులుతన్నునిందించితిట్టినను, మీరునిందించితిట్టవలదనియనడు, తానుఅట్టిమాటలనుచెవియొగ్గివినడు, వారుమీవారు, నీసుమావారని, పదేపదేపోరాడుచుండెడువారిని వలదనియనడు. ఆమాటలువినడనిభావము.

ప॥ ధ్వనిమొదలగుతన్మాత్రలు। గనుగొనగాలేశమైనగాన్పిం చనిచో। టునుబట్టబయలుగాగని। ధ్వనిమొదలగుతన్మాత్రలున్న దానినెఱుగకనూ * గనియీరెంట్లోదేనినెఱుగకనూ * ఉనికిగ లిగినయట్టిఘనునికీర్తిసేయ। జనులకుశక్యమంచనరాదుదాని నెఱుగకనూ * గనియీరెంట్లోదేనినెఱుగకనూ॥ ౧౯౭॥

తా॥ శిష్యా. దేనియందున. శబ్దము. స్పర్శము. రూపము. రసము గంధములనెడుపంచతన్మాత్రలులేవో, దానినేపరిపూర్ణమనితెలియుము, దేనియందున, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధములనెడుపంచతన్మాత్రలున్నవో, దానినేయొఱుకనితెలియుము, యీరెంటిమర్మములనె ఱిగినమహాత్ముని కీర్తించుటకు జనులకు శక్యమగుననిజెప్పరాదు, అట్టి యొఱుకనెఱిగి, యీయొఱుకను విడుచుటే సరియనిభావము॥

ప॥ నామదితెప్పగవినుమీ। సామాన్యంబనుచుజూడజనదీబో ధన। ప్రేమాతిశయమునంగని। వేమారిదిగురునినోటవినవలె నుమీ * నిత్యముచదువుకొనవలెనుమీ * నామరూపక్రియనట నలుగలిగిన। వేనస్తువోదానినెటునిల్వనిప్వకువినవలెనుమీ * నిత్యముచదువుకొనవలెనుమీ॥ ౧౯౮

తా॥ శిష్యా! నీవునామనోభీష్టమునుజక్కగాదెలియుము, యీబో ధసామాన్యమైనదికాదు గనుకయత్యంతప్రేమతో, సదాసద్గురునినోట వినుటశ్రేష్టము, లేదాప్రతిదినము అచలబోధనుదెలిపెడుగ్రంథములనే జదువవలయును, రూపమును, పేరును, క్రియయును, వృత్తియునుగలిగిన యొఱుకనుయేప్రక్కనునిలువనియ్యకపారదోలుమనిభావము॥

ప॥ నేమొదటనిన్నుగనుగొని। యేముక్కలునీదుచెవిలోయి మిడిసినోసి। వాముక్కలుమూడింటెని। యేమాత్రముమరువ

కుండయీబోధనిస్తి * అందుకెయింతగాబోధజేస్తి * ప్రేమ
తోడదువుమిదేమార కెప్పుడు। కామితార్థములిచ్చుసీమముతో
డుతనీబోధనిస్తి * అందుకెయింతగాబోధజేస్తి॥ ౧౯౯॥

తా॥ శిష్యా నేనునిన్నుజూచితొలుత యేపలుకులునీచెవిలోనాటు
నటులజెప్పితినో, నీవావాక్యములనుమూటంటెని సదానీవుమనువకుండు
టకొఱకై యింతసేపునీకుబోధించితిని,నీకోరికలన్నియునుసిద్ధించును, నీ
మనంబునజాగ్రతగానుంచుకొనుమనిభావము॥

ప॥ అన్నముదిన్ననునాకలి। తిన్నగనీరంబుద్రావతృష్ణయు
రోగం। బెన్నగినౌషధసేవను। జన్నక్రియగ్రా యొఱుకినిల్వజాలదో
యన్నా * యీబోధనిచెవులతోవిన్నా * కన్నులతోజూచికడ
ముట్టజదివితే । నిన్నంటినీయెదుటనిలుచుండకనుగానజాలదో
యన్నా * యీబోధనీచెవులతోవిన్నా॥ ౨౦౦॥

తా॥శిష్యా!అన్నముతిన్న యాకలియును. నీళ్లుద్రాగిన దాహము
ను, ఔషధమును భుజయించుటచేత రోగమును యెటుల దీరి పోవుచు
న్నవో, అటువలెనే, యీపరిపూర్ణబోధను, నీవుచెవులతో వినినవెంట
నే, యెఱుకయెందును నిలువక పారిపోవును, నీకన్నులతో నీవుపరిపూర్ణ
మునుదర్శించి, నీవుకడవరకును యీపద్యములనుజపుపుటవలన, యెఱు
కయెందును నిలువబాలక పారిపోవునని భావము.

ప॥ జననమరణప్రవాహము। లనిచునుయీబోధపట్టుడసిసా
ధువులి । చ్చినవొల్లకుండువారలు । జనునపుడాబోధమీాదజని
యించుప్రేమా * వెదకెదరిట్టిజనచేష్టలేమా * అనిశోచినీకునే
వినజెప్పవలసెనీ । వునుయీబోధనువల్లనసకుదొరకదుమ్మగ్గిజని
యించుప్రేమా* వెదకెదరిట్టిజనచేష్టలేమా॥ ౨౦౧॥

తా॥ శిష్యా! అచలగురుడువచ్చిమిమ్ముజననమరణప్రవాహముల
నుండితొలగించెడు యీపరిపూర్ణబోధనుబట్టుడనిబోధించుటకుయత్నిం
చినను, మూర్ఖజనులుయొల్లకుందురు,ఆగురుడుపోయినవెనుక యామూర్ఖ
జనులు యీబోధయందు ప్రేమగలవారలై.ఆమహాత్ముడెక్కడ,యెక్క
డనియీాయచలగురువును వెదకుచునల్లాడుచుందురు, జనులచేష్టలుయి

లాగునయున్న దనినాకుతోఁచినీకువినుపించితిని, నీవుమొల్లదనకుము, యిట్టియచలబోధసామాన్యముగా దొరకదనిభావము.

ప॥ ముఱుపుకుతన్మాత్రలుగల । మెఱుకకుతన్మాత్రలున్న వీరెండొకటే । పరిపూర్ణమునకు లేవవి। పరిపూర్ణముమెఱుక గాదుపరికించవోయి * వెదికినదీనిసాటిలేదోయీ * పరిపూర్ణమెఱుకలపరిశోధించి గ్రంథ । మురచియిస్తిమనువకచదువెఱుకి మఱుపుగాదోయీ* వెదికినదీనిసాటిలేదోయీ॥ ౨౦౨॥

తా॥ శిష్యామఱుపుకుశబ్దస్పర్శరూపరసగంధములుగలవు, మెఱుకకున్న శబ్దస్పర్శరూపరసగంధములున్నవి, యీరెండునునొక్కటే, పరిపూర్ణమునకు శబ్దస్పర్శరూపరసగంధములులేవు, పరిపూర్ణము మెఱుకకాదు, నీవుచక్కగావిచారించుము, పరిపూర్ణమునకుసాటిలేదు, మెఱుకిపరిపూర్ణములనెంటినిజక్కగాశోధించియీగ్రంథమును జేసితిని, నీవుమరువకచదువుము, నీవెందువెదకినను పరిపూర్ణమునకు సాటిలేదనిభా.

ప॥ అందముగానస్గ్రంథము । చందమువినుపింతుదానిజదివినవినిన । ముందుగబయలెఱుకైయే। సందునలేనెఱుకలేకజననవలెనుమ్మీ* మదియిదేవినిచదువుమినమ్మీ*యెందుకునీకింకయితరశాస్త్రములజో। లందుగుర్తెఱిగిపోదదిగానదీమెఱుకజననవలెనుమ్మీ*మదియిదేవినిచదువుమినమ్మీ॥ ౨౦౩॥

తా॥ శిష్యా యీయచలగ్రంథముయొక్క విధమునుజక్కగావినుపింతును,మీఁకుజదువుము,వినుము, ముందుగాపరిపూర్ణమేయున్నది, అన్నియుతానై యుండినలేనిమెఱుక యేసందునను నిలువక పారిపోవును, నీమనస్సున యీగ్రంథము నేవిని నమ్మిచదువుము, యితరశాస్త్రములను నమ్మినమెడలయీమెఱుకిపోనేరదు, గాబట్టి లేనిమెఱుకయెందును నిల్వకపోవునట్టి దేయచలమార్గమనిభావము.

ప॥ చక్కెరమెక్కనిరోగులు । చక్కెరమాధుర్యమెఱుగజాలరెటువలెర। మక్కువతోవినివిడువక । చక్కగగ్రంథార్థమెఱుగిజాలరాజనులూ*కావుననీవుచాలించిపనులూ * చొక్కమీగ్రంథముచూడుముకోనవెర్ల । యిక్కడితోజన్మమెత్తవుసరితెలియజాలరాజనులూ* కావుననీవుచాలించిపనులూ॥ ౨౦౪॥

తా॥ శిష్యా శర్కరనుదినినిరోగులు,శర్కరయొక్క తీపునుమెఱుగజాలరు, అటువలెనే,మక్కువతోవినివిడిచిపెట్టవలదు,పామరులుయీగ్రంధరుచియెఱుగజాలరుగాబట్టి,నీవుఅన్ని పనులునుజాలించిచొక్కమైనయీగ్రంథమునుకడవరకుదెలియుము,యింతటితో జన్మసరినీవుమఱల జన్మమెత్తవు,తెలియనివారు జచ్చుచుంబుట్టుచుందురనిభావము.

ప॥ గూడార్థమెఱిగినతడా । రూఢుండై నయతడుగ్రంధరుచి
గానరుభువిన్ ! గాఢతరజ్ఞానంబున । మూఢుండై యున్నవాడు
మొదట నేవినదూ*సుజనులపాడముద మొప్పగనదూ * వాడువీ
డనరానివాడేగ్రంథముపిని। వాడునిశ్చయమిట్టివా గ్రెలెఱుగని
వాడుమొదటనేవినదూ*సుజనులపాదముదిమొప్పగనదూ॥–౨౦౫॥

తా ॥ శిష్యా! గూడార్థమెఱిగినవాడనగా (సాంఖ్యతారకముల యందువర్తించుఅభ్యాసియును) అరూఢభావమునుబొందిన వాడనగా యోగజ్ఞానములయందువర్తించుఅరూఢియును) యీగ్రంధముయొక్క రుచినియెఱుగను, అజ్ఞానమైనచీకటినిండబడియుండెడు మూఢుడు మొదటనేవినడు, పెద్దలనుజూచియోర్వజాలడు. వాడువీడనియనక,భేదములేనియచలుడే, యీగ్రంధమునువినును. యిదియేవానినిశ్చయము, మూర్ఖులువినరు, పెద్దలనుసేవించరని భావము॥

ప॥ తాబేటితలపుచేతను । తాబేలైయిలఙ్ధాత్రిదనరుట
జెలియక । తాబేటిగర్భమందున । తాబేలైపుట్టకున్నతరమె
యితరులకూ * సద్గురుబోధట్లరయనితరులకు * యేబోధలెఱు
గనియీబోధగలవారి । చేబోధపడయక చేకొనదలచి తేతరమే
యితరులకూ * సద్గురుబోధట్లరయనితరులకూ॥ –౨౦౬॥

తా॥ శిష్యా! తాబేలుతలంపు,అనగా= లోకులనుజూచితనయవయవములను లోపలకునీడ్చుకొనుచు, మఱలబైటికి దోపింపజేయును,) ఇటులకుచ్చితతలంపుగల మనుజుడువ్యర్థుడైలోకమున, అకలియును,అనురాగమునుబొందుచుండును,తాబేలుగర్భమందునతానుసంకల్పవశంబున తాబేలై పుట్టునుగాని వేరొకవిధమునంబుట్టడు, మనుష్యులకు మనుష్యులు, మృగములకు మృగములే పుట్టునుగాని యితర మేమియునుబుట్టుటలేదు, యిటువలెనేసద్గురుబోధయని . తెలియుటకు నితరు

లకుసాధ్యపడను, యేబోధయునెట్టుగని యీపరిపూర్ణబోధగలవారిచే నీపరిపూర్ణబోధను బొందవచ్చునేగాని, భక్తి యోగజ్ఞానులవలన నీపరిపూర్ణబోధను, బొందుటదుస్తరము,అనగా,బొందనేరరనిభావము॥

ప॥ ఈతాపేక్షనుమనుజులు। నూతిదరిం జేరినిలిచినోటనేని
నర్ । యీతేలవచ్చువారికి । చేతులతోనీళ్లమీాదచేరియీాదక
నూ * మునునేర్చినవారిదించకనూ * యీతీరుగనేదేశికేంద్రు
డురెల్పక । చాతుర్యమునబోధసాధించనయ్యానచేరియీాదక
నూ * మునునేర్చినవారిదించకనూ॥ ౧౦౭॥

తా॥ శిష్యా! ఈతగొట్టలకు నేర్చుకొన ఋష్టముగల మనుజులుగుంటయొద్దకుంబోయి యీతరావలయుననియెంత సేపుగొణుగుచుండినను వారికయీతియెట్లువచ్చును, యీతనేర్చినవారినిగుంటలోదించి వారివలెనే తానును జేతులతోనీదకుండినయీతరానేరదు, అటువలెనే అచలభావజ్ఞులైన పెద్దలనుసేవించి: యచలభావమును బొందవచ్చునేగాని, (ఇతరగురువులనగా=సచ్చిదానందభావముగలవారివల్లను) తనయుక్తిచాతుర్యములవల్లను, అచలబోధను బొందనేరరనిభావము॥

ప॥ ప్రవిమలచిత్తుడుశిష్యుడు । సవినయమున దేశికునకుశరణాగతుడై త్రివిధప్రసాదములుగొని । భవనాశస్థితులులేనిపద్ధతి
వినినర్ * తిరిగిరానిపద్ధతిగనినర్ * భువిలోవానిసాటిబోల్పనె
వ్వరులేరు । అవిరళభక్తియువానినినొందునీపద్ధతివినినర్ * తిరి
గిరానిపద్ధతిగనినర్॥ ౧౦౮

తా॥ శిష్యా! నిర్మలచిత్తుడైన శిష్యుడుదేశికస్వాములవారికిశరణాగతుడైయామహాత్మునివలన త్రివిధప్రసాదములను గ్రహించి,త్రివిధప్రసాదములనగా= ఫలమధుచిత్రాన్నములనుప్రీతితోబుచ్చుకొనిపుట్టకయును, జావును, ఉనికియును లేనివిధమునువిని, మఱలజన్మమునకు రానిపద్ధతితెలుసుకొనిన, యాపుణ్యాత్మునకు సాటియీాలోకమునసెవ్వరును లేరు,అట్టిపుణ్యాత్మునకువిశేషమైనభక్తియును,సంభవించుననిభావము

ప॥ఉపనయనముగానిదెతా।నుపనయనముమీాదిచదువునూ
హానెఱిగినర్।విపరీతమగునుదానును। చపలుడుబ్రాహ్మణుడుగా
కుచర్చించిచూడా*శూద్రుడువానిచర్చించిచూడా* ఉపముచే

బోధట్టులూహించనియట్టి । కపటచిత్తుడు సాధుగణముతో సమ
త్వా చేచర్చించిచూడా * శూద్రుడు వానిచర్చించిచూడా॥ ౨౦౯॥

తా॥ శిష్యా! సద్గురునివలన యుపదేశమునుబొందకనే, తానా యుపదేశమునకు మీదిభావమునుయోగించినను, అదిమిగులవిపరీతమగునేగాని, తెలిసినవాడుకానేరడు, అట్టివానినిచపలుడని చెప్పంబడుచున్నాడు, విచారించిచూడగా నతడు బ్రాహ్మణుడుగాడు, శూద్రుడని చెప్పంబడుచున్నాడు, అట్టికపటాత్ములుసాధుగణముతో సరిగారనిభావము.

ప॥ మంత్రముచేసం తెట్లగు। తంత్రములేకున్న కాదుతంత్రము
చేతన్ । మంత్రములేకనువసిగిల । మంత్రముతంత్రమ్ము రెండుమ
రిగూడుకొని * కార్యములన్ని జరిగించువ్రాని * మంత్రతంత్రము
లలోను ర్మముగురుడెఱుగు। మంత్రతంత్రములలో మర్మముగుగు
నిచేమరిగూడుకొని * కార్యములన్ని జరిగించువ్రాని॥ ౨౧౦॥

తా॥ శిష్యా! మంత్రముచేత నేసంత కానేరదు, మంత్రమును, తంత్రమునుయివిరెండునుగూడిసంతయగుచున్నది, ఈమంత్రతంత్రములురెండే సర్వకార్యములను జరిగించుచున్నవి, ఈమంత్రతంత్రములయొక్క మర్మము సద్గురునకుందప్పయితరులకుం దెలియనేరదు, గురునివలన వీటినిం దెలిసికొనుమనిభావము.

ప॥ సంకల్పాదికగుణములు। సంకులమీయొంకయందు సమ
కూడుండున్ । సంకల్పాదికగుణముల । సంకులమనియెదనుజూ
డజాడలేదన్నా * యీరెండును వేరుగావన్నా * కొంకక యీ
రెంటిగూర్చిగ్రంథముచేస్తి। సంకోశింపక చదువుశంక పుట్టదింక
జాడలేదన్నా * యీరెండును వేరుగావన్నా॥ ౨౧౧॥

తా॥ శిష్యా! కులముతోగూడుకొనిన యీయొంకయందు సంకల్పమును, సత్త్వాదిగుణములునుగలిగియుండును, యీసంకల్పగుణము లేకులమలనినీవుహృదయమునం దెలియుము, యీరెంటికేయీడు లేదు, నేనుసందేహము లేనివాడనైయీరెంటిని గూర్చిగ్రంథమునుజేసితిని, నీవుసందేహము లేక చదివినయెడల, నీకు యేసంశయములునుగలుగనేరవనిభావము

ప॥ హాటమునకుటిలాత్మునిజం । పుటకై భటకోటికాఙ్క్షభూ
పతియుడినన్ । భటులటువలె జేసెడిచో। పటుకుటిలుడుబడెడుపా

ట్లుపాటించిరనునా * అట్లనేగురునినోటదావినినా * యిటువం
టిబోధనుయెటువంటినరుడైన! అటువెన్క తనచేష్టలెటువంటివో
దానిపాటించిరనునా * అట్లనేగురునినోటదావినినా॥ ౨౧౨॥

తా॥ శిష్యా! ప్రభువుకుటిలాత్ముడైన శత్రువునుజంపుడనిభటుల
కాజ్ఞాపించగా, ఆభటులువానింబట్టిచంపెడుకాలమున; యాకటాత్ముడు
తానుమునుచేసిన దుష్కార్యములనుయోచించునా యోచించదు,అ
టువలెనేసద్గురునినోట నీయచలబోధనువినినమానవులు తనతొల్లింటి
చేష్టలను దెలియనేరరనిభావము.

ప॥ సకలజనులసమ్మతిగా । నొకనైననునడువలేడు యుర్వీస్థ
లిపై । మకరాంకజననిజనకా । ద్యఖిలంకులలోనసీవసేమిగణ
నా*బోధందితరజనులేమిగణనా* వికలమానసుడవై వెలిబొంద
బోకుసీ । ఎకుటిలభక్షుడవనిదెల్పితినీ బోధననసేమిగణనా*బో
ధందితరజనులేమిగణనా॥ ౨౧౩॥

తా॥ శిష్యా! సర్వజనసమ్మతిముగా నొకడైనను యీలోకము
నవర్తించనేరడు, మన్మధుని తల్లిదండ్రులు మొదలగు దేవతలలో సీవ
నగానెంతమాత్రము, అనగా యీపరిపూర్ణబోధగల వారికని తరులెంత
మాత్రముగాబట్టినీవుచిత్తచలనముచేత లేనిసంకటములనుబొందకము
నిష్కల్మషుండవుగనుమనిభావము.

ప॥ బలధనవిద్యలుదుష్టుల । కిలగలిగిననోరులనెంతుదెంత
యుసీస్థిక । బలధనవిద్యలుశిష్టుల।కిలగలిగిననొరులబ్రోతురెం
తో మోదమునా * సీపీరెంటినెటిగిమోదమునా * కలలోననై
నదుష్టులచెంతజేరకు । మెలమిశిష్టులచెంతకలనైనవదలకుమెం
తోమోదమునా* సీపీరెంటినెటిగిమోదమునా॥ ౨౧౪॥

తా॥ శిష్యా! బలమును, ధనమును,విద్యయునుగలిగియుండిన
దుష్టజనులు యీలోకమునయితరులయందసూయభావమును గలవా
రలై వారికకీడుగావింతురు. బలమును,ధనమును, విద్యయునుగలిగియుం
డిన మంచిజనులు యీలోకమున పరులయందుప్రేమగలవారై వారి
కిమంచిగావింతురు, నీవు యీరెండువిధముల నెటింగికలలోనైనదుష్టు
లచెంతజేరవలదు, మంచివారి చెంతంజేరుమనిభావము.

ప॥ అందమగుస్వాతివర్షమ్ము । బిందువులెందెందుబడునో పృథివినిత । ద్బిందువులుపాథివశమున । జెందునుతగనామరూప చేష్టాదికమునూ*అట్లనెనీవుజెందేవిన్నియునూ* మందితోజత గూడిమాట్లాడినంతలో। అందుకేసహవాసమరయుముతగువా నిచేష్టాదికమునూ*అట్లనెనీవుజెందేవిన్నియునూ॥ ౨౧౫॥

తా॥ శిష్యా! స్వాతికార్తెయందు కురిసినవాన బిందువులు యే యేస్థలములయందుబడుచున్నవో, ఆయాస్థల విశేషములవలన నానా విధరూపనామములను గుణములనుబొందుచున్నవి. అటువలెనేనీవుదు ష్టసాంగత్యము చేసినదుష్టుడవుదువు,సజ్జనసాంగత్యము చేసినసజ్జనుండవు దువు గాబట్టి సజ్జనసహవాసమేయుక్తమని భావము.

ప ॥ జారులకులోకులందరు । జారులవలెదోచబడుట సహ జగుణంబౌ । చోరులకుసకలజనములు । చోరకులనిమదికిదో చుచునికిసహజమురా * అట్లనెదుష్టాత్మునికిసహజమురా * సా రములేనిసంసారాబ్ధినిదాటించు । వారినితమవంటివారనిగనుట ట్లుయునికిసహజమురా*అట్లనెదుష్టాత్మునికిసహజమురా॥ ౨౧౬॥

తా॥శిష్యా!లోకమునందుసహజముగాజారులకులోకులుజారులు గాను,దొంగలకులోకులందరుదొంగలుగానుమనస్సునకుందోచుచుండు ట సహజగుణముగానే యుంటున్నది, యిదేప్రకారము దుష్టాత్మునకు లోకులందరుదుష్టులుగానేతోచబడును. లేశమైననుసారములేనియీసం సారసాగరమునుదాటించేడు సద్గురుస్వామిని తమవంటివారుగానేభావిం చుటయునుసహజముగానున్నది.ఇదిసరికాదు. మనమేజారచోరదుష్టత్వ ములుగలవారము,లోకులు మంచివారనియును,సంసారసాగరమునుదా టింపజేసేడిమహాత్ముడేదేవదేవుండనియునుభావించుటయుక్తమనిభా॥

ప॥ బయలెఱుకలుశిష్యునకుగా । దయతోగురుడెఱుగజేసిత రునాతనుసం । దియమేమిలేకయెఱుకను। నయమునవిడిపించు గురుడునయశాలిగాదా*నీమదికిదినాటునాలేదా * భయభక్తి గురుసార్వభౌమునిసేవని । శ్చయముగజేసితెజయమందెదవుగు రుడునయశాలిగాదా*నీమదికిదినాటునాలేదా॥ . ౨౧౭॥

11

తా॥ పుత్రా! సద్గురుస్వామి. శిష్యునకుపరిపూర్ణమును మెలుక
ను యీరెంటినిమెఱిగించి సర్వసంశయములకు మూలమైన యీమె
లుకను విడిపింపఁజేసిన యీగురుమహాత్ముడుగాడా, యిది నీమనస్సున
కుంబట్టినాలేదా, నిశ్చలమైనభ క్తియును భయమునుగలిగిసద్గురుమూ
ర్తిని సార్వభౌముండనియెంచి సేవజేసినయెడల నీకు జయముకలుగును
సందియములేదని భావము.

ప॥ పదిరెండక్షరములుగల। సదమలమంత్రార్థ మెఱిగిసద్గురు
కృపచే। బదియారక్షరములుగల। యదియెట్టిదో తెలిసెనేనియత
డేసద్గురుడూ*యీరెండెఱిగినయతడేధీవరుడూ* మొదటిదిపరి
పూర్ణమునుదెల్పునెలుకను। తదనంతరప్రబోధనుజేయు నీవుదెలి
యునతడేసద్గురుడూ*యీరెండెఱిగినయతడేధీవరుడూ॥ ౧౧౮॥

తా॥ శిష్యా! పదిరెండక్షరములు గలద్వాదశాక్షరీమంత్రమును
సద్గురుకృపచేతనెఱింగి, పదియారక్షరములుగలషోడశాక్షరీమంత్రమె
ట్టిదో దానివిధమును దెలిసినవాడేసద్గురుడు, యీరెండుమంత్రముల
యొక్క భావములను దెలిసినవాడే మహాత్ముడు, మొదటిదియైనద్వాద
శాక్షరీమంత్రముపరిపూర్ణమునేదెలుపును, రెండవదియైన షోడశాక్షరీ
మంత్రములేని మెలుకనుదెలుపును. యీరెంటినియెఱిగిన మహాత్ముడే
సద్గురుస్వామియని భావము.

ప॥ఆమంత్రయుగముదెల్పెద। నేమముతోదలచుము త్తదీబట్ట
బయల్। యేమియులేదనిబలికిన। యీమంత్రమెతత్వమూలమిం
కొకటివినుము*యెప్పుడునోటయిదిమరువకనుము*యీమూల
ములేనిగు ర్తెఱిగేశరీరము। యేమిలేదనియంటెయిదిషోడశాక్షరి
యింకొకటివినుము*యెప్పుడునోటయిదిమరువకనుము॥ ౨౧౯॥

తా॥ శిష్యా! ఆమంత్రములరెంటిని వినుపించెదనువినుము, అం
తయుబట్టబయలని, యింతకంటెనేమిలేదనినేమముతోదలచుటేద్వాద
శాక్షరీమంత్రము, సర్వతత్వములకుమూలము యింకొకటిగలదు, గుఱు
తుమెఱిగేశరీరమేమిలేదనిదలంచుటే షోడశాక్షరీమంత్రము. ఈరెం
డుమంత్రములను నీవు సదామరువకుమని భావము.

ప॥ తొలిమంత్రపద్ధతెక్కడ । కలదోయనివెదుక నేలకలదం తటయా । వలమంత్రపద్ధతెక్కడ। కలదోయనిజూడనేలకాదా చూచేది * వినేదియనేదితినేది * అలతొలుతదానినియవలో కనముచేసి । కలకాలమెఱుకలగలదానివిడు వెఱుకగాదాచూ చేది * వినేదియనేదితినేది॥ ౨౨౦॥

తా॥ శిష్యా! మొదటిమంత్రముయొక్క మార్గ మెక్కడున్నదో యని వెదుకనేల, యదియంతటనునిండియున్నది. ఆవలిమంత్రముయొక్క మార్గమెక్కడున్నదో యనిజూడనేల, యదియేగదా చూచునది వినునది అనునది తినునదిగాబట్టి తొలిమంత్రమైన ద్వాదశాక్షరిని దర్శించి, కలకాలములేని యెఱుకయైనదానిని విడువుమనిభావము.

ప॥ఇదితప్పయేమిలేదని । మొదటిది మొరబెట్టుచుండుముద మునవినుమీ।యిదియేమిలేనుపొమ్మని। వదలక రెండవదిలెన్నవ దరుచుండునురా*బయలెఱుకలుయిదినిశ్చయమురా* అదిగాన యీరెంటినరసినీవిప్పుడు।విదితముగయెఱుకను విడురమంత్రమి ట్లువదరుచుండునురా*బయలెఱుకలుయిదినిశ్చయమురా॥ ౨౨౧॥

తా॥ శిష్యా! మొదటిమంత్రము యిదితప్పయేమిలేదని మొరబెట్టుచుండును. రెండవమంత్రము యిదియేమిలేనుపొమ్మనివదురుచుండును. పరిపూర్ణమెఱుకలనిశ్చయమిదియు, గాబట్టియీరెంటిని నీవిప్పుడువిచారించి తెలునుకొని.లోకవిదితమైనయెఱుకనువిడువుమనిభావము.

ప॥ పరిపూర్ణమిదుగోయిదిగో । యెఱుకతోజూపించిలేనియె ఱుకనులేదం। చెఱిగించినగురుడేసరి । యెఱుకనునిల్పెటిగురుడు యెందుకోయన్నా * తద్బోధనీకెందుకోయన్నా * శరణన్నవా రిమస్తకమందుచెయిబెట్టి। తిరముగయెఱుకనుతీసివేయనివాడు యెందుకోయన్నా * తద్బోధనీకెందుకోయన్నా॥ ౨౨౨॥

తా॥ శిష్యా! పరిపూర్ణముయిదుగో యిదుగోయనియెఱుక చేతంజూపించి. లేనియెఱుకనులేదని యెఱిగించినగురుడేసరి. యెఱుకనునిలుపునట్టిగురుడుయెందుకు. అట్టిబోధనీకెందుకు. వలదువలదు. శరణనిసాష్టాంగపడినమస్కరించిన యాశిష్యుని శిరమునందు హస్తముంచి, యెఱుకనుదీసివేయని గురుడు, గురుడుకాడని భావము.

చ॥ పరిపూర్ణబోధ యెఱిగిన । గురుశిష్యులుబోధకోఱకుకో
రపనిబడుకా । గురువర్యుడొకనిమరలను।హారువరమునబుట్టినట్టి
యాశిఖండికినీ * సతియైనట్టియబలతండ్రికినీ * వరులనిర్ధరినిదే
వలయునీయల్లుడు నేను । వరియింతుమని చెప్పివరుసబంపినయట్టు
లాశిఖండికినీ * సతియైనట్టియబలతండ్రికినీ॥ ౨౨౩॥

తా॥ శిష్యా! శివదేవునివరమునద్రుపదమహారాజునకుంబుట్టినశి**ఖండి**యనుపుత్రిని, యాద్రుపదమహారాజు పుత్రుడనివెల్లడిచేసి, కాశీదేశపురాజపుత్రిని మాట్లాడి, చంద్రాయుధమునకు వివాహము చేసియాలతాంగినిందోడ్కొనివచ్చెను. ఆముగ్ధరాలుకొన్ని మాసములవరకుతనభర్తనుంగానకమనోవ్యధనుం బొందివిచారణచేయగా, తనభర్త**యును** ఆడుదియుని దెలియవచ్చిమిగులదుఃఖించి, నాకును, నీయల్లునకును, యిరువురకునిరువురపురుషులను వెంటబెట్టుకొనిరమ్ము, మేమాపురుషులను వరియింతుమని తనతండ్రికిజాబులువ్రాసెను. ఆకాశీదేశపురాజుదుఃఖావేశముతో యుద్ధమునకువచ్చుటచేత, నాశిఖండియడవులపాలై పోయియందొకయక్షునివలనపురుషరూపమునుధరియించివచ్చియాలతాంగినిసంతోషపరచెనుగాని,యాకోమలికోరికలుకొనసాగకపోయెనుగాబట్టియిటువలెనే,పరిపూర్ణబోధయెఱిగినగురునియొక్క శిష్యులుయితరగురువులనుగోరుటవలన నరకమువిడువదనిభావము॥

చ॥ పరిపూర్ణబోధ యెఱిగిన । గురువరుచేబోధగొనినగొప్ప
ఫలంబా । పరిపూర్ణబోధనెఱుగని । గురువరుచేబోధగొనినగొ
ప్పఫలమౌనా * అదియెట్లన్నకూడిరతిలోనా * పురుషునిచేసం
తుపొలతిబడయునుబడయు । తరమానెవారికితమవంటివారిచే
గొప్పఫలమౌనా * అదియెట్లన్నకూడిరతిలోనా॥ ౨౨౪॥

తా॥ శిష్యా!పరిపూర్ణబోధనెఱింగిన సద్గురుమూర్తివలననీబోధపొందినయెడల గొప్పఫలమిచ్చునేగాని పరిపూర్ణబోధయెఱుగని గురునియొద్దబోధపొందినయెడల గొప్ప ఫలముకలుగనేరదు. అది యెట్లన్నను స్త్రీలుపురుషులతో రతికేళిసలుపుటచేత సంతానమునుబడయనేర్తురేగాని,తమవంటిస్త్రీలతోగూడుటచేత సంతానమెటుల బడయ నేరరో, అటువలెనే సచ్చిదానందమార్గముగలవారి బోధవలన జననమరణప్ర

వాహము విడువనేరదు, గాబట్టి సచ్చిదానందరహితుడైన అచలగురు నివలన బోధనుగైకొనిన మొదలఫలితార్థమనెడు జన్మరహితమును నిస్సంశయముగాబొందవచ్చునని భావము.

ప॥ దృష్టాంతముదోటికెనునీ । యోష్టముగదలించగానని
జకల్లనుచుగ । దార్ష్టాంతమడుగబోధకు । స్పష్టముగాకర్పూర
ముదీపముజూపవలె॥యీయుక్తిలోపముజేయకోయి * తు
ష్టినొందెదరిట్లుశోధిచెప్పితిగాని । శ్రేష్ఠము యీబోధచేకొన్న
వారికిదీపముజూపవోయి*యీయుక్తిలోపముశేయకోయి॥ ౨౨౫॥

తా॥ శిష్యా!యీయచలబోధకు దృష్టాంత దార్ష్టాంతములడిగిన మొదలకర్పూరదీపమునుజూపుము, యీయుక్తికి నీవులోపము చేయనల దుయిందువలననందరునుసంతుష్టినొందెదరని తెలిసినీకుజెప్పితిని, యింత కంటెనువేరేదృష్టాంతములేదు, పక్కమాటలెందుకు,యీయచలబోధ కంటెనుశ్రేష్ఠమైన బోధలేదనిభావము.

ప॥ ఎఱుకభ్రమగల్గుశిష్యుని । పరితాపము మాన్పునట్టిపం
డితుడితడే । గురువరుడుగానిగురువులే । గురువులమనిపొట్టకో
అకుగోశిగేవారల్లా* వారికిబోధ తెలియుటకల్లా*పరిపూర్ణమున
లేనియెఱుకనేర్పడదెలిసి ।యెఱుకనువిడిపించనెఱుగకగురువులై
గోశిగేవారెల్లా * వారికిబోధ తెలియుటకల్లా॥ ౨౨౬॥

తా॥ శిష్యా! యెఱుకయందుభ్రమనుగొనియున్న శిష్యునియొక్క దుఃఖమునుదీర్చునట్టిమహాత్ముడుయచలగురుడేగాని యితరులవలనంగానేరదు,అట్టియచలగురుడేగురుడుగాని యితరగురువులుతమపొట్టకో అకుగోశిగేవారు, అట్టివారికిబోధ తెలియుటకల్ల,పరిపూర్ణమునందు లేని యెఱుకనుజూపించి,యాయెఱుకనువిడిపించనేరని గురువులునిజగురువులు గారు, వారుమాయకులనిభావము.

ప॥ గురుశుశ్రూషయొనర్చుట । యెఱిగించెదనెట్టులనిననేర్ప
డవినుమీ । నరులిష్టదైవమునకుం । బరిచర్యయొనర్చునట్లుభ
క్తితోడుతనూ * గురుమూర్తికత్యుక్తితోడుతనూ * నిరతము
రమరలేకనీవుసల్పితివేని । గురుబోధమరుగునద్గురునిచేదెలిసేవు
భక్తితోడుతనూ*గురుమూర్తికత్యుక్తితోడుతనూ॥ ౨౨౭॥

తా॥శిష్యా!గురువునకుపరిచర్యలుచేయునట్టిక్రమమెట్టిదనినవినుము,నరులుతమయిష్టదైవములకు భక్తిశ్రద్ధలతోపూజయును,ధూపదీపనైవేద్యములను,యెటులగావింతురో అటువలెనే,అరమరలులేకసద్గురుమూర్తికివివిధపరిచర్యలుగావించినయెడల,నీకుయాసద్గురునియొక్క రహస్యమునుదెలియవచ్చుననిభావము.

ప॥ తనుమనధనమునుగురునకు।వినయంబునధారబోసివేడ్క
గురునిచే।ననువైనబోధవడసిన । ఘనమతిమంతునకుసాటిగల
రాయీభువిని*లోకులు।మ్రొక్కవలదాతాముని* తానునిత
రులనితాననకయేమాట । వినకపరిపూర్ణతదనకువారికిసాటిగల
రాయీభువిని*లోకులు।మ్రొక్కవలదాతాముని॥ ౨౮॥

తా॥ పుత్రా! సద్గురుమూర్తికిశరీరమును. మనస్సును. ధనమును. వినయముతోసమర్పించియత్యానందముతో,నాగురునివలనబోధగైకొనినయాపుణ్యాత్మునకుసాటియీభూమిమీదనెవ్వరునుగారు.అట్టివారినింజూచిలోకులును నిష్కపట్యులై మ్రొక్కులువేయవలయును,నేననియితరులనితాననియనక. యేమాటలునువినక. వృత్తిరహితమైయుండెడు పరిపూర్ణునకులోకముననెవ్వరును సాటిలేరని భావము.

ప॥ జలమునెడబాయనొల్లని । జలచరములరీతిపూనిసచ్ఛి
ష్యుడుహృ । జ్జలజంబనుపీఠముపై। నిలిపితరముమానిగురునినే
గొల్చుకొమ్మి * తదుక్తులనేదల్చునమ్మి * కలకాలమీరీతిగడు
పుచునేప్రొద్దు।తలిదండ్రిదొరదాతదైవమనుచుగురువునేగొల్చు
కొమ్మి * తదుక్తులనేదల్చునమ్మి॥ ౨౯॥

తా॥ వత్సా! చేపలుమొదలగు నీటిజంతువులెట్లు నీళ్లనువిడిచియుండవో, అటువలెనే నిజమైనశిష్యుడుతనహృదయ కమలమునందుసద్గురుస్వామినినిలుపుకొని యితరచింతలనువిడిచి,సదాగురువునేగొల్చుకొనును, అట్టియుక్తులనేదలచుచుండును, కలంతకాలమీరీతిజేయును, అట్టిసద్గురుడే తల్లియనియును,తండ్రియనియును,దొరయనియును,దాతయనియును,దైవమనియును భావించవలయునని భావము.

ప॥ సతిపొరుగూరికిపోయిన। పతిరాకడగోరినట్లుభావములో
నన్ ।మతిమంతుడుసచ్ఛిష్యుడు।సతతముగురురాకగోరుసత్వము

వినరా * వానితోటిసాటెవ్వరనరా * హితునిరాకడకుస్నేహి
తుడుగోరినయట్లు।అతిదరిద్రుడుద్రవ్యతతినిగోరినయట్లునత్యము
వినరా*వానితోటిసాటెవ్వరనరా॥ ౨౩౦॥

తా॥ బిడ్డా!యితరగ్రామమునకుం బోయిన తనభర్తరాకకు, ఉ
త్తమస్త్రీయెటులయెదురుచూచుచుండునో, అటువలెనేబుద్ధిమంతుడై
నశిష్యుడుయెల్లప్పుడును, గురునిరాకనుగోరియుండును,యిదిసత్యము,అ
ట్టివానికిసమానులెవ్వరునులేరు, మిత్రునిరాకను స్నేహితుడుగోరినవిధ
ముగా,మిగులదరిద్రుడు ధనమునుగోరినట్లుగా నిజమైనశిష్యుడుసదా
గురునిరాకను గోరియుండునని భావము.

ప॥ అతివలరతిచతురతలా। యతివలచేవారితంద్రులరయ
రనుచుత।త్పతులరయనేర్తురట్లనె।మతిమంతుడుగురునిబోధమా
నినగానీ * తద్బోధతామానదుపూనీ * అతిదరిద్రునిచేవిద్యా
ర్జనాఘనుడు।చతురునివిత్తమార్జించినతంతులుమానినగానీ *
తద్బోధతామానదుపూనీ॥ ౨౩౧॥

తా॥శిష్యా!లోకమునస్త్రీలుతమచతురత్వములు, తమవంటి
లవల్లతమతంద్రులెఱుగరనియును,తమపురుషులుమాత్రమెఱుగుదు
రనియునుభావింతురు,బుద్ధిమంతుడైనశిష్యుడు తనగురుడుబోధించకుం
డినను తానాబోధయందపేక్షగలిగియుండును, అతిదరిద్రుడుతనయొద్ద
విద్యనేర్చుకొనపేక్షించిన యాధనవంతునియొక్క ధనముగ్రహించునటు
లశిష్యుడుగురుబోధను క్రమేణ తెలుసుకొనునని భావము.

ప॥ పరిపూర్ణబోధ తెల్పే। పరియంతముసేవజేసిబహునమ్మిక
గా।గురుమూర్తికితరుపాతను। మరికన్నులగననివానిమార్గము
ఛీఛీ*తలచరాదామాటనుఛీఛీ* గురునాజ్ఞవిననిదేగురువై శిష్యు
లగూర్చి। గురుబోధ తెల్పేటిగురువంచకునియొక్క మార్గముఛీఛీ
* తలచరాదామాటనుఛీఛీ॥ ౨౩౨॥

తా॥ పుత్రా! కాపట్యముగలమనుజుడు తనకుపరిపూర్ణబోధ తె
లుపునంతవరకును. సద్గురునకువివిధపరిచర్యలుచేయుచు. తనభక్తివిన
యములనుజూపిమిగులనమ్మకమునుబుట్టించి, అట్టిపరిపూర్ణబోధనుబొం
దినపిమ్మట,గురునియింటికింబోక,గురునకుంగనుపించక ముఖముతప్పించె

దుదు రాత్మునియొక్క-మార్గముఛీఛీవినరాదు,తలచరాదు, సద్గురునియొ క్క-యాజ్ఞనుబొందక నేతానుగొండజుశిష్యులనుగూర్చుకొని గురుబోధ నువారికిందెలుపునట్టి యాగురువంచకునియొక్క-మార్గమున్ను ఛీఛీ విన రాదుతలచరాదు, వాడెగురుద్రోహియనిభావము॥

ప॥తనశిష్యులువినితనుసతి।వినయంబునగొలుచుకొఅకువిను తులొనర్చు౯।తనగురువునుగురుడింటికి।జనుదెంచినజూచిశ్రూ షతానొనర్చండూ * లేమినిదెలిపిచనుమనుచుండూ*వినుముకు చ్ఛితశిష్యాగ్రణివీడువీడెట్లు। ఘనబోధో క్తస్థితిగనునోగురునకుశి శ్రూషతగనొనర్చండూ * లేమినిదెల్పిచనుమనుచుండూ॥౨౩౩॥

తా॥ శిష్యా! కొందఱుమరహంకారులు. తమశిష్యులుదమ్ముగీ ర్తించుటకును, వినయంబునగొల్చిసేవించుటకును, తమశిష్యులయెదుట వారిగురువునువినుతించురేగాని నిజముగాతమగురుడుతమయింటికివచ్చి నయెడల,యామహాత్మునకుతాముశుశ్రూషలుచేయరు, అట్టిసద్గురునకు తమకష్టదరిద్రములను జెప్పిపొమ్మందురు, ఇటుమంటికుచ్ఛితమనస్సుగల శిష్యులుయెట్లుజన్మరహితులయ్యెదరు, అకటావారుముక్తినింబొందనేర గు,జననమరణప్రవాహములువారినివిడువవని భావము

ప॥ కుటిలాత్ముడైనశిష్యుం। డిటువలెతాబల్కు-గురుడుయిం టికిరాగా। యెటుబోవుచుండిరాకో। యిటకికదర్శనముమల్లీయె ప్పుడయ్యానో * యెవరికిదెలునుయెప్పుడేమానో * యెటుదో చదేమైనయిత్తమంచనుకుంటే। తుటుకునవకరాగిదుడ్డయినలే దిపుడెప్పుడయ్యానో * యెవరికిదెలుసుయెప్పుడేమానో॥౧౩౪॥

తా॥ శిష్యా! కుటిలమనస్సుగలకపటశిష్యుడు, తనగురుడుతన యింటికివచ్చినంజూచి. తాముయెక్కడికిం బోవుచునిక్కడికివచ్చితిరో, మఱలయెన్నడువచ్చిమాకుదర్శనమిత్తురో, యెప్పుడెప్పుడుయేమేమిజ రుగునో, యెవ్వరికిందెలుసును. యిప్పుడేమైనను దేనరవారికినిచ్చెదమని యోచించినను, యొక్క-రాగిదుడ్డుయైనను లేదు,నాకుయేమితోచలేదని తనకపటవినయములనుజూపునని భావము॥

ప॥ జపములుతపములుసలుపుచు । విపరీత స్మరణజేయువే దాంతార్థం। బపరిమితంబుగజెప్పును కపటాత్ముడుశిష్యకోటిగని

మెచ్చుకోఁడకూ * మెచ్చిద్రవ్యమును యిచ్చుకోఁడకూ * అపకీ
ర్తి సేతలకమరినట్లుగుపడి। యుపము చే బ్రతుకుచునుందులోకులుత్త
ననుగని మెచ్చుకోఁడకూ* మెచ్చిద్రవ్యమునుయిచ్చుకోఁడకూ॥ ౨౩౫॥

తా॥ శిష్యా! నిజమెఱుంగనికపటవేషధారులైన యభ్యాసగురువులు, తమశిష్యవర్గము మెచ్చుకొనునటుల జపమును, విపరీతమైన స్మరణయును జేయుచు, వేదాంతార్థములనువిచ్చలవిడిగా జెప్పుదురు, యిటుల జేయుటపరమార్థముకోఁడకుగాను, శిష్యులు మెచ్చిధనమిచ్చుకోఁడకై యిటుల జేయుదురు, యిదియపకీర్తి జీవనమనిభావము.

ప॥ గురుమూర్తి -మురహంకృతి। దొంగకొన్ననుదొంగత్రోవ
ద్రొక్కిన చెవులం। గురునిందవినిన జేసిన । సరసకుపరిపూర్ణబోధ
నలవియె తెలియూ* కూడకువాని తెలియకకలియూ* గురుడు దెలిసి
నపుస్తకరీతిచేప్పు-బాణ । మురసితినని యెంతోమురిసిన గురుబోధ
నలవియె తెలియూ* కూడదువాని తెలియకకలియూ॥ ౨౩౬॥

తా॥ పుత్రా! శిష్యుడుసద్గురుని యెదుటఅహంకారమునుబాందినను, దొంగత్రోవలయందువర్తించినను, గురునింద చెవులతో వినినను, తాను జేసినను, అట్టిదుర్మార్గునకుపరిపూర్ణబోధపట్టనేరదు, అట్టివాని కర్మధర్మములను దెలియక వానితో జేరకూడదు, గురుడు దెలుసుకొనిన అచలగ్రంధమువల్ల నేనును పరిపూర్ణుడనైతినని వాడెంతసంతసించినను, వానికిపరిపూర్ణబోధకలుగనేరదనిభావము.

ప॥ నాలుగుశుశ్రూషణములు । లోలతిగానించుకొనుచులో
కాతీతం । బాలోకించియుగురు చే। యీలోకముజోలివిడువుమిం
తేచాలన్నా* నీతోఁగూడయిదిమరువకన్నా * కీలుదెలియనిచదు
వుచాలాచదివెందుకు । చాలించునీవిట్టికీలుదెలిసితేనేనియుంతే
చాలన్నా* నీతోఁగూడయిదిమరువకన్నా॥ ౨౩౭॥

తా॥ శిష్యా! నాలుగువిధములైనశుశ్రూషలనగా=స్థానశుశ్రూష, అంగశుశ్రూష, భావశుశ్రూష, ఆత్మశుశ్రూష, యీచతుర్విధములు. (స్థానశుశ్రూషయనగా= గురుస్థానమునువిడువకభటునివలెగురుకార్యములనుజరిపించుట. అంగశుశ్రూషయనగా=సద్గురువునకు స్నానాదికృత్యములనుదీర్చుచు కాలుచేతులుపట్టుట. భావశుశ్రూషయనగా=సద్గురు

డుభావమునందలంచినవస్తువును దెచ్చిసమర్పించుట అత్మశుశ్రూషయనగా= శరీరయాత్మలురెండునుసద్గురునకుసమర్పించియేభ్రాంతులును లేనివాడై లోకాతీతమైన పరిపూర్ణమును సద్గురుకటాక్షమువలన దర్శించి, యీలోకముయొక్క సంఘాతమునువిడుచుట, నీవుయీనాలుగింటినిమరువకుము, గురుకీలు దెలియనిచదువులుచాలాచదువుటవలనంబ్రయోజనమేమి, వాటినింజాలించి, గురురహస్యమును దెలియుట చేతనీకు జన్మరహితముగలుగునని భావము॥

ప॥ దేశికునిచరణతీర్థము । కాశీగంగయనిగురునిగనుగొన్నుని । శ్వేశుండనితనకునుయుప । దేశంబొనరించునట్టిదేతారకమనీ * మనసంను తానీతీరుగానీ * యేసీమయందున్న కాశీప్రయాగరా। మేశునిపురమైప్రకాశించునాసీమయదే తారకమనీ * మనసంను తానీతీరుగానీ॥ ౨౩౮॥

తా॥ శిష్యా! దేశికస్వాములవారిశ్రీపాదతీర్థమే కాశీగంగయనియును సద్గురుమూర్తియేవిశ్వేశుండనియును, తనకునుపదేశించినదియే తారకమనియును మనస్సునందలంచవలయును, సద్గురుడుండెడు దేశమే కాశీప్రయాగరామేసునిపట్టణమై ప్రకాశించునటుల మనంబున నెంచవలెననిభావము

ప॥ గురుచరణజలముగోదా। వరియనిగురుమూర్తిరామభద్రుండనిత । త్పురమునుభద్రాచలమని । గురుమంత్రమె తారకమని గురిగల్గినట్టి * తేరిగిరానిమరుగెటిగినట్టి * గురుడున్న చోటెసుందరమైనశ్రీశేష । గిరిరంగనాయకపురమనదగియుండుగురిగల్గినట్టి * తిరిగిరానిమరుగెటిగినట్టి॥ ౨౪౯॥

తా॥ శిష్యా! సద్గురునియొక్క పాదజలమేగోదావరియనియును సద్గురుడేరామచంద్రుండనియును, సద్గురుడుండెడుపురమేభద్రాచలమనియును, గురుమంత్రమేతారకమనియును, త్రికరణశుద్ధిగాదలంచిన శ్రేష్ఠుడైనశిష్యుడు, గురునిమరుగుతెలుసుకొనిజన్మరహితుండగును, సద్గురుడువసియించెడుచోటే శ్రీరంగనాయకపురమనిజెప్పంబడునని భావము।

ప। గురుడునరుడనుచుదెలిసిన। గురుమంత్రమువిడచియున్న గురుపుత్రులనా। దరణయొనర్చకయుండిన। గురువునువిడనాడిరెండోగురునిజేరిననూ*సద్గురుబోధ నెటిగిదూరిననూ * యెటుకమ

హాత్మ్యము నెఱిగినయిటువంటి నరునకు దప్పదు నరకము యింకొ
క్క గురుని జేరినను * సద్గురుబోధ నెఱిగి దూరినను॥ ౨౮౦॥

తా॥ శిష్యా! గురుడు నరుడని భావించినను, గురుమంత్రము నుమ
రచియుండినను, గురుపుత్రుల నాదరణ చేయకుండినను, అచలపరిపూర్ణ
బోధగల సద్గురువును విడిచి, యొకమార్గమునందు వర్తించెడు వేరొక గు
రువును, ఆశ్రయించినను, గురుబోధ యెఱిగి దూషించినను, యొక మహా
త్ములయందిష్టము గలవాడుగా నుండినను, అట్టి పాపాత్ములకు నరకము
విడువదని భావము.

ప॥ జ్ఞానవైరాగ్యభక్తిస। మానన దీస్నాన దేవమంత్రపఠనత।
ధ్యానమభిమంత్రములుపర। మానవియతిగోరినట్టి మనుజసంఘ
ముకూ * బోధను తెల్పుమనినవారలకూ * తాను బోధించుటలెగి
దుబోధించితే। తాను నేనను భ్రాంతి తొలగదేలాగంటే మనుజసం
ఘముకూ * బోధను తెల్పుమనినవారలకూ॥ ౨౮౧॥

తా॥ శిష్యా! జ్ఞానమును, వైరాగ్యమును, భక్తియును, సరియైన
మార్గములనియును, నదీస్నానమును దేవమంత్రపఠనయును, ధ్యానము
ను, మంత్రమభిమంత్రములును, పరమనిన మోక్షము పామరజనులు, అచల
బోధను దెల్పుమని వేడినను, వారికి బోధించకుండదు, బోధించినను వారికి
తాను నేను పరులనెడు భ్రాంతి విడువనేరదని భావము.

ప॥ ఇంగితము నెఱిగి సద్గురు। పుంగవు చేనరుడు భక్తిముక్తిక్రి
యలకా। సంగాసంగము వెడలిన। శృంగారమె వాని చేష్టచూచె వా
రలకూ * వాడున్నట్లుతో చెవారలకూ * మంగళసూత్ర మెబ్బంగి
శృంగారమో। శృంగారవతికియా శృంగారవతికిట్లజూచెవారల
కూ * వాడున్నట్లుతో చెవారలకూ॥ ౨౮౨॥

తా॥ శిష్యా! పరమరహస్యమెఱింగిన సద్గురుస్వామివలన యేనరు
డు భక్తిముక్తిక్రియలయొక్క చేరికయును, చేరకుండుటయును, యీ రెం
టిని విడిచిన యా మహాత్ముని చేష్టలు జూచువారలకు మిగుల శృంగారములు
గానుండును, పరిపూర్ణమును దెలిసిన వారలకు నీలోకము మిగుల వింతయై
యుండును, గుణవంతురాలకు మంగళసూత్రమెటుల శృంగారమో అటు
వలెనే, మానవులకు పరిపూర్ణబోధ యే శృంగారమని భావము.

ప॥ జనులందరుగురుబోధను । గనిరాజనులందునేనుగలియ
కయున్న।న్ననుమన్నింతురేవారని।మనసునదలపో స్తైబోధమర్మ
మబ్బీనా * అబ్బినవారిధర్మమబ్బీనా * జననమరణములేనిఘన
మైనత్రోవనే।గన్నతెలిసిబోధగనకున్నయీబోధమర్మమబ్బీనా*
అబ్బినవారిధర్మమబ్బీనా॥ ౨౮౩॥

తా॥ శిష్యా! లోకమునజనులందరుగురుబోధను బొందిరనియు
ను, నేనాజనులతోగలియకుండినవారు నన్నుమన్నింతురాయనియును,
మనస్సునదలంచినమాత్రముననే పామరులైనవారికి సత్పురుషులమ
ర్మముదెలియవచ్చునా,అటులఅబ్బినను,వారిధర్మముదెలుసునా, దెలియ
నేరదు,జననమరణములులేనిమహాశ్రేష్టమైన యచలబోధను బొందకుం
డినవారికి,యీమర్మధర్మములుదెలియరావనిభావము.

ప॥ హృదయగ్రంధివిడుటకై । సదయతయీబోధదెల్పజన
దాగురుడై ।వదలకచిత్తములోపల। పదయుగములుదలపవలదె
భక్తుడైనపుడూ * భ్రాంతిరహితాసక్తుడైనపుడూ* కుదురవు
యివిరెండుగురుశిష్యులకుగాక।కదలికలేనట్టిఘనబోధోక్తస్థితిభ
క్తుడైనపుడూ * భ్రాంతిరహితాసక్తుడైనపుడూ॥ ౨౮౪॥

తా॥ శిష్యా! జననమరణములుగలముడిపీడిపోవుసటుల గురుడు
యీయచలబోధనేదెలుపవలయును, భక్తుడైనశిష్యుడుసద్గురుపాదపద్మ
ములనువదలక తనచిత్తమునందలంచవలయును, యిదియేభ్రాంతిరహి
తమగువిధము, యీరెండువిధములుగురుశిష్యులు అనుష్టించక, ఘనమై
నయీయచలబోధ కుదురనేరదనిభావము.

ప॥గురుడాసవదలకుండిన।మతిశిష్యుడుద్రవ్యలోభమగ్నుండ
యినగా।మరియాదదక్కదిరువుర।కెటిగుండుమువీరలతిహీనులో
యన్నా*ఘట్టిగదురభిమానులోయన్నా*గురుడుశిష్యునిగన్నకొ
డుకుగాగనకున్న।గురునిపైశిష్యుడాగురినిల్పకుండినహీనులోయ
న్నా*ఘట్టిగదురభిమానులోయన్నా॥ ౨౮౫॥

తా॥ శిష్యా గురుడుఅధికఆశగలవాడుగానుండినను, శిష్యుడు
లోభిగానుండినను, యీయిరువురకునుమరియాదలుండనేరవు, వీరిరువు
రుమిగులహీనులు, నిజముగాదురభిమానులు, గురుడుశిష్యునితానుగని

నపుత్రునిగానెంచకుండినను, శిష్యుడుగురుడు దేవుడనియెంచకుండినను. నిజముగావీరిరువురుదురహంకారులనిభావము.

ప॥ గురుగురుబోధలచేతను। పరిపూర్ణంబెఱిగియెఱుకవిడిచిన యతినిం। గుఱుతెఱుగనరులశక్యమె। యెఱిగిననరులట్టిబోధయె
ఱిగేరాయన్నా * దారెఱిగినమరుగుండదన్నా * చిఱుతపాపని రీతిమరిపిశాచముభాతి। తిరుగుచునుండువెక్కిలిమాటకి-గురుడె ట్లుయెఱిగేరాయన్నా * దారెఱిగినమరుగుండదన్నా॥ ౨౪౬।

తా॥ శిష్యా! సద్గురుడుతనగురునియొక్కయచలబోధనుగ్రహిం చి, యెఱుకనువిడిచినయాపుణ్యపురుషునిం దెలుసుకొనుటకునరులకుశ క్యముకాదు, యెఱిగినవారికేయాగుట్టుదెలుసును,అట్టివారికిమరుగుండ దు, అట్టిమహాత్ములుబాలులవలెను,పిశాచములవలెను,పిచ్చివాండ్లవలె నువర్తింతురు, అట్టివారినిందెలియుటకుసాధ్యముకాదనిభావము॥

ప॥ మలయాద్రినున్నచెంచుల। కిలచందనభూరుహములె యింధనమటమి।క్కిలిగలుగబట్టియట్లనె। చులకననుమ్మియింటగ లుగుసూరిభూషణుడూ*బహుమాన్యుడుదూరస్థుడెపుడూ* తె లియనివారికితెలిసేదికరినము। తెలివిచెదెలిసిగతెలియజేసినబో ధసూరిభూషణుడూ*బహుమాన్యుడుదూరస్థుడెపుడూ॥ ౨౪౭॥

తా॥ శిష్యా! మలయాద్రియనెడు, పర్వతముమీదకాపురము చేయునట్టి చెంచువాండ్రుమంచిగంధపుకఱ్ఱలను దమకువంటకట్టెయలు గాజేసుకొందురు.యేలననగా, విశేషముగా మంచిగంధపుకఱ్ఱలుగలిగి యుండుటవలనవారికివాటియందులక్ష్యములేదు,అటువలెనే,సద్గురుమూ ర్తిశిష్యుడుండుయింటనేయుండినయెడలమిగులఅలక్ష్యభావమేగాని, గు రుత్వముగలిగియుండదు, గాబట్టిదూరముగానుండినయెడలవిశేషపూజ్య తగలుగుననిభావము॥

ప॥ దూరముననుండివిన్నను। చేరునుసజ్జనుడుగురునిచెంతకు బోధ।కోరిదుర్జనుడుగోరడు। దూరస్థుడుగాకగురువితోగూ డియుండి * యెట్లనియన్నదూరాననుండి * కోరితుమ్మెదతమ్మిజే రితేనియగ్రోలు।నారీతినెఱుగవుచేరికప్పలుతమ్మితోగూడియుండి * యెట్లనియన్నదూరాననుండి॥ ౨౪౮॥

తా॥ శిష్యా! సజ్జనుడు దూరముగానుండినను, గురునిదగ్గిరకు బోయి, గురురహస్యమును గ్రహించును, దుర్జనుడు దగ్గిరగానుండినను, గురుబోధను బొంద నేరడు; అదియెట్లనగా, కప్పలు తామరయందే యుండియును, ఆతామరలోని మధువును గ్రహించనేరవు, తుమ్మెద బహుదూరమునుండివచ్చియా తామరలోని మధువును గ్రహించిపోవునని భావము॥

ప॥ వాసిమది దెలిసిన శిష్యుని। యాశ్రమమునకుం దగినబోధ నతనికి దెలియం। జేసిముదమందజేసెడి। దేశికుడే ముఖ్యుడనుచు తెలుసుకోవోయీ॥ కనియతగాణ్ణికలుసుకోవోయీ ॥ చేసినద యతోనీయాశ సంపూర్తిల్లు। వ్రాసైతె వేసుకొచూచేవుతరువాత తెలుసుకోవోయీ॥ కనియతగాణ్ణికలుసుకోవోయీ॥—౨౪౯॥

తా॥ శిష్యా! లోకమునవాసి మొదలగు అష్టాంగలక్షణముల నభ్యసించినవారి మనోద్వృద్ధమునకుం దగినటుల భావములనుయిచ్చునట్టి యా దేశికోత్తముని జేరి, యతనివలనం బోధగైకొనిన, తనయిష్టముపూర్తిల్లును, అంతవరకు వ్రాసియుంచుకొనుమని భావము.

ప॥ మంతనమున గురుబోధను। యెంతోవింతనుచునమ్మితింతే గదయే। వింతలుగనరావనిధా। వంతమునొంచెటివాని బ్రతుకంతకంతే॥ చింతలు లేనిగతిగానడంతే ॥ అంతకంతకు వానికతిచాదస్తమేగాని। సంతకూటముతోటిసంభోగించెడు వాని బ్రతుకంతకంతే॥ చింతలు లేనిగతిగానడంతే॥ —౨౫౦॥

తా॥ శిష్యా! కొచ్చితపురుషుడు, అకటా యచలబోధయందు మిగుల వింతలుండునని యోచించివచ్చి చేరితిని. యే వింతలును గనుపించలేదు, యిది యేమి మార్గమని దుఃఖాత్మయైనవాని బ్రతుకు అంతే గాని అంతకుపైన లేదు, మిగుల చాదస్తుడై యుండును, అట్టివానికి నరకము తప్పదు, స్వకాంతకూటమును విడిచి పరస్త్రీకూటమును బొందిన వాని బ్రతుకెంత హీనమో, అంతటిహీనుడు, యే దుఃఖములును లేని యచలపరిపూర్ణభావమును బొందనేరడని భావము.

ప॥ తనగురుబోధను తాజదివి। వినవినుజనవితతిమదికి వింతయియీబోధను నేర్పకున్న వ్యర్థము। జననంబనితో చిశరణుశరణనునట్లూ॥ వెంటనెవారుదరిజేరునట్లూ॥ ఘనమైనయుక్తిజేకొనువా

డె శిష్యుడు। అనుమానమేమియుగనరాదువినరాయీశరణనున ట్లూ*వెంటనెవారుదరిజేరునట్లూ॥ ౨౫౧॥

తా॥ శిష్యా! తనగురునియొక్క బోధనుతాజదివిన, వినునట్టిజన సమూహముయొక్క మనంబులకునిష్టముగా, యీయచలబోధనుబోధిం చకుండినవ్యర్థము, జననమరణములకుభయపడి శరణుశరణనివేడిన వారుదరిజేరునటుల, మహాశ్రేష్ఠమైన యచలబోధయనెడుయుక్తిచేత, శిష్యునిసంశయములు దీర్పవలయుననిభావము.

ప॥ తనభార్యరూపురేఖలు। తనపుత్రులసద్గుణములుతనసం పదయుం।దనపెరటిచెట్టుమందును।తనగ్రామపుసాధుజనులుతన కుమెప్పౌనా*యీయిలలోనెంతటివారికైనా * వినలేదసీవాహ ల్యనుజూచిమోహించె । ఘనవాహనుండుచక్కనిభార్యగలిగుం డితనకుమెప్పౌనా*యీయిలలోనెంతటివారికైనా॥ ౨౫౨॥

తా॥శిష్యా! యీలోకముననెంతటివారికైనను, తనభార్యయొ క్కసుందరమును,తనపుత్రులసద్గుణములును,తనసంపత్తును,తనదొడ్డియ ందుండెడుచెట్టుమందును, తనగ్రామమందుండెడుసాధువులునుతనకుమె ప్పుగానుండదు, అదియెట్లనగా= దేవేంద్రుడుతనకుదివ్యసుందరియైనభా ర్యగలిగుండియును,గౌతమమహాఋషిభార్యయైనఅహల్యాదేవినింజూచి మోహించిమిగులకష్టములనుభవించినటులనీవువినలేదాయ నిభావము.

ప॥ జతనముగదాచిచదువుము । రతనమ్ములహారమిదియుర సికులగళమా । యతనముదీనికినేబహు। యతనముగావించిశె చ్చియిస్తిరనేదూ * బోధకుబందోబస్తూరచూడూ * రతనాలె ల్లారాళ్లురతనాలంచనియంటే । రతనాలీపద్యాలేరసికులెటిగె దరివీనికిస్తిరానేదూ * బోధకుబందోబస్తూరచూడూ॥ ౨౫౩॥

తా॥ శిష్యా!లోకమునభక్తియోగజ్ఞానులకుయీయచలభావము చక్కగాబోధపడుటకై బహుప్రయత్నముతో డయీపద్యములనెడుర త్నములహారమును, రసికజనులైనయశరీరులయొక్క మెడలోధరింపజే సితిని,వీటినిసంతనగాదాచిచదువుకొనుడు, రాళ్లురత్నములుగావుయీప ద్యములేజీవరత్నములనిభావము.

ప॥ విననేర్చిచెప్పనేర్చిన। మనుజులకేదీనిలోనిమర్మముదెలు
సుగా। వినజెప్పనేరకుండిన। మనుజులుయీబోధలోనిమర్మమె
ఱిగేరా * దీనంపుండెధర్మమెఱిగేరా * జనులేకొబ్బరికాయతి
ననేర్పుగలవారు। తినవచ్చునాకోతితనకాకాయబ్బినమర్మమెఱి
గేరా * దీనందుండెధర్మమెఱిగేరా॥ ౨౫౪॥

తా॥ శిష్యా! యీపద్యములనువిననేర్చినవారికిని, చదువనేర్చిన వారికిని, యీపద్యములయొక్కమర్మములు దెలియవచ్చునేగాని, యితరులకునీటియందుండెడుధర్మము తెలియఁగబడవు, అదియెట్లనగా, టెంకాయనుదినుటకుమనుజులకేసాధ్యపడునుగాని. కోతికియా టెంకాయలభించినను దానికిందినుటకుసాధ్యపడనేరదనిభావము.

ప॥ తానెంతలెస్సజదివిన । దీనినిదెలియంగగలడె దేశికవ
ర్యుం। బూనికసేవించనియెడ। మానవులదియెట్లటన్నమరిఘన
వోయీ * నామాటందుమనసుంచవోయీ * వానకాలము
లోనివర్షముయొక బిందు।నైనమింటనునిల్వదనినిశ్చయమేకా
దమరివినవోయీ * నామాటందుమనసుంచవోయీ॥ ౨౫౫॥

తా॥ శిష్యా! తామెంతచక్కగాజదువనేర్చినను, దేశికస్వాములవారిని సేవించివారికటాక్షమునుబొందకుండినయెడల, యీపద్యములయొక్కమర్మములను దెలియజాలరు, నామాటనీమనంబుననుంచుకొనుము, వానకాలమందలివర్షబిందువులలోనొక్కటియైననుమింటియందునిల్వకుండుటసత్యమేననిభావము.

ప॥ నన్నాశ్రయించినావని। యన్నా యీబోధనీకునతుకు
టకొఱకై। యెన్నోయుక్తులుజెప్పితి। విన్నావాదినినీవువిడువ
కెప్పటికీ * నాయాజ్ఞనుగడువకెప్పటికీ * నన్నునీవునినునేనన్న
వేళెట్టిదో। నన్నీవువిడలేవునేనిన్నువిడలేనువిడువకెప్పటికీ *నా
యాజ్ఞనుగడువకెప్పటికీ॥ ౨౫౬॥

తా॥ శిష్యా! నీవునన్నుయాశ్రయించుటనుబట్టి యీబోధనీకుజక్కగాబట్టుటకొఱకైయనేకయుక్తులనుజెప్పితిని, నీవుయెన్నటికినిమరువవలదు, నాయాజ్ఞకుమించవలదు, నీవునన్నును, నేనునిన్నునుజూచినవేళయెటువంటిదో, నీవునన్నువిడజాలవు, నేనిన్నువిడువజాలననిభావము.

ప॥ పతియైననుసతియైనను। అతిసాహసపరులుగాకయాం తర్యమునర్ణ। రతివేళలజ్జపడసం। తతికలుగదుచూడుమట్లతగదు లజ్జింపా*గురుశిష్యులకట్లతగదులజ్జింపా* మదిననీవిట్లనమ్మతిజేసి యేయేసం।గతినన్నడుగుముబోధస్థితినీకుదృఢపరతుతగదులజ్జిం పా*గురుశిష్యులకట్లతగదులజ్జింపా॥ —౨౫౭॥

తా॥ శిష్యా! పురుషుడైనను స్త్రీయైనను, అతిసాహసముచేత రతియుపరతులు సలుపక సిగ్గుపడినయెడల సంతానము కలుగనేరదు, అటువలెనే,గురుశిష్యులులజ్జపొందుట కూడదు, గనుకనీవుసంతోషము తోనన్ను యేమేమియడిగిననువాటినిందెలియపరచినీకుయీబోధచక్క గాదృఢపరతునని భావము.

ప॥ రతికొఱకుగాదెసతిపతి। కతిహితమతిసేవసేయునటువలె బోధ। స్థితినీకుకుదురుటస। మ్మతితోగురుసేవసేయుమానీతిమం తా*అభిమానముపోనీతిమంతా*అతనికిదయవచ్చెయారనిమిష మునబోధ। స్థితినీకుకుదిరించుసిగ్గువిడిచికొలువుమానీతిమంతా* అభిమానముపోనీతిమంతా॥ —౨౫౮॥

తా॥ శిష్యా! భోగముకొఱకుగదా స్త్రీలు పురుషులకుహితులై పరిచర్యలుచేయడము, అటువలెనే యీబోధనీకుకుదురుటకొఱకు గురుసేవచేయుము, నీకునీతియును మంచి బుద్ధియును గలిగి, అభిమానము విడిచిపోవును, నీవుసిగ్గువిడిచి గురుసేవ జేసినయెడల, సద్గురునకు దయవచ్చి నిన్ను నిమిషములోపల పరిపూర్ణునిగా జేయునని భావము.

ప॥ నీమానసమునసంశయ। మేమాత్రమునిల్పబోకుమికనా తోడె।నామాటనిశ్చయమునే। నేమాత్రముదాచలేదునీతోడును మ్మా* యింతకుమిక్కిలికలేదులెమ్మా*నామీదతలపుంచిననుమ రువకికనేను। నీమీదదయయుంతునిజమిందుకేవట్టునీతోడును మ్మా*యింతకుమిక్కిలికలేదులెమ్మా॥ —౨౫౯॥

తా॥ ప్రియశిష్యా! నీమనంబున లేశమైన సంశయ ముంచవలదు, నాయందాన, నేను యేమాత్రమైనను దాచి చెప్పలేదు, నీయందాన, యింతకుమిక్కిలిలేదు, నన్నునీవు మరువవలదు, నేనిన్ను మరువను, మనకిరువురకు నిదియేప్రమాణమని భావము.

నాగురుబోధనునీచే। బాగుగవినినిందసేయుభ్రష్టులమాట॥
ల్లోగానివిడిచెదవిదినీ। కేగురుడీలాటిబోధనెఱిగించడోయీ ✱
యెఱుకలోదినెఱిగించునోయీ ✱ ఆగురుబోధలనన్నిటినెఱిగుం
డి। నాగురుబోధనేనయముగనీకిస్తినెఱిగించడోయీ ✱ యెఱు
కలోదినెఱిగించునోయీ॥ ౨౬౦॥

తా॥ శిష్యా! నాగురునియొక్క బోధనునీవలనవినినిందచేయున ట్టిభ్రష్టులమాటలువినినీవుభ్రమపొందకుము, యేగురుడునునీకిటువం టిబోధనుయెఱిగించడు, యెఱుకలోనిమార్గములనుయెఱిగించును, యె ఱుకలోనిమార్గములయందు వర్తించెడుయనేకగురువులయొక్క బోధల న్నియునేనెఱింగియు, వాటినినీకివ్వక,నాగురునియొక్క నిజమైనబోధనే నీకునిచ్చితినని భావము.

ప॥ నిక్కముగబీరపీచుల। చిక్కుసుమీవిచ్చరాదుఛీయీ
యెఱుకకు। మక్కువనేబోధించిన। చక్కనిబోధాగ్నిచేతసా
ధించుపోరా ✱ విచ్చెనుచింతచాలించుకోరా ✱ చొక్కపుయీ
బోధకెక్కడికీడౌను। తక్కినబోధలదిక్కుచూడకుదీనిసాధించు
పోరా। విచ్చెనుచింతచాలించుకోరా॥ ౨౬౧॥

తా॥ శిష్యా! యెఱుకమార్గములునిజముగా బీరకాయపీచువ లెమిగులచిక్కుగానుండును, ఛీఛీ, అట్టిచిక్కువీడదీయుటవలనమాయ కేకారణము,ప్రేమతోనేనుబోధించినబోధాగ్నిచేతపరిపూర్ణమునుసాధిం చుము, నీచింతలన్నియును బాసిపోవును, యేబోధలునుయీబోధకు యీడుగావుగనుక తక్కినబోధలనువిడువుమని భావము.

ప॥ అడవియుసిరికెయుజలనిధి। బొడమినలవణంబటంచు
బాగడినరీతిగ। పుడమినియీస్థలమందున। కడువేడుకనీవు
నేనుగలయుటవినరా ✱ నీనాప్రేమగలసెకన్గొనరా ✱ విడవు
నీవునన్నువిడలేనునేనిన్ను। కడువేడ్కనీవునెక్కడబోకనిలచిట్లు
గలయుటవినరా ✱ నీనాప్రేమగలసెకన్గొనరా॥ ౨౬౨॥

తా॥ శిష్యా! అడవియొక్కయుసిరిగకాయలకును। సముద్ర మునందుపుట్టిన వుప్పునకునుసంబంధము కలిగిరుచిపుట్టినటులమనమి రువురమునీస్థలమందునగూడితిమి, నేనిన్నువిడుచుటలేదు, నీవునన్నును

విశువవు, నీవు యెందును బోకనిలిచి విచారణ చేసినయెడల నీవు నా ప్రేమ యొక్క నిజస్థితిని గనుగొందువని భావము॥

ప॥ పెద్దలనిందనొనర్పకు । పెద్దలసేవించుకొంటకు పిరిదివియకుమే । పెద్దలతో వాదించకు । పెద్దలుచెప్పేటిమాట పెడచెవులవినకూ * పెద్దలునడిచేనడతనేమనకూ * పెద్దలకన్న నేపెద్దనంచనుకోకు । పెద్దలగనుగొన్న ప్రియముతో మ్రొక్కుము పెడచెవులవినకూ* పెద్దలునడిచేనడతనేమనకూ॥ ౨౬౩॥

తా॥ శిష్యా ! పెద్దలనునిందచేయకుము, పెద్దలను సేవించుటకు వెనుకదీయకుము, యే పెద్దలతోను వాదించకుము, పెద్దలు చెప్పెడు మాటలను శ్రోత్రముల కానందముగా వినుము, పెద్దలునడిచేనడతలు తప్పని భావించకుము, పెద్దలకంటెను నేను బెద్దవాడనని తలంచకుము, పెద్దలనుజూచినప్పుడు వెంటనే సాష్టాంగపడి నమస్కరించుమని భావము.

ప॥ పెత్తనమున నేనుంగిల । జెత్తనుదినవలసె జీమచిన్నతనముననే । హాస్తుకొనిదినునుచక్కెర । నిత్యిటినీ రెంటినీకు నిష్టమైతే * చేకొనుమదెస్పష్టమైగతే * పెత్తనమునజేటు పెంపొందుమందును । చిత్తములో దెలియుచిన్నతనమె మేలుయిష్టమైతే * చేకొనుమదెస్పష్టమైతే॥ ౨౬౪॥

తా॥ శిష్యా ! పెద్దతనముగల యేనుగు భూమియందుకసువుదినవలసివచ్చెను, చిన్నతనముగల చీమ చక్కెరనుదినవలసివచ్చెను, యీరెంటిలో నీకు యేదియిష్టమైతే యటులజేయుము, విచారించగా, పెద్దతనముచేత చేటుకలుగుటకు సందియములేదు, నీచిత్తమున చిన్నతనమే మిగుల శ్రేష్టమని, సుఖకరమని తలంచుమని భావము.

ప॥ తననుశరణన్నవారల । మనసెట్టిదో తలచిచూచి మతిదెల్పదగుక । వినువారికిదగినట్టిది । యనిరిట్లుమహానుభావులతిచాతుర్యమునా * వికాసముగనతిచాతుర్యమునా * ఘనమయిన యీబోధకరుణనిచ్చితిదీనిజ। చ్చినదనుకనిదురవచ్చెసదాకి మరువకుమతిచాతుర్యమునా * వికాసముగనతిచాతుర్యమునా॥ ౨౬౫॥

తా॥ శిష్యా ! తనకుశరణనినమస్కరించినవారియభిప్రాయమును దెలుసుకొని, వారిమనస్సునుజక్కగాశోధించి వారియభిప్రాయ

ములకుందగినటుల భావములివ్వవలయునని పెద్దలు మిగులచాతుర్య ముగాబలికిరి, మహాశ్రేష్ఠమైన యీబోధనుకరుణతోనీకిచ్చితిని. నీవు జచ్చునంతవరకునునిదురవచ్చునంతవరకును దీనినినీవుమరువవలదు, పెద్ద లుసంతోషముతోచాతుర్యముగా బలికిరని భావము.

ప॥ చెప్పదగుగురుడుబోధను । జెప్పినపనిజేసెనేనిశిష్యా గ్రణికిఁ । జెప్పదగుంజెప్పినపని । తప్పనివాదించెనేనిదయదల్చి బోధా *యిద్దరికుండదగదట్టివేధా * చెప్పిముందుగబోధచెప్పె డిపనులెన్ని । జెప్పగూడదువానితిప్పలుబెట్టకదయదల్చిబోధా* యిద్దరికుండదగదట్టివేధా॥ ౨౬౬॥

తా॥ శిష్యా ! సద్గురుడుతనయాజ్ఞ ప్రకారమునడిచే శిష్యునకు యీబోధజెప్పవలయును, తానుజెప్పిన మాటతప్పని జెప్పిన యాశిష్యు నియందును దయగఃవాడై వానికిబోధించవలయును, ఆగురుశిష్యులిద్దు వురకుమనోవేధనలుగలిగియుండకూడదు, జెప్పదగనిపనులుజెప్పియాశి ష్యునికష్టపెట్టకూడదనిభావము.

ప॥ ఇవివినుమనినసుజనులు । చెవియొగ్గదరివియునుష్టుజేసి కృతికిబల్ । చవిబుట్టింతురదెల్లన । శివుడుకళానిధినిజక్కజేసె నలేదా *నీమదిశంకబాసెనలేదా*అవనిలోశ్రీరాములవగుణి నాహల్య । నెవరేమియనకుండసవరించినుగుణిగజేసెనలేదా * నీమదిశంకబాసెనలేదా॥ ౨౬౭॥

తా॥ శిష్యా ! యీపద్యములను వినుమనిజెప్పిన సుజనులు విందురు, వారికిజక్కగాగుచిపుట్టునటులసవరణగా జదువవలయును, అదియెట్లనగా, శివుడుచంద్రునితనశిరస్సునంధరియించి, గురుభార్యనుం బొందినదోషమునుహరింపంజేసిజక్కపరచినట్లుగాను, యిదిగాకయీ లోకమున శ్రీరామచంద్రుడు, దుష్టగుణముగలిగిన, అహల్యనుయెవరే మిప్రార్థించకనే, రాతినినాతిగాను, సుగుణిగానుజేసినటుల, గురుడుశిష్యు నిపావనునిగాజేయును, నీమనోశంకలనువిడువుమనిభావము.

ప॥గురుసూచనైననరులను।మరిమరివినుమనుచుజదువుమాం పద్యములఁ । గురుసూచనయెటుగనియా।నరులనువినుమనుచు జదువనగుబాళాగదరా *అదియెట్లన్ననికనేదెల్పెదరా*పురుష

సంగతిలేనిపాలతికోకిలకశాస్త్ర। మరసిమెచ్చునెదానినతిప్రౌ
ఢసతివలెనగుబాటాగదరా॥అదియెట్లన్ననికనేదెల్పెదరా॥ ౨౮॥

తా॥ శిష్యా! అచలబోధసూచనైనవారియొద్దనాపద్యములను వినుమనిమరిమరి చదివివినుపించవలయునేగాని, గురుసూచనలేనివారి యొద్దనాపద్యములనుజదివినపరిహాసమగును (అదియెట్లనగా) నేజెప్పెద నువినుము, పురుషసాంగత్యమెఱుగనిమాచకమ్మకుకళాశాస్త్రమునువినుపించినయదిమెచ్చుకొనదు, ప్రౌఢస్త్రీలుయాకళాశాస్త్రమును మెచ్చుకొనిమిగులసంతోషింతురని భావము.

ప॥ ఎవరున్ననేమిభయమని। సవరింతురుదప్పులున్నసాధులు
వినిన౯। సవరింతురునుష్టువిని। యవినీతులునిందజేయనయ్యే
దేమోయీ॥అందులోమనదిపోయ్యేదేమోయీ॥ భవనాశస్థితి
లేనిపద్ధతియీబోధ। సవురుగవినుపించుచాటలమాటలనయ్యే
దేమోయీ॥అందులోమనదిపోయ్యేదేమోయీ॥ ౨౯॥

తా॥ శిష్యా ! సాధువులు, యెవ్వరుండిననుభయపడకతప్పులను సవరింతురు, దుష్టులువినివాటినినిందింతురు, అందువల్లనయ్యేదేమి, అందువలనమనదిపోయ్యేదియేమి, చావుపుట్టుకలులేని యీయచల మార్గమునుదాచకబాహాటముగా వినుపించుమని భావము.

ప॥ పుట్టింటబిడ్డబహుగా। దిట్టయియుండిననునెవరుదిట్ట
రుభువిలో। బుట్టింటివారికోడలు। దిట్టయిననుయత్తవారుదిట్టే
రుసుమ్మీ॥ చేతులకొద్దికొట్టేరుసుమ్మీ॥ అటువలెనేబహుదిట్ట
యినశిష్యుని। తిట్టడుగురుమూర్తివట్టివారుచాలతిట్టేరుసుమ్మీ॥
చేతులకొద్దికొట్టేరుసుమ్మీ॥ ౩౦॥

తా॥ శిష్యా! పుట్టింటియందలిబిడ్డదుడుకుగానుండిననుయెవరున్న తిట్టరుకొట్టరు, కోడలుతుడుకుగానుండినయెడల అత్తగారుదిట్టుదురు, చేతులకొద్దికొట్టుదురు, అటువలెనే, దుడుకుగలశిష్యునిగురుడుదండించకుండును, యితరులుదిట్టిచేతులతోగొట్టుదురని భావము.

ప॥ అందముగఘనులుమెచ్చెద। రెందుకుమెచ్చెదరుదీనినితర
జనంబుల్। చందురుడుదయంబందిన। సింధువుచెలరేగినట్లుచెల
గునెచెరువుల్॥కోనేర్లుబావులునూతులుయేర్లుల్॥మందయాన

లఁబొందుమగవారెనుతిజేతు। రెందుకనుతిజేతురిలఁషండపురుష
లుచెలగునెచెరువుల్ * కోనేర్లుబావులునూతులుయేరుల్ ॥ ౨౧॥

తా॥ శిష్యా! యీయచలపరిపూర్ణబోధనుగొప్పవారుమెచ్చును
కేగాని, అల్పులుమెచ్చరు, చంద్రోదయముకాగానే, సముద్రుడుపొం
గునేగాని, చెఱువులును, కోనేర్లును, దిగుడుబావులును, యేర్లునుయీపొం
గవు, అటువలెనే స్త్రీలతోసుఖంచెదుసుఖానందమునుపురుషులేనుతింతు
రుగాని, (షండపురుషులుఅనగానపుంసకులు)యేలనుతింతురని భావము.

ప॥ కాకింబులుసంపూర్ణత । టాకస్థజలంబులెల్లద్రావక
తృషచే । గ్రక్కొనునొకుంభజలమ । ట్లీకలియుగమందుదుష్టు
లింపుమీరగనూ * నిల్వాదుబోధకంపుబారిననూ * మీకుదీని
కెలంకెమీకేలయిట్టిచీ । కాకుచొక్కడమైతెగ్గె కొందుమందు
రుయింపుమీరగనూ * నిల్వాముబోధకంపుబారిననూ॥ ౨౨॥

తా॥ శిష్యా ! కాకులుసంపూర్ణముగా జలములుండెడుతటాక
ములలోనిజలమును, దాహముదీర్చుకొనుటకుపానముచేయక, కుంభ
ములలోనుండెడుమురికినీళ్లనుద్రావుచున్నవి, యిదేప్రకారము, యీక
లియుగమందుదుష్టులుపరిపూర్ణభావమునుబొందనేరక, మిగులనీచమైన
యభ్యాసమార్గములననుష్టించి, తాముసర్వముతెలిసినవారివలెగర్వము
తోపరిపూర్ణభావజ్ఞులనునిందింతురు.అట్టిఅజ్ఞానులయొక్క విపరీతభావము
లనుగురించిమనకేలననిభావము.

ప॥ కుచ్చితమతియగుపురుషుని । జెచ్చెరవినుమనుచుజదు
వసిష్టులవలెదా । ముచ్చటపాటుగవినడివి । కుచ్చులకుళ్లాయి
కుక్కకూనకెందుకురా * పిదుదుకుదుగ్ధపానమెందుకురా * హెచ్చ
యినముత్యాలపచ్చలప్రతికము । గ్రుచ్చిపేరుగజేసితెచ్చిశేసితె
కోతికూనకెందుకురా * పిదుదుకుముగ్ధపానమెందుకురా॥ ౨౩॥

తా॥ శిష్యా ! యీయచలబోధనువినుమనివినుపించినను,కుచ్చి
తమతియైనపురుషుడులోకులవలెతానుముచ్చటగావినడు,అదియెట్లనగా
కుక్కపిల్లకు సరిగెకుచ్చులకుళ్లాయిధరియించుటవ్యర్థమేగదా, కుక్కల
యొక్కరక్తమునుద్రాగెడుపిదుదుకుపాలుద్రాగించుటవ్యర్థమేగదా,యి
దియునుగాక, మిగులవెలగలముత్యాలహారమునకుమంచిపచ్చలప్రతిక

మొగూర్చి,కోతిపిల్లమెడలోధరింపఁజేయుచుటవ్యర్థమేగదా,అటువలెనేదుష్టులుమిగులశ్రేష్ఠమైనయీయచలభావమును, అలక్ష్యముగాఁజూతురనిభా.

ప॥ అక్షయబోధస్థితిగల । లక్షణవేత్తలకుమెప్పులైనకృతు
లతో । కక్షకుతప్పులఁకుమతిప । రీక్షింపుచునుండునెన్నో రీతుల
వినుమీ॥ తద్భావమీరీతికనుమీ॥ మక్షికమెప్పుడుమానిసుగం
ధాదు। లీక్షింపువ్రణముప్రత్యక్షమేగదయెన్నో రీతులవినుమీ॥
తద్భావమీరీతికనుమీ॥ ౨౭౪॥

తా॥ శిష్యా! లక్షణవేత్తలైనపెద్దలుమెచ్చుకొనునటులఅక్షయమైనయీయచలబోధనుజేసితిని,దుష్టులుతమతంత్రములకానాటిపోగొట్టుకొన్నటులతప్పితములేవెదుకుచుందురు, అదియెట్లనగావినుము, ఈగలుమంచిసుగంధాదులమీదవ్రాలియాసుగంధమునుగ్రహింపక,దుర్గంధములైనపుండ్లమీదను, గడ్డలమీదనువ్రాలియాదుర్గంధమునేగ్రహించుటప్రత్యక్షముగాఁగనుపించుచున్నదని భావము.

ప॥ రమ్మనిబిలువనిదేప। ద్యమ్ములుజదువంగవచ్చియవినిం
దింతుర । సమ్మతిగాకకుమతివిని । యిమ్మహినదియెట్లటన్ననిట్ల
నెవినుమీ॥ వానిబుద్ధినిట్లనెకనుమీ ॥ బొమ్మలాటాడించుబొమ్మ
తానొకటిఛీ। పొమ్మనియనిహాస్యమ్మొనర్చినను బోకనట్లనెవిను
మీ॥ వానిబుద్ధినిట్లనెకనుమీ॥ ౨౭౫॥

తా॥ శిష్యా! రమ్మనిబిలువకనేదుష్టులుయీపద్యములనుజదువునపుడువచ్చియీపద్యములనునిందింతురు, యీలోకమునదుర్జనులప్రవర్తనలుయిట్టివనితెలుసుకొనుము, బొమ్మలాటలాడునపుడుహాస్యముచేయునట్టిబొమ్మనుఛీఛీపొమ్మనిఛీకొట్టినను,యెటులబోకుండునోఅటువలెనేదుర్జనులుపొమ్మనిప్రార్థించిచెప్పినను బోకనిందింతురని భావము.

ప॥ వటియించినచన్నులుగల । కుటిలాలినినిందజేయుగుత్త
ఫురవిక ! యెటువలెతనతప్పెఱుఁగక । నటువలెగ్రంథమును
మెచ్చడతిదుర్జనుండు॥ లేనితెతప్పులెదుకుచునుండు॥ యిటువంటి
బోధనేనెతీగేదెట్లనుకోక । కటువాక్యములుబలికిఘనులఁగాసిల
జేయునతిదుర్జనుండు ॥ లేనితెతప్పులెదుకుచునుండు॥ ౨౭౬॥

తా॥ శిష్యా ! సుపిక్కించిన స్తనములుగలస్త్రీనిం జూచి, గుర్వు పురవిఁగలస్త్రీ తాననుకొద్దిదినములలోనటులయుగునని యోచించక పరిహాసముచేయుచుండును, అటువలెనే మూర్ఖనుడుయీగ్రంధమును మెచ్చక తప్పులెంచుచుండును, అకటా నేనెటులయిట్టిగొప్పబోధను గ్రహింతునని యోచించక, కఠినవాక్యములాడి పెద్దలనుల్లఘించునని భావము.

ప॥ గురువరమీనాసందున । యెఱుకను తెరగలిగియుండె నిన్నాళ్లనుదమ। కరుణార సేక్షణములం । దెరదీసితి రెఱుకమాట దీరెనిక్కడికీ॥చాలునుబోధదూరదెక్కడికీ ॥ పరిపూర్ణమునలేని యెఱుకనుజూపించి। యెఱుకలేదని యంటి రెఱుక లేదాయెనుదీరె నిక్కడికీ॥చాలునుబోధదూరదెక్కడికీ॥ ౨౭౭॥

తా॥ స్వామీసద్గురువర్యా, యిన్నిదినములు, దేవరవారిసందున నాసందునయెఱుకయనెడు తెరగలిగియుండెను, దేవరవారికరుణాకటాక్షముచేతనా తెరతొలగిపోయెను,యెఱుకమాట నేటితోదీరెను,పరిపూర్ణబోధయికచాలును, దేవరవారుయెఱుకనుజూపించి,యెఱుక లేదని సెలవిచ్చితిరి, అదేప్రకారముయెఱుక మాట నేటితోతీరిపోయెననిభావము.

ప॥ ధారుణిగొంతజరించివి । చారించితిగానియీవిచారము నేనెవ్వారలుజెప్పగవినలే । దారయమీనోటవిన్నానయ్యగురుమూర్తి॥తరమానుతిజేయమీకీర్తి ॥ సారసనేత్రపురారినీరజ బృందారకముఖులైన। నేరరుమిము దెలియనయ్యాగురుమూర్తి॥ తరమానుతిజేయమీకీర్తి॥ ౨౭౮॥

తా॥ స్వామీలోకమున నేనుచాలామట్టుకుతిరిగి,విచారణజేసితిని యెవరివల్లనుయిట్టిబోధనువినలేదు, దేవరవారివలనవిని తెలుసుకొంటిని ఆహా దేవరవారినినుతించుటకునాతరముకాదు,బ్రహ్మవిష్ణుమహేశ్వరులును,యింద్రాదిదేవతలునుమిమ్ముగీర్తించజాలరని భావము॥

ప॥ ఘటమెదుటబెట్టిచూపిన । యటువలెబయలుండజూపి యతిమాయలచే। నటియించుచున్న యెఱుకను । తృటిలోవిడిపిస్థిరిపుడుతీరెనాశంకా॥మదిబుట్టదుయేరీతినింకా॥ యెటుదోచకిలువెడలియటుమిమ్ముజూచిన। ప్పటినుండిదయజేసిప్పటిదాకబోధిస్తితీరెనాశంకా॥మదిబుట్టదుయేరీతినింకా॥ ౨౭౯॥

తా॥ స్వామీ! కుండయెదుటంబెట్టి చూపించినటుల యచలప రిపూర్ణమునుజూపించితిరి । అనేకమాయలచేతనటియించెడుయెఱుకను నిమిషములోపల విడిపింపఁజేసితిరి, నాసంశయము లన్నియును దీరెను, యికనుయేసంశయములునుబుట్టనేరవు, యశరీరుండనైతినని భావము॥

ప॥ ఒరులునేననకనుండిన। దెఱిగింపుమదేమొబయలుయే
నొరులంచుర్ । యెఱుకనునెవ్వరులేదనవలె। నెఱుకనుయున్నదని
యంటయదిలేదంచనుకో * నేనునినునీమదినిలేదనుకో * యెఱిగి
యీలేనెఱుకయట్లలేకుండితే। పరిపూర్ణమనుదాన్నేపగిదిగుర్తె
ఱిగేమయిదిలేదంచనుకో * నేనునినునీమదిని లేదనుకో॥ ౨౮౦॥

తా॥ శిష్యా! పరులనినేనని యనకయుండునదేయచలము, నే ననియును, పరులనియునుయెఱిగినదేయెఱుక, అదేలేనియెఱుక, నేనును నీవునులేనివారమనినీబుద్ధిచేతం దెలుసుకొనుము, యీలేనియెఱుకలే కుండినపరిపూర్ణమునుయెఱుగుటెట్లు, లేనియెఱుకలేనేలేదనిభావము.

ప॥ నాబుద్ధికిసరిపడ్డది।నీబుద్ధేగానియెన్నినేర్పులగనినర్ । ఛీ
బద్ధులయాబుద్ధులు। నాబుద్ధికిమెప్పురావునాతండ్రివినరా * శా
బాసునిన్నేతండ్రిగనెరా * యీబుద్ధినికమానకేబుద్ధిబూనకు ।
యేబుద్ధిబూనిననీబుద్ధిచెడిపోవునాతండ్రివినరా * శాబాసునిన్నే
తండ్రిగనెరా॥ ౨౮౧॥

తా॥ బిడ్డా! యెన్నివిధములయోచించిననునాబుద్ధికిసరిపడినదినీ బుద్ధియేగాని,ఛీఛీయెఱుకమార్గములయందువర్తించెడువారిబుద్ధులునా బుద్ధికిమెప్పురావు,నాతండ్రీ,శాబాసునిన్నుయేతండ్రిగనెను, యీబుద్ధిని విడువకు, యేబుద్ధినిబూనకు,యేబుద్ధిపూనిన నీబుద్ధిచెడుననిభావము.

కు॥ కొట్టితిదిట్టితిశ్రమలం । బెట్టితినీమనసుచెవులబెట్టకపెడ
చెవుల । బెట్టితిమొట్టితివెడలం । గొట్టితినీమనసుదెలియకోప
ములేకా * సరితెలిసితివోపికసోకా * పట్టుమిచ్చెదనింకనట్టేమి
లేదాయె । పట్టుమిచ్చెదబోధఘట్టివాడవురోరికోపములేకా *
సరితెలిసితివోపికసోకా॥ ౨౮౨॥

తా॥ బిడ్డా!నిన్నుతిట్టితినిగొట్టితిని మిగులబాధలుబెట్టితిని,నీమా టలువినకపెడచెవులబెట్టితిని, తలమీదమొట్టితిని, యిల్లువెడలంగొట్టి

తిని, కోపముచేతకాదు, నీమనస్సుశోధించుటకై యిన్నిబాధలుపెట్టితిని, ఆహానీశాంతమునుదెలుసుకొంటిని, నీవుమిగులబుద్ధిమంతుడవు, ఘట్టివాడవు, నీకుపరిపూర్ణబోధనిచ్చెదను, గ్రహించుమనిభావము.

ప॥ నీవెంతకొట్టితిట్టిన । నేవిడిచేవాడగానునీచరణంబుల్ । చావయినపెండ్లియయినన్ । నేవిడువనటంటివిఘట్టినిజభక్తుడా రా * నేగనుగొంటినీనిష్ఠలారా * కావుననీకిట్టిఘనమైనబోధను । వేవేగదయచేస్తినీవిదివిడువకునిజభక్తుడారా * నేగనుగొంటినీనిష్ఠలారా॥ ౨౮౩॥

తా॥ స్వామీ దేవరవారెంతకొట్టితిట్టినను, నేనువిడిచేవాడను గాను, మరణమైనను పెండ్లియైనను, మీపాదములయొద్దనే యనినన్ను విడువకుంటివి, ఆహానీవునిజమైనభక్తుడవు నేనునీనిష్ఠలను దెలుసుకొంటిని, నీకిష్టమైనయచలబోధనిచ్చితినిసాధించుమనిభావము.

ప॥ నానోటిమాటవెంబడి । తానెప్పుడుసంచరించెతగునీచిత్తం । బేనరిగనియీబోధని । ధానమునీకిస్తిదీన్నిదాసుకోసుమీ * నిత్యమునీవుచూచుకోసుమీ * యేనరుడైననిన్నీబోధనడిగితే । వానిమనసరయకవానికిదెల్పేవుదాచుకోసుమీ * నిత్యమునీవుచూచుకోసుమీ ॥ ౨౮౪॥

తా॥ శిష్యా! నీవునానోటిమాటప్రకారము, తప్పకవర్తించుటచేతనీచిత్తవృత్తినిందెలుసుకొని, యీయచలబోధనునీకిచ్చితిని, నీవుదాచుకొనిజూచుకొనుచుండుము, యేమానవుండైనను నిన్నుయీబోధనిమ్మనియడిగిన, నీవువానిమనస్సును శోధించకయివ్వగూడదని భావము.

ప॥ కన్నదివిన్నదిలేకను । యున్నదిపరిపూర్ణమనుచునూహానెటిగినన్ । కన్నదికన్నట్టేచను । నన్నరయగనెవ్వరున్నారామీదనడుగా * విన్నావాయున్నవారెవ్వరనగా * నిన్నుపోలికగానుకన్నులపండుగై । తిన్నగగలిగుండునిన్ననేతెరదీయనామీదనడుగా * విన్నావాయున్నవారెవ్వరనగా ॥ ౨౮౫॥

తా॥శిష్యా!కన్నదివిన్నదిలేక, ఉన్నదంతయుపరిపూర్ణమనినీబుద్ధిచేతనూహించినయెడల, చూచినదిచూచినట్టుగానేబోవును, విచారించగాపరిపూర్ణమునకంటెనుయేమిలేదు, నిన్నుపోల్చిచెప్పబడినదేగాని య

దిక్కన్నులపండుగగాగనుపించుచున్నది. నిన్ననెడుతెరదీసినవెనుకయున్న దంతయుపరిపూర్ణమేయనిభావము.

ప॥ లేనిజగమెఱుక లేదని। మానుగయిదిదెలసినపుడెమర్మ
ములేకర్ । గానంబడుబట్టబయలై। మానుగగలిగుండునెందు
జూచిననందూ * అందముగానుజూచినముందూ* అందుయిం
దనరాకయెందుజూచినబయలు। సందుసందులనిండిపొందశక్య
ముగాకజూచిననందూ*అందముగానుజూచినముందూ॥ ౨౮౫॥

తా॥ శిష్యా-లేనిజగత్తునుయెఱుకనులేవని తెలుసుకొనినప్పుడేమ ఱుగుమర్మములులేక పరిపూర్ణము ప్రత్యక్షముగాగనుపించును, అందు యిందనకయెందుజూచినను సందులేకపరిపూర్ణము నిండినిర్దేశించుటకు శక్యముగాక, సుందరముగా ముందుగాగనుపించుచున్నదని భావము.

ప॥ నమ్మునిజమ్ముగమనమున। ముమ్మాటికియెఱుకజోలిమూ
ర్ఖనకమదిర్ । నమ్ముమచలమ్ములెస్సగ।నిమ్మళముగనిల్చిచూ
డనీవునిల్వలేవూ * నమ్మకుమెఱుకయదినమ్మలేవూ * తమ్ముల
లోననిమ్ముగవెలిగేటి। తుమ్మెదయనినేనునమ్మబల్కితినమ్మునీ
వునిల్వలేవూ * నమ్మకుమెఱుకయదినమ్మలేవూ॥ ౨౮౬॥

తా॥ శిష్యా - నీవునిజముగానీమనంబుననామాటనునమ్ముము, ముమ్మాటికియెఱుకనుదలచవలదు, నిన్నునీవునిదానించిచూడగా, నిలువకపారిపోదువు,కమలములలో(శ్రేష్టమైనసహస్రా)రకమలమునందువెలిగెడుతుమ్మెదవంటిఆపోజ్యోతియేనీవనిజెప్పితిని,నీవేసచ్చిదానందమూర్తి, నిన్ను నీవునమ్మవలదు, అచలపరిపూర్ణమునే నిజముగానమ్ముమనిభావ.

ప॥ తెలవారెనుయికజన్మము। కలయయ్యెజగంబులెల్లగను
గొనుచుండర్ । కలమేలుకొన్నపిమ్మట। నిలువగలేదయ్యెయెఱు
కనిక్కముసుమ్మా * నమ్మినదానినీవికనమ్మా * యెక్కడజూ
చినపిక్కటిల్లుచుబయలు ॥ మక్కువగలిగుండుదిక్కులనంతట
నిక్కముసుమ్మా * నమ్మినదానినీవికనమ్మా॥ ౨౮౭॥

తా॥ శిష్యా తెల్లవారెను, జన్మముకలవంటిదాయెను. మేలుకొ నినపిమ్మట జగములన్నియుకల్లలాయెను, యెఱుక నిల్వక పారిపోవుట యేసత్యము, నేనునమినయచలమునే నీవునునమ్ముము, నమ్మినవారికిని

శనములేదు, యెక్కడజూచినను పరిపూర్ణముపిక్కటిల్లుచు దిక్కులం
టనునిక్కముగానున్న దిజూడుమనిభావము.

ప॥ ఖండాఖండమునొందక । నిండినపరిపూర్ణమెఱిగినెరియె
ఱుకనుదా। ఖండించిచిజ్జడంబుల।దండిగపరిపూర్ణమెఱుగనుండే
వారెవరూ॥మండితముగనునిండేవారెవరూ॥ యెండలోపలను
న్నదండిచీకటిచాటు । మొండిదేహములేకనుండునట్లనెజూడు
నుండేవారెవరూ ॥ మండితముగనునిండేవారెవరూ ॥౨౮౯॥

తా॥ శిష్యా! ఖండాఖండములనుబొందక, సర్వమునిండినపరిపూ
ర్ణమునుయెఱిగి(చిత్స్వరూపమైనయాత్మగాను,) జడస్వరూపమైనశరీ
ముగానుగల,యాయెఱుకనుఖండించినపిమ్మటనిండినపరిపూర్ణమునెఱు
గుటకునుండేవారులేరు, అచలమేసర్వమునిండియుండును,యెండయంద
చీకటిదాగియున్నటుల, మొండిదేహములులేకుండజూడుమనిభావము

ప, ఇదిమర్మమనుచునెఱుగక । విదితజ్ఞులమనుచుననెడువే
త్తలమాటల్ । మదిలోనిల్పకుమంత్రము । మదిలోమరచుండ
బోకుమాబోధరీతీ ॥ నిశ్చలముగనిలుపువిఖ్యాతీ ॥ ఇదియది
యనియెఱుకయెప్పుడుగలిగి । తేదప్పకుమీబోధదైవమనెడుజ్ఞ
ప్తిమాబోధరీతీ ॥ నిశ్చలముగనిలుపువిఖ్యాతీ॥ ౨౯౦॥

తా॥ శిష్యా! యీపరిపూర్ణభావముయొక్క మర్మమునుదెలియ
నేరక, మేముపెద్దలమని, వేదాంతవేత్తలమనిజెప్పెడుమాటలను నీవు
నమ్మిననుంచవలదు, నేనుబోధించినమంత్రమును నీమనంబునమరువవ
లదు.నిశ్చలచిత్తముతోలోకమునప్రఖ్యాతిబొందుము,యిదియదియని
యెఱుకనుదలచక, సదా దేవుడనేజ్ఞప్తిగలిగియుండుమనిభావము.

ప॥ కలవంటిదియెఱుకనుతన । కలలోపలనైనగానిగానగ
బోకే । కలమేలుకైనపిమ్మట । కలయనిజూడకుమునీవుకాం
క్షలులేకా॥యెన్నడునీవాకాంక్షలబోకా॥కాంక్షాకాంక్షలరెం
టికలనైనదలచక।కాంక్షలుగలయెఱుకకాలిపోయినవెనుకకాం
క్షలులేకా॥యెన్నడునీవాకాంక్షలబోకా॥ ౨౯౧॥

తా॥ శిష్యా! కలవంటిదియైనయెఱుకను, తనకలలోనైనజూచు
టకుప్రయత్నముచేయకూడదు, కలగనిమేల్కనినపిమ్మటయీకలయంద

లిప్పాటినింజూచుటలేదు,నీవెన్నడట్టియిష్టాయిష్టములరెంటినినీవు కలలో నైనదలచవలదు,కోరికలుగలయెఱుక కాలిపోయినవెనుక, పరిపూర్ణము నందుయే(భ్రాంతులును లేవనిభావము.

లేనివిద్యైజగమెఱుకలు । మానసమునసత్యమట్లమానకతో చుఁ । లేనివిలేకనుజూచిన । తానన్నదిలేకబయలు తానేయై యుండు* తెలివిలో తెలివి తెలివిలేకుండు * అలసినతెలసినకల సినమెలసిన । వలసినయదివెల్లివిరిసినరీతిని తానేయైయుండు * తెలివిలోతెలివితెలివిలేకుండు॥ —౭౯—౨॥

తా॥ శిష్యా! లేనివిద్యైనజగత్తుయును, యెఱుకయును, మనస్సు నకుసత్యముగానేదోచుచుండును, యీరెండునులేనివనిదృఢపడినయెడ లతానుతానన్నదిలేదు, అంతటనుయీబయలేయున్నది, తెలివిలో తెలివి లేకనేయున్నది, అలసినను, తెలిసినను, కలసినను,మెలసినను,వలసినను, ఆపరిపూర్ణము (వెల్లివిరిసినటులయనగా=సర్వమునిండినదై యున్నది) తె లివిలో తెలివి,శుద్ధతెలివియనెడు కళాస్వరూపము లేనేలేదనిభావము.

ప॥ మాటలకుదురునులక్ష్యము । మాటలచేచెడునుగురియు మర్మమెఱిగినఁ । మాటలులేకనుబయలే । మాటకువకచాటు లేకమరియుండునన్నా*చూపులచేతచూడరాదన్నా* రేపుమా పునులేదు(ప్రాపుదాపునులేదు। ఆపదసంపదయనిశములేనిదిమరి యుండునన్నా*చూపులచేతచూడరాదన్నా॥ —౭౯ ౩॥

తా॥ శిష్యా ! మాటలవల్లనేలక్ష్యముకుదురును, మాటలచేతనే గుఱుతుగలయెఱుకచెడిపోవును, యీమర్మమెఱిగినపరిపూర్ణమునకుయే మాటలునుచాటునులేకనిండియున్నది, చూపులనెడుఆపోజ్యోతులచేత చూడరాకయున్నది, రేపుమాపులును(దగ్గిరదాపులునులేక, యేకాల మందును,సంకటములుగాని,సంపత్తునుగానిగలిగియుండక, యొకటేవిధ ముగానున్న పరిపూర్ణమునునిర్దేశించిచెప్పుటకుసాధ్యముకాదనిభావము.

ప॥ తరమాపరిపూర్ణముగన ।గురుకృపలేనట్టినరులుగుఱుతు లిడుటకై। పరమార్థమెఱుగశక్యమె । గురుకృపచే దెలిసెనేని గుఱుతుండదయ్యా*మరుగెఱిగినమరినిల్వదయ్యా*మరుగుదెలి

సినమీఁదమఱియెఱుక తాఁబోవు । మఱుగుచేత నెబహుమాయల
బెట్టునుగుఱుతుండదయ్యా * మఱుగెఱిగినమఱినిల్వదయ్యా॥ ౨౯౪॥

తా॥ శిష్యా! గురుకటాక్షమును బొందనిమానవులు పరిపూర్ణమును దర్శించుటకును, గుఱుతువిడుచుటకును శక్తులుగారు, గురుకటాక్షమును బొందినవారికే గుఱుత్తువిడిచిపోవును, పరిపూర్ణమును దర్శించిన యెఱుక పాఱిపోవును, పరిపూర్ణమును దర్శించనివారిని యెఱుక బాధలు పెట్టునని భావ.

ప॥ ద్వయదోషరహితమగుచును। ద్వయదోషముపొందబోక ద్వ
యశూన్యుడవై। ద్వయమద్వయములుగాకను। ద్వయమద్వయమ
నెడియెఱుక దగులక తానూ * మిగులుటలేక వగపును మానూ * పగ
లు రాత్రులుగాక పరిపూర్ణమై బయలువె! లుగక మలుగక తొలుగ
క నలుగక దగులక తానూ * మిగులుటలేక వగపును మానూ॥ ౨౯౫॥

తా॥ శిష్యా! ద్వయదోషరహితుండవై, ద్వయదోషములను బొందక ద్వయశూన్యుండవై, ద్వయాద్వయముల నెడియెఱుక చేతం దగులుపడక, దుఃఖము లేనివాడవు గమ్ము, పరిపూర్ణము వెలుగక, ఆరిపోక, కదలక, నలిగిపోక, తగులుపడక, పగలు రాత్రులని లేక యున్నదని భావము.

ప॥ కూడిగురుశిష్యులిద్దఱు । వేడుకతో బయలునున్న విధమె
ఱిగెఱుక౯ । వీడిరిది లేనిదనుమా। చాటునయిక యేమిదో చదది
యేమో కానీ * వింటిరె మీరలిదియందులోనీ * జూడు మీ యెఱుక
ను వేడితివిడుమంచు । యీడుజోడును లేని యేకమై విలసిల్లెదది యే
మో కానీ * వింటిరె మీరలిదియందులోనీ॥ ౨౯౬॥

తా॥ శిష్యా! గురుశిష్యులిరువురు పరిపూర్ణసముద్రమునందు వాలలాడుచు యెఱుక లేనిదని విడిచిరి అది పరిపూర్ణము యొక్క చాటునయైన దాగియున్నటులలో చలేదు, యిది మీరు వింటిరిగదా, లేని యెఱుకను విడుమంచు వేడితిని, యీడుజోడు లేక, సమారహితమై, యేకమైయున్నదే పరిపూర్ణమని భావము-

ప॥ ఎఱుక నెఱుంగని బయలులో । గురుడును శిష్యుండు వారి
గొడవలు యిక మీ। రెఱుగరు యెఱుక నెఱుంగరు। యెఱిగినవన్ని
యును మీరె యేనునుళ్లక్కి * యుళ్లక్కి దానెప్పుడుళ్లక్కి * మరి
యింక మాటాడమా లెలేదాయెను। సరిలేని బయలై తెసరిపోయెన
టు మీఁద యేనునుళ్లక్కి * యుళ్లక్కి దానెప్పుడుళ్లక్కి॥ ౨౯౭॥

తా॥ శిష్యా! యెఱుకను యెఱుగని యీ పరిపూర్ణమునందు, గురుశిష్యులయొ

క్క నటనాదివృత్తులు,మీరెఱుగజాలరు,యెఱుక నైఱుంగరు, యెఱిగినవన్నియును మీరును నేనును, మనమిరువురబద్ధము, అబద్ధముయెప్పుడునబద్ధము, యికమాట్లాడుటకుమాటేలేదు,సరిసాటిలేనిబయలుమాత్రమేనిండియుండెను,నేనెప్పుడబద్ధమనిభావము

ప॥ అలభద్రాచలమనినబ। యలుగనుగు రైఱుగవలయునే

ఱుకనెవిష్ణుం। దులదోఁచిగురునికృపచే। నిలువకవిష్ణేగిపోతెని

శ్చయమిదెరా*కృష్ణదాసునిశ్చయమిదెరా * యిలలోనసెవరైన

యీకందార్థములలో। పలిగూడార్థముదెలియభ్రమనుజెందరు

వారునిశ్చయమిదెరా*కృష్ణదాసునిశ్చయమిదెరా॥ ౨౯౮॥

తా॥ శిష్యా! భద్రాచలమనినపరిపూర్ణమనియెఱుగవలయును, యెఱుకనైడు విష్ణువుయాపరిపూర్ణమునందుగనుపించి, గురుకృపచేతనావిష్ణువు, మటుమాయముగాబోయినయెడల, పరిపూర్ణమేనిశ్చయము, యిదియేకృష్ణదాసులవారియదార్థము, ప్రపంచముననెవ్వరైననీకందార్థములయందలి గూడార్థములనుదెలియుటచేత భ్రమనుజెందరు, యిదియేనిశ్చయము, గ్రంథకర్తయొక్కనిశ్చయమిదియేననిభావము,

ప॥ భాగవతులనారాయణ। యోగికిజానకియనేటియువతీ

మణికిఁ। బాగుగపుత్రుడనై భూ। భాగమునంగృష్ణుడనుచు

ప్రభవించినానూ* అనంతికిప్రభుడనై నానూ * నాగురుకృపచేత

నయమైనయీబోధ। నేగంటికన్నంతనీకుదెల్పుటకిట్లుప్రభవించి

నానూ*అనంతికిప్రభుడనై నానూ॥ ౨౯౯॥

తా॥ శిష్యా। భాగవతులనారాయణయోగికినిజానకియమ్మయనెడుదేవికిని, పుత్రుండనై భూమిమీదగృష్టండని పేరుపొందితిని, అనంతమునకుప్రభువునైతిని,నాయొక్కగురునివలనంబొందినయాబోధను, నేనుగనిన పరిపూర్ణమునునీకుదెలుపుటకొఱకై భూమిమీదనవతరించితినని భావము,

ప॥ దేశాటనంబుజేసితి। వ్రాసితిగ్రంథములుకొన్నివరగురు

శిష్యులే। చేసెడిచర్చలువింటిని। రోసితిమోహాద్యపేక్షరూఢి

గావినుమీ*నీవిట్టియారూఢతగనుమీ* దేశికుదయబుట్టజేసితి

శుశ్రూషోప। దేశముగనియుపదేశమిచ్చితిమెచ్చి రూఢిగవిను

మీ*నీవిట్టియారూఢతగనుమీ॥ 300

తా॥ శిష్యా దేశములన్నియునుదిరిగితిని, విశేషముగా కొన్నిగ్రంథములను వ్రాసితిని, గురుశిష్య సంవాదరూపకములైన గ్రంథములనుజదివితిని, వింటిని, మోహాపేక్షరోసివిడిచితిని, దేశికస్వాములవారి కటాక్షముకలుగునటుల చతుర్విధ శుశ్రూషలుగావించితిని, పరిపూర్ణమును గ్రహించితిని, ఆరూఢుండనైతిని, నిన్నుమెచ్చి నీకునుపరిపూర్ణభావము నిచ్చియారూఢతను బొందించితిననిభావము.

ప॥ ఏపురుషుడుగురువర్యుని। శ్రీపాదముబట్టలేడో చెలువుగ
నాతం। డీపుస్తకమునుజూచిన। నేపట్టుననిలువకేగునిదినిజమ
య్యా*నరులారమీామదిదెలియరయ్యా* ముదమునయిలువెడ
లిమోక్షసతీశుడై। సదయుడౌసద్గురునిసముఖమునకునేగునిది
నిజమయ్యా*నరులారమీామదిగానరయ్యా॥ ౩౦౧॥

తా॥ శిష్యా యేమానవుడుసద్గురుని శ్రీపాదపద్మములనుబట్టలేడో, అట్టిపశు
ప్రాయుడైన మనుష్యుడు యీగ్రంథమునుజూచినను, జరుపుచుండినవినినను, అప్ర
కృన నిలువకపారిపోవును, ఇదిసత్యము. ఓనరులారా యిదినిత్యమనిదెలియుడు, సం
తోషములోయిల్లువెడలి(అనగా=సంసారతాపత్రయాదులనువిడిచి)సద్గురుపాదము
లను నమ్మిసేవించినవారు పరిపూర్ణభావమునుబొంది జననమరణములులేనివారగుదుర
ని భావము.

ప॥ ఘనులీకందార్థంబులు।వినియీాసారాంశమునుగ్రహించి
నవారెల్లనుతుదమోక్షమునొందుదు।రనవరతమునిహసుఖంబు
లందుదురిలనూ*అష్టైశ్వర్యానందులై తగనూ* పొందుగధనక
నకపుత్రపౌత్రులుగల్గి। సంచేహముడిగినిశ్చలచిత్తములసౌఖ్య
మందుదురిలనూ*అష్టైశ్వర్యానందులై తగనూ॥ ౩౦౨॥

తా॥ శిష్యా యీాకందార్థదరువులను వినివీటియొక్క సారాంశములను గ్ర
హించిన పుణ్యపురుషులు జన్మాంతరమునపరమపదమునుబొందుదురు, సదానుఖానం
దములనుభవింతురు, ధనకనకవస్తువాహనములనెడు అష్టఅయిశ్వర్యములను అనుభ
వింతురు, పుత్రీపుత్రులను, మనమలుమనమరాండ్రునుగలిగి, నిర్మలచిత్తులైయుందురని
యీాగ్రంథకర్తయొక్క ఆశీర్వచనమని భావము.

ఇది శ్రీమద్రామవదుగు శివరామదీక్షితులవారికి ప్రియశిష్యుడు వల్లూరు-
రామకృష్ణయ్యగారును. వారికిప్రియశిష్యుడు మహేశ్వరుండును, వారికి ప్రియశిష్యు
డు కోటప్పదేవరయును. వారికిప్రియశిష్యుడు పోకల - శేషాచలాహ్వయుండును,
వీరిచే మున్నూటరెండుపద్యములకు తాత్పర్యమువ్రాయబడినది.

సర్వంబును-సంపూర్ణము.

